శ్రీ

అపూర్వాద్భుతచరిత్రయగు

# సకలానందము.

నవీనప్రబంధము.

ఇది

గోదావరిజిల్లా, పెద్దాపురముతాలూకా, కిర్లంపూడిగ్రామ
నివాసుండును, శ్రీ సీతారామచంద్ర పాదభక్తుండును, ముత్య సీతన్నగారి దత్తపుత్రుండును,
నయిన

ముత్య సూర్యనారాయణమూర్తిశర్మ

చేత రచియింపంబడి

కాకినాడలోని జగన్నాయకపుర వాస్తవ్యులును,
బ్రహ్మర్షి వేదశాఖలునగు
బ్రహ్మశ్రీ
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులవారిచే
పరిష్కరింపంబడి

కాకినాడ:
శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు
పోతాప్రగడ బ్రహ్మానందరావుగారిచే ముద్రింపంబడి
గ్రంథకర్తచే బ్రకటింపంబడియె.
1913 సం॥ మేనెల.



వెల రు 1-2-0
టపాఖర్చు 0-2-0

శ్రీ

అపూర్వాద్భుతచరిత్రయగు

# సకలానందము.

నవీనప్రబంధము.

ఇది

గోదావరిజిల్లా, పెద్దాపురముతాలూకా, కిర్లమపూడిగ్రామ
నివాసుండును, శ్రీ సీతారామచంద్ర పాదభక్తుం
డును, ముత్యసీతన్నగారిదత్తపుత్రుండును,

నయిన

ముత్య సూర్యనారాయణమూర్తిశర్మ

చేత రచియింపంబడి

కాకినాడలోని జగన్నాయకపుర వాస్తవ్యులును,
బ్రహ్మణ్యమేధాశాలులునగు
(బ్రహ్మశ్రీ)
కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులవారిచే
పరిష్కరింపంబడి

కాకినాడ:
శ్రీ సుజనరంజనీ ముద్రాక్షరశాలయందు
పోతావఝ్ఝల బ్రహ్మానందరావుగారిచే ముద్రింపఁబడి
గ్రంథకర్తచే ప్రకటింపంబడియె.

1913 సం॥ మేనెల.





వెల రు 1-2-0
టపాఖర్చు 0-2-0

# ప్రకటన.

ఈగ్రంథము గవర్నమెంటువారి కాపీరైటు చట్టప్రకారము రిజిస్టరుచేయంబడియున్నది గనుక నితరులెవ్వరును దీనిని ముద్రింపఁగూడదు. అట్లుముద్రించినయెడల నష్టమునకుఁ బాధ్యులగుదురని యిందుమూలముగాఁ దెలియఁజేయుచున్నాను.

ఇట్లు గ్రంథకర్త,
ముత్య సూర్యనారాయణమూర్తిశర్మ,
కిర్లంపూడి.

# విన్నపము.

ఆదికాలములో లోపములను వెల్లడించుచు నుత్తమ మార్గములను బోధించు వేదశాస్త్రపురాణములు బయలుదేఱి దుర్గుణములను బోఁగొట్టి సంఘమును సూర్యచంద్రాది మండలములలో సంచారము సేయునంతటి యున్నతస్థితికిఁ దీసికొని వచ్చినట్టు మనపూర్వకాల చరిత్రలవల్లఁ దెలియుచున్నది. తరువాతఁ గాలక్రమమున మనదేశముం బాలింపవచ్చిన తురుష్కహూణాది విదేశీయుల నాగరికతకుఁగూడ నీతిగ్రంథములే మూలములని దేశచారిత్రము లెఱింగిన బుద్ధిమంతులు వ్రాయుచున్నారు. ఒకరు వ్రాయుచున్నారననేల? ఒకరు చెప్పుచున్నారననేల? నలుగురునుగూడి ముఖప్రీతి స్తోత్రములకు సంతోషింపక సత్యమునందాదరము గలవారై తమయందలి లోపములను దిద్దుకొనుటకును, ఘనమార్గములను సాధించుటకును నిర్ణయించుకొని పట్టుదలతోఁ బనిచేసినయెడల వారు బాగుపడుదురని యెవరికిఁ దెలియదు? తరువాత ననేకహేతువులచే మొదటియున్నతస్థితి చాలభాగము తగ్గిన మధ్యకాలములో సైతము మనలో లోకజ్ఞమూర్ధులైన కొందఱు మహనీయులచే నప్పటిస్థితిఁ బట్టి వేణుగోపాలశతకము, రామలింగేశశతకము, సుమతిశతకము మున్నగు కొన్ని చిన్నచిన్న గ్రంథములును, వేమనశతకములోనగు నొకటిరెండు కొంచెము పెద్దగ్రంథములును రచింపఁబడుచు వచ్చినవిగాని బలాయుఃకాంతినాశనహేతువైన సంగమమే బ్రహ్మానందమని బోధించు శృంగారకావ్యములపైఁ గలవిశేషాదరముచే స్తోత్రముల కుబ్బిపోవు మనసంఘము నిందాస్పదములని భ్రమపడి గౌరవింపకుండుటచే నంతగానభివృద్ధినొందలేదు. అయినను బుట్టినమట్టుకట్టి గ్రంథములిప్పటివఱకును నిలిచియుండి నీతిమంతులబుద్ధినాకర్షించుచునేయున్నవి. నాగరికులైన పైవిదేశీయుల గ్రంథములు చూచి యిప్పుడిప్పుడు కొన్ని పుస్తకములు పుట్టుచున్నవి గానియవి యల్పమతపాక్షికములగుటచే నెట్టియుపయోగమును జేయక మఱింతకలహమునే పెంచుచున్నవి. ఉక్తరీతినుత్తమగ్రంథములు రచింపంబడక నీతిమాలినపుస్తకములు చాలరేగుటచేతనే మనసంఘము క్రమముగా బలహీనమై, శక్తిగోచరమైన మహర్షిమతమునందశక్తిచే నమ్మకము చెడఁగా యుశ్శాములచేఁ గల్పింపఁబడి యభివృద్ధి భంగములైనయి

నేకాల్పమతములు దాల్చుచు, నైకమత్యశూన్యమై, యెట్టిస్వాతంత్ర్యమును నాగరికతయును లేక, కొందఱు ద్వీపాంతరవాసులు మనమంత్ర శాస్త్రియోగశాస్త్ర విషయములనుసాధించి మనోబలము (తపశ్శక్తి) లేక (Mesmerism) మెస్మెరిసమ్ము వల్లనే వార్తలునడుపుట, స్వరూపము లెత్తుట, సకలరోగములను నివారించుట, "అఖిల ! జీవవశ్యపరివృత్తి వ-శిత్వమనఘ" అని మనమహర్షులు వ్రాసినట్లు చేతనాచేతనములను వశపఱచుకొనుట మొదలైన యద్భుతకృత్యములు సేయుచుండుటం జూచియుం, జిరకాలమునుండి దురభ్యాసము గల్గినదగుటచే మొండిపాఱి స్వమతదూరమై, యిప్పుడనంత దురంత దురవస్థా ఘోర సముద్రములో మునింగియున్నది. కావునఁ బూర్వకాలీనార్యమధ్యమకాలీన విదేశీయనాగరికతకాదిమూలమై, యుత్తమ మనోబలజ్ఞానప్రధానమై, మానవముఖ్యధర్మమైన వేదశాస్త్రపురాణమతము మహాత్ముల ప్రతిష్ఠాముహూర్తబలముచే నెంతమంది యణఁగఁద్రొక్కఁజూచినను జెడక మన భాగ్యవశమున నిలువంబడియే యున్నది గాన దానిననుసరించి యిట్టిమనసంఘమును. మఱల మొదటి యున్నతస్థితి కుద్ధరింప నెంచి, లోపంబులం జూపుచు నుత్తమ మార్గములను బోధించు నీసకలానందనామక నవీనప్రబంధమును సులభశైలిలో నొకయథార్థహితవాది వ్రాసినాఁడు కావుననిష్ప్రయోజనములైన పాడిపాడికతలతో నాయువువృథావ్యయము సేయక సకలపదార్థగుణవేద్యులైన పండితులైహికాముష్మిక జ్ఞానసంపాదనమునందు విద్యాశ్రద్ధను, కృషివాణిజ్యాదులయందు వృత్తిశ్రద్ధను నిల్వఁబెట్టి విద్యావృత్తులను సార్థకములనుజేసి "పరోపకారః పుణ్యాయ" "పరోపకారార్థమిదంశరీర" మ్మను నార్యోక్తులు భగవత్స్వరూపములని నమ్మి, కాలానుసారముగా నింతటినుండి యిట్టిగ్రంథరచనలకు మొదలుపెట్టి క్రమముగా నున్నతమార్గసాధకులై, లోకమును బాగుసేయుందలంచుచున్నాను.

(౨) ప్రస్తుతలోకస్థితినిబట్టియు నిందలిరచననుబట్టియుఁ దానుజేసిననిబంధనములకుఁ దానేబద్ధుండుగా నట్లిందే వెల్లడించుటచూడఁగా "నింతవఱకునేనును లోకముతోడిపాటివాఁడనే" "సంఘేశక్తిః కలౌయుగే" యనున్యాయముననుసరించి యింతటినుండి మనమందఱమును గలసినీతితో నుత్తమ మార్గసాధకులమై లోకమునకు మార్గదర్శకులమైయుండవలసియున్నది" అని తెలుచున్నది గనుక దీనిం జూచినతోడనే తొందరపడి యాగ్రహావేశులుగాక, పక్షపాతములేక సత్యా

న్వేషణబుద్ధిలోఁ గడవఱకును జిత్తగించి, పాంచభౌతికశక్తిననుసరించి వస్తుతత్త్వమును జక్కఁగా విమర్శించి, యొకటిరెండు వస్తువులను బ్రమాణముగాఁదీసికొని ఖండనవాదముసేయఁబోక, సాముదాయక స్థితిమీఁదరసనిరూపణము సేయుచు గ్రంథకర్తపరిశ్రమమునుగూర్చి యోజించి సకలజనులును మనమార్యసంతతిలో నివారమున్నగౌరవమును నిలిపెదరని నమ్ముచున్నాను.

(3) చివరవరకు నొక్కరీతిశయ్యనుదీసికొని వచ్చువాఁడైయుత్తమార్గమును సంఘటింపఁ జేయుచో నచ్చటచ్చటం దాను జేసిన భాషావిషయిక నిబంధనములకిందేతాను బద్ధుండుగా లేదుగనుక గుణదోషవిభాగజ్ఞులైన రసగ్రహణ సమర్థులునీతిచర్చయే ప్రధానముగాఁ గలయిందలి కవిత్వగుణాగుణములనుగూర్చియు, నలంకారవర్ణనాదిప్రబంధ లక్షణములనుగూర్చియు, రసకాలానుసరణములైన యన్యదేశ్యపదాద్యుచిత రచనలను గూర్చియు నంతగాఁజర్చింపక నీతియును బ్రయోజనమును గ్రహించి యానందింప వేఁడుచున్నాను,

ది 1 జూలై 1908 సం॥ ఇట్లు,

సకలానందార్థి.

ప్రకటన.

1. చింతలపూడి వెంకటజోగారావు పంతులుగారు, కాకినాడ.
2. బస్వా అప్పారావుగారు, ముక్కొల్లు.
3. కొక్కొండ రామశేషగిరిరావు పంతులుగారు, కిర్లంపూడి.
4. యల్లప వీరాస్వామిగారు, డిటో.
5 మోటుపల్లి వేంకటరత్నమునాయఁడుగారు, డిటో.
6. విజనూరి రామకృష్ణయ్యగారు, డిటో.
7. తూముస్వామిగారు, డిటో,
8. పెనగంటి స్వామిగారు, డిటో.
9. యల్లప వీరరాజుగారు, డిటో.
10. సగన పెద వేంకటరాయఁడుగారు, చిల్లంగి.

ఈపెద్దమనుష్యులీగ్రంథము ముద్రింపించుటకుఁ గొంతధనమిచ్చిరి గనుక భగవంతుండు వీరికి సర్వదాయఖండైశ్వర్యాయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధులిచ్చినమగ్రానుగ్రహంబున రక్షించుచుండుఁగాత. ఇట్లు,

గ్రంథకర్త.

# సవరణ.

ఇది మిగుల నుపయోగించు గ్రంథముగాన నీక్రిందిసవరణలనుబట్టియు, శుద్ధాశుద్ధపత్రికను బట్టియు ముందుగా సవరించుకొనవలెను.

(1) ప్రథమాశ్వాసములో 13 వ పుటలో 50 వ గీతము యొక్క "స్వేచ్ఛలోడ స్త్రీలందఱు వేశ్యలుగను" అను మొదటిపాదమును దీసివేసి దానికిబదులుగా "అతివలందఱుఁ స్వేచ్ఛవేశ్యలయి తిరుగ" అనిచదువుకొనవలెను.

(2) పంచమాశ్వాసములో 125 వ పుటలో 75 వ సీసముతరువాత నీక్రిందివచనమును, రెండుపద్యములును జేర్చిచదువుకొనవలెను.

"వ. ఇట్లుపరిపూర్ణాద్వైత పరబ్రహ్మమూర్తియు, జనకునివలె సంసారిసన్యాసియునయిన బ్రహ్మానందప్రభువు దుర్జనదుర్జయ నిరంకుశయుక్తియుక్తవాగ్బలంబున నిజరాష్ట్రప్రజలకు బోధించుచు, దుర్మతములను ఖండించుచుఁ, బరిశుద్ధాస్తికమతము నంతటను వ్యాపింపఁజేయుచు సకలవిధములచేతను బ్రజలత్యంతసౌఖ్యంబుల నొందునట్లుగా రాజ్యపాలనంబు సేయుచుండె. మహామతి మన్మథులునాత్రిము దురభిమానులయి బౌద్ధులవలె విదేశగతులయిరి. అంతవసంతర్తువును వచ్చెనప్పుడు. 76

— వసంతర్తువర్ణనము —

చ. సకలజగత్ప్రభుండు నతిసాధువునౌ రఘురామమూర్తి పు
ట్టుకగలదౌటచేతను గడుంగడు సంతసమందుచుఁ ధరఁ
సకలజనంబులుత్సవము సల్పుచుఁ గాలవతంస మిద్దెయం
చకలుషభక్తిపూర్ణమతులై వినుతించిరి తద్వసంతముఁ. 77

క. తనయుత్సవములు సేయఁగ
ఘనముదమందు జనులపయిఁ గంజాక్షుఁడు ప్రే
మను నిర్మలినకటాక్షము
నునిచెనాయన సూర్యచంద్రులొప్పిరి తేటఁ." 78

# —శుద్ధాశుద్ధపత్రిక.—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 4 | యున్నట్టు | యున్నయట్టు | 67 | 4 | గ్రొత్త | బల్ క్రొత్త |
| 3 | 22 | ర్ణనరయో | ర్ణనారయో | 68 | 17 | హింసిచు | హింసించు |
| 13 | 31 | నలువు | నలువు | 70 | 27 | తాఁకకుండ | తాఁకకుండు |
| 15 | 12 | జెందిన | జెందున | 71 | 4 | కోరికల్ | కోరికగల |
| 16 | 28 | మునకే | మునకును | 75 | 3 | గట్టిగ | గట్టుగ |
| 22 | 4 | వేయునా | వేయునాకతె | 79 | 17 | సంగనతఁడు | ననతఁడతుల |
| 24 | 29 | కర్మముల్ | కర్మ్రముల | 80 | 7 | శ్రేషుల | శ్రేష్ఠుల |
| 28 | 6 | రణగు | రణులగు | 84 | 25 | శ్నమునుబు | శమ్మ్రనుబు |
| 34 | 10 | రాయెన్నఁడై | రాయెవ్వఁడై | | | ణ్యాము | ణ్యామ్ము |
| 35 | 1 | సమునర్ధ | సమరనర్ధ | 87 | 1 | జేయుట | జేయు |
| 36 | 17 | రదాధరా | రదాదరా | ,, | 4 | గారిదృడ | వారిదృఢ |
| 37 | 9 | నట్టి | నట్టు | 91 | 16 | చుండెప్పు | చుండెనిప్పు |
| ,, | 13 | ఆమె | ఆమె | 94 | 11 | లేదంటు | లేదటం |
| ,, | 14 | కనూత | కమాత | 97 | 5 | గూడఁజెట్ట | గూడఁజెట్టె |
| 42 | 8 | డికరఁగ | లికరుగ | 107 | 15 | జూచుదు | జూపుదు |
| 51 | 27 | పతపయ | పరతియ | 109 | 5 | నదున్ | నందున్ |
| 53 | 15 | జేయుట | జేయుటయు | 112 | 6 | విసిగిచు | విసిగిము |
| 55 | 11 | కొనవ | కొనఁగవ | ,, | 20 | సంతతస | సంతస |
| 56 | 14 | దినన | దినదిన | 118 | 9 | గిర్తినినిల్పు | గీర్తినిల్పు |
| 57 | 27 | మందుఁబుట్టు | మందుఁబుట్టి | 126 | 27 | జేయబల్ | జేయుబల్ |
| 65 | 18 | సారనసే | సారసనే | 128 | 2 | నెత్తికప్పు | నెత్తికవ్వు |
| 66 | 14 | జిహ్వా | బల్ జిహ్వా | 132 | 27 | చాల ? | కాల ? |
| ,, | 15 | బిల్ల | లేఁబిల్ల | | | | |

శ్రీ

# సకలానందము.

## పీఠిక.

మ. ఒకనాఁడేను మదీయజన్మపురమై యొప్పారు ముక్త్యాలలో
సకలప్రాణహితాప్తబంధువులతో సంతోషచిత్తుండనై
యకలంకంబగు భారతప్రముఖభవ్యశ్రావ్యకావ్యంబులం
బ్రకటంబౌ కవనోపయోగములు సంభాషించుకాలంబునన్. 1

మ. అమలజ్యోతిషధర్మశాస్త్రముల భవ్యస్వార్థకర్తంబులం
దమితప్రజ్ఞుఁడు సాహితీధనుఁడు పద్మాధీశపాదాంబుజ
భ్రమరాత్ముండు మదీయపూర్వజుఁడు సుబ్బారాయధీరుండు దాఁ
గమనీయోక్తుల నన్నుఁ జూచి పలికెం గారుణ్యపూర్ణాత్ముఁడై. 2

### పూర్వకృతిగుణము.

గీ. పూర్వులసమాన లసమానబుద్ధిబలులు, చేసినకృతులు బహుగుణభాసురములు
గాన వానియందుండు శృంగారరచన, జనులబుద్ధులం జెడఁదీయఁ జాలకుండె. 3

గీ. దానిని దెలిసికొనలేక తగుదుమనుచు, నిపుడుగొందఱు గుణనీతిహీనములగు
పుస్తకములరచింతురు "పులిసిజూచి, నక్కవాఁతనుబెట్టుకొన్న" దనునట్లు. 4

గీ. వివిధలోకేశ్వరుండైనవిష్ణుమూర్తి, దాఁ "బరోపకారార్థమిదంశరీర"
మనియనేకజన్మములెత్తి జనులఁబ్రోచె, నరునకన్యమార్గము పుణ్యకరమె? యనుచు.

ఉ. ఇతరుల యట్లుగాక పదునెన్మిదియేఁడులనాఁడె సర్వస
న్నుతమగు సూక్ష్మధర్మము మనోహరరీతిని దెల్పునట్లుగా
నతులితవిష్ణుభక్తవిజయాహ్వయనాటకరాఘవాఖ్యస
చ్ఛతకములన్ రచించితివి తద్వరమార్గము విస్తరింపఁగన్. 6

### ఏతత్ప్రబంధలక్షణము.

గీ. నీమహోపయయ్యోను దోమచీమయయ్యో, ననునటులుగాక ప్రతిపద్యమందును సక
లోపకారసత్యార్థములుండవలయు, నట్టి కవనంబు శాశ్వతమై చెలంగు. 7

సీ. భాషీయపద్ధతి పట్టువప్పఁగనీక దీర్ఘసమాసంబు తెరువుఁబోక
గూఢార్థసమితిదిక్కునకేఁటి మాఁడక స్వప్నార్థములజాడ జాఁజనీక

చ. ఘనమతివాసమా నమెరికాఁ దగు మెస్మెరిసమ్ముఁ జూచియున్
మనమున సిగ్గుదాలుపక మంత్రము రోగము బూటకంబులం
చును నిరసించుపామరులు చూడఁగలేరు మునీంద్రచంద్రహృ
ద్వనరుహరంగసంగపదభంగ మదంగమదంగభృంగమున్. 21

## భగవద్దర్శనయోగ్యులు.

ఉ. నెమ్మదియున్ విరక్తియును నిర్మలభక్తియుఁ గల్గి నన్ను నే
నమ్మి సమస్తకర్మములు నాకె యొసంగుచుఁ గాఁపురమ్ములోఁ
గమ్మరపుర్వుచందమునఁ గ్రుమ్మరువాఁడు కలిం జతుర్థపా
దమ్మున నైన మామక సుదర్శనముం గన నర్హుఁడౌఁ జుమీ. 22

గీ. నన్ను దృఢమైనభక్తితో నమ్మువాని, కోరికలు తోఁచుతోడనే తీరుచుండు
నన్నె ముఖ్యుఁడౌగురువుగా నమ్మినీవు, వడసిన చదువెదీనికిఁ బ్రబలసాక్షి. 23

## శ్రీరామాజ్ఞ

చ. జనవినుతాంతరంగగతిఁ జక్రినియుక్తులు చెప్పి చిత్తవృ
త్తిని మఱలించి సంఘమును దీర్ఘప్రయత్నము నీది; ఖడ్గమున్
ఘనగాహిరంగమార్గమునఁ గైకొని ఢీకొను మొండిబండలం
గుసుముటనాడి; రెండునివి తోడ్పడుచుండుఁ బరస్పరంబిలన్. 24

గీ. ఇంక నేఁ జేయుపనికి నీవిపుడు చేయు, పని సుఖంబిడుఁగాన నీపనికిఁ దోడు
పడి నిరాతంకరీతిని నడుపవలసి, నట్టి రాజమాన్యమునాదియయ్యె భక్త! 25

వ. ఉభయతారకంబైన యీ నీప్రయత్నమే మున్ను పత్రయాగానంతరమునఁ బ్రశ్నోత్తరపూర్వకంబుగా నారదశౌనకాదులు ప్రసంగించియుండిరి. నాకటాక్షంబున నీకగి స్ఫురింపఁగలదు. కేవల నిష్పాక్షికసత్యమార్గమగుదానిని "సకలానంద" మను పేర రచించి నాకే యర్పించుమని పల్కి యాదయాళుండంతర్ధానంబు నొందినంత నేఁ దెలివినొంది యదియంతయు హఠయోగాధిష్ఠానపురుషావస్థాప్రభావంబని నిశ్చయించి భగవద్దర్శన సంతోషసమయంబైన యదియె శుభముహూర్తంబని యెఱింగి నిర్మలనిశ్చల మానసుఁడనై. 26

## ఇష్టదైవ స్తవము.

శా. శ్రీమత్సర్వజనప్రమోద మొప్పన్ సృష్టించుటన్ బ్రహ్మయై
ధీమద్వ్యాసవముఖ్యరక్షణమహాదీక్షన్ మహావిష్ణువై
భీమేంద్రాహితదుష్టశిక్షణగతిన్ భీముండు నైయుండు శ్రీ
రామాఖ్యత్రిగుణాత్మకాక్షరపరబ్రహ్మంబు భావించెదన్. 27

విఘ్నేశ్వర స్తవము.

మ. కలిమాయన్ బలహీనమైన నిజభక్తశ్రేణి యశ్రద్ధచే
నిలువంజాలక పోవువేదమతమున్ నిర్విఘ్నబోధాదులన్
నిలుపం బండితులందుఁ జొచ్చి చదువున్ నేర్పం గణేశత్వముల్
వెలయన్ శక్తినిఁ జూపి పూజగొను శ్రీవిఘ్నేశ్వరుం గొల్చెదన్. 28

సరస్వతీ స్తవము.

చ. హరికృతబోధసారమగు నాయతవేదవిధుల్ పురాణుఁడౌ
పురుషుని ఛాందసోక్తులని మూర్ఖమతంబులఁ దాల్చు మర్త్యదే
వరులను బ్రహ్మతుల్యబుధవక్త్రములం బడి సంస్కరించి శ్రీ
హరికులధర్మమున్ నిలుపు నా హరికోడలి భాషఁ గొల్చెదన్. 29

ఇష్టబంధు స్తవము.

మ. వనితాపూరుషవేదచోదితగతిన్ వర్తించుచున్ జాలమిం
చిన ప్రఖ్యాతివహించి భాసిలెడు శ్రీసీతాంబికావేంకటా
ర్యనితాంతానఘశీలదంపతుల సర్వార్థాళిసంప్రాప్తిసా
ధనమద్దేహనిదానమూర్తుల మదిన్ ధ్యానింతు నెల్లప్పుడున్. 30

మ. తమకుం బుత్రులులేని కారణమునం దత్తాత్మజుంగా గ్రహిం
చుమతిన్ నన్ బదునొక్కేఁడ్లవటుకున్ సొంపైన ప్రేమంబుతో
నమరం బెంచిన సూరమాంబఁ జినసర్వయ్యార్యు సుజ్ఞానమా
ర్గమునన్ వర్తిలు పుణ్యదంపతుల నశ్రాంతంబు భావించెదన్. 31

మ. తమజన్మాలు పరోపకారసరణిం దాఁటించుచున్ బంధువ
ర్గములో వన్నెయు వాసియుం గనిన శ్రీరామాంబికా సీతయా
ర్యమహద్దంపతు లెంతొ ప్రేమ నను దత్తాత్మోద్భవుం జేసికొ
న్న మృడానీశుల సాటివారలెపుడున్ నాచిత్తమం దుంచుతన్. 32

సీ. పుట్టినప్పటినుండిఁ బూర్ణమా ప్రేమతో సేవగూర్చుండు నన్నెత్తి పెంచె
నెనిమిదేఁడులనాఁటి కే కళానిధి నాకు స్మార్తకర్మముల క్రమంబు సెప్పె
దత్తునిగా నిచ్చు తఱిని నన్నే పెద్ద సిరుల నొందుమని యాశీర్వదించె
శ్రీరామచంద్రునే సేవింపుమీ ! యని యేజ్ఞానధని నాకు హితవు చెప్పె
నట్టి జ్యోతిషశాస్త్ర విద్యావిశేషు, ముత్య సుబ్బన్న నామకు నిత్యయశుని
నాదు పినతాత మక్కొల్లు నామపురని, వాసు మదభివృద్ధినిదాను భక్తిఁ దలఁతు

—కవిస్తవము—

క. ఇమ్ముగఁ దనవాక్సంపద, లమ్మహిజాజానికిచ్చి యతులితయశుఁడై
యిమ్మహిఁ దనరిన సుకృతిని, బమ్మెరకులపోతరాజు భక్తిం దలఁతున్. 34

సీ. శ్రమపడి యొలిచి దంతములతో నములుట విధియైన కొబ్బరిన్ వెక్కిరించి
యొలుచుకొనుటయు నములుటయుఁ గొంచెమైనను గల యరఁటిపండును హసించి
బలుతీపియైన గింజలు దీసి నమలంగ వలయు ద్రాక్షను సిగ్గువడఁగఁబలికి
వెనుక నేలాగు నున్నను నప్డు కఠినశిలనుబోలు పటికబెల్లంబు నెంచి
జిహ్వపైఁ బడ్డయంతనే శీఘ్రముగను, గరఁగి యతిమృదుమధురమై కడు ముదమిడు
నమృతఫలపాకమై యలరారు చళ్ళ, పిళ్ళవేంకటశాస్త్రి కవితఁ దలంతు.

—మిత్రస్తవము—

శా. అత్యంతోరుతమఃప్రధానగుణజాతాత్రస్థదోషాళి సం
స్తుత్యాత్మీయకరాళిఁ ద్రోసి నను భక్తున్ సూర్యనారాయణున్
సత్యన్ మత్ప్రియ నాదప్రాణహితులన్ సారాయురారోగ్య సు
ద్యుత్యాత్యాఢ్యులఁ జేసి కావఁదలఁతుం దోషాంతకున్ మిత్రునిన్. 36

—మహర్షిస్తవము.—

సీ. పెండ్లాము బిడ్డల విడిచి ఘోరారణ్యములకేగి బలునియమును ధరించి
శీతవర్షాతపాక్షీణబాధలకోర్చి యతిభయంకరతప మాచరించి
బ్రహ్మాండజాలప్రభావ మెల్ల నెఱింగి యెల్లవారలు దాని నెఱుఁగఁగోరి
కోటిసంఖ్యలుగల కోటానకోటు లద్వైతోక్త్యాదిశాస్త్రములు వ్రాసి
జన్మమంతయు లోకుల సౌఖ్యమునకె, ధారవోయుటచేఁ గడు ధన్యులైన
తపసులారా! ప్రమద బాష్పధారలొలుక, మ్రొక్కుచుంటి దీవింపరే! పుత్రునన్న.

—ఆధునికస్తవము.—

వ. అని యిట్లిష్టపదార్థంబులం జిత్తచిత్రఫలకంబున లిఖించి. 38

గీ. భర్తృహరి యతీంద్రుండు సుభాషితమున, మొదట మూర్ఖపద్ధతిఁ జెప్పి పిదప నీతిఁ
జెప్పుట యొడలిపై నున్న చెమట గడిగి, యత్తరులు పూయుటేగదా యనితలంచి

క. ప్రతివిషయంబున మూర్ఖుల, మతమును సుజనుల మతము సమయ దేశముఖో
చితధర్మంబులుఁ గ్రమముగు, గతిఁ దెల్పుదు వ్రాసినాఁడఁ గడఁకం దీనన్.

క. కవివరులు పక్షపాతము, రవంతయును లేక ప్రాగ్రచనలు గా కీ 40
కరువనగుణము గనుఁడీ! కే, శవుఁడే బలియైన సాక్షి సకలంబునకున్. 41



శ్రీ

సూర్యనారాయణమూర్తయే నమః.

# సకలానందము.

---

## ప్రథమాశ్వాసము.

—శ్రీరామాహ్వానము.—

క. శ్రీమంతుఁడవయ్యు సదం, బేమియు లేక యడఁకువయు నేకస్త్రీపైఁ
గామనము బూని లోక, స్తోమమునకు నీతిరీతిఁ జూపిన రామా!

క. అవధారు! సకలరక్షక! భవదంకితముగ రచింపఁబడు నూతనమై
భవసకలానందాఖ్య, ప్రవిమలకృత్యిరాజకథకుఁ గ్రమమెట్టన్నన్. 2

—నైమిశారణ్యవర్ణనము.—

ఉ. శ్రీనిజమందవాతగతిచేతనె పుష్పవృష్టుఁ దోలి దేవతా
శ్రీనిను నోషధీశతులచేఁ దదధీనతపోవిశేషస
న్మాని మహామనోబలవినాశితదౌష్ట్యమృగాళిచేత స
న్మానితపావనం బయిన నైమిశనామవనంబు భాసిలున్. 3

సీ. ఊర్ధ్వముఖమగు నాయు వధోగతికిఁ దెచ్చు గంజాయియుఁ బొగాకుఁ గానరావు
ముసలితనంబును ముప్పు నెత్తిని బెట్టు నావయుఁ బులుసును నసలె లేవు
పాషండనాస్తిక వాదులై నమ్మిక భంగంబు సేసెడు వాండ్రు లేరు
కనిపించినంతనే కంగారు పెట్టెడు సిగజుట్టితిరుగాడు స్త్రీలు లేరు
వటమహీరుహాకందసువ్రతమునీంద్ర, ముక్తికాంతాసమేతమై పుణ్యకీర్తిఁ
గన్న యాకాఱడవియందుఁ గలుషనైజ, బలములై నకాకులతోడిపాటు గాను.

—సత్రయాగదీక్ష—

ఉ. ఆవనమందు నీకలియుగాదిసహస్రశరద్వ్రతస్థులై
భావిని వేదశాస్త్రములు వర్తిలఁ బీడలు గల్గకుండ సు
శ్రీవరముక్తిదాముఁ గొనఁజేసిరి దీర్ఘపు సత్రయాగముం
బావనశౌనకాదికులపాఠకపాఠసనైష్ఠికాత్ములై. ౪

ఉ. ఆసమయంబునం దచటి కాగతుఁడైన మహాత్ము సత్తపో
భ్యాసపవిత్రు సూతుని గతాగతవేదిని బూజచేసి బ్ర
హ్మాసనమిచ్చి నిల్పి యితిహాసములాతనివల్ల వించు సం
తోసముతోడఁ గాలమును ద్రోసిరి వారు తదేకదీక్షతోన్. 6

వ. అట్లు బ్రహ్మానందసంధానంబుగా యాగంబు నెఱవేర్చుకొని సభాసీనులై యచ్చటికి వచ్చియున్న మునుల తపఃప్రభావంబులం గూర్చియుఁ దద్యాగనిర్విఘ్నపరిసమాప్తిం గూర్చియు నొకరితో నొకరు ముచ్చటించుకొను సమయంబున మహర్షిశ్రేష్ఠుండును, వేదవ్యాసశిష్యుండు నైన సూతుంజూచి శౌనకాదులిట్లనిరి. 7

—●● ◆ సూతశౌనకాదిసంప్రశ్నము. ◆ ●●—

క. సూతా! సకలకథారథ, సూతా! శ్రేయఃఫలప్రసూతా! గుణసం
ఘాతా! కామక్రోధవి, ఘాతా! మావందనమ్ము గైకొనుమిదిగో. 8

క. ఘనులైన మానులందఱుఁ, జనుదెంచుటచేత మాకు సంతసమయ్యెన్
ఘనతంగనె మాయాగము, వనజాక్షునికరుణ నన్ని పనులుం దీరెన్. 9

క. నీవరవాగమృతంబునఁ, బావనతంగాంచె మా బ్రతుకులు మఱియున్
నీవొక్క యుత్తరము మా, కీవలె; శ్రమమంచు నెంచ కేపనవినుమా! 10

చ. కలియుగమానవుల్ దురితకర్ములు కాకులయట్లులోకముం
గలఁచెదరంచు నీవనిన గాథలు మాదిన భీతినొంచెదం
జిలుకవిధంబునన్ హితవుసెప్పెడు వేదములన్నివారిలోఁ
నిలుచుటయెట్లు! మాక్రతువు నిల్వఁగఁజాలుటయెట్లు! చెప్పవే! 11

క. అనవిని సూతుండిట్లని, యెను నాకు శ్రమమనమన్నదే? తెలిసినదా
నిని జెప్పుట నాకెప్పుడున్, ఘనమోదము సుండు! వినుఁడు కదలనిబుద్ధిన్. 12

—కలియుగవేదస్థితి.—

సీ. మిత్రకతుభోక్తయై మిగులఁ దృప్తిఁగన్న హరి భక్తరూపుఁడై యవనిఁబుట్టి
యుక్తియను నినుపమూఁచలు గొనితెచ్చి శాస్త్రములనెడి పంజరముఁగట్టి
యందులో వేదంబులనెడి చిల్కలఁబెట్టి యింపుగాఁ దానె పోషింపుచుండ
నాభక్తుఁడింటలేనప్పుడు పలుగాకిమూఁకలూచలఁ దన్ని పొడిచియులసి
కొన్నియెటో పాఱిపోవును గొన్ని సూతి, యెక్కలు విఱుగఁ గ్రిందను బ్రుక్కిపడను
గొన్ని యాపంజరముపైనె కూలఁబడును, జిలుకపలుకులు మిక్కిలిఁ జెలఁగిరెచ్చ. 13

గీ. ఇంకఁ గొన్ని దినంబులకీధరిత్రి, నిండ బౌద్ధులుండఁగ శంకరుండు పుట్టి
ఖలుల నోర్చును మాయించి ఖడ్గమూని, వేదశాస్త్రముల్ రక్షించి వెడలఁగలఁడు. 14
క. అది చెప్పియుంటి నీకఁ గొ, న్ని దినంబులకెల్ల జనులు నీచసుఖంబుల్
మదిఁగోరి వేదగతులన్, మదమున దూషించి రెచ్చి మాపెడువేళన్. 15
గీ. సహజపాండిత్యమహిమచే శక్తిఁ జూపు, భక్తవర్యులు గొందఱు పావనమగు
మార్గమున వేదశాస్త్రసన్మహిమ నెల్ల, వెల్లడించి నిల్పఁగలరు భీతిలేక. 16
క. అందొక ఘనకార్యము గను, నందంబుగ నెంతయును వినుఁడని నేత్రములా
నందమున మూసి తెలిసిన, చందంబును జెప్పె నిట్లు చక్కని ఫణితిన్. 17

—●●◆ శంకరపురవర్ణనము. ◆●●—

మ. ధరణిన్ నూతనరూపసంపదలఁ గాంతింబై ప్రకాశించు సం
కరనామంబున నొక్కయూరు దనలోకంబైననున్ నిల్పి కాఁ
పురముం జేసిన సోమయాజినయినన్ మూర్ధాత్ముఁగాఁ జేసి సూ
కరమాంసంబు దినంగఁ జేసెడు మహాగంభీరసామర్థ్యమై. 18
క. కిరిమాంసాశన, సంధ్యా, తరుణీరతి, ధర్మశూన్యతా, విషమయభీ
కరతను, హాసితమ్లేచ్ఛా, శరదండధరాహిపురము సంకరపురమే. 19
సీ. కలమూరులోహపాత్రలె గాని స్వచ్ఛతం దప్పని పింగాణి చిప్పలేవి ?
పనికిరాని తులసీవనులె గాని పరంబుముందుంచు గంజాయి మొక్కలేవి ?
శిలలుంచు దేవళంబులె గాని పుణ్యావహావితంతు శరణాలయంబులేవి ?
బలుశ్రమంబిడు వేదపాఠశాలలె గాని సంతోషమిడు నాట్యశాలలేవి ?
యనుచుఁ బూర్వపురుషులలోని యంగడులను, మొక్కల గుడుల శాలల వెక్కిరించి
సాటిలేని నూతనవస్తుసమితిచేతఁ, గరము వెలుఁగొందుచుండు సంకరపురంబు. 20

—●●◆ ఉత్పాతసూచనలు ◆●●—

గీ. పొరలెత్తి కుక్కలెప్పుడు మొఱుఁగుచుండఁ
గోళ్ళుపగటఁ గాకులు రాత్రిఁ గూయుచుండు
గ్రుడ్లగూబలు గృహములఁ గోడబొటఁజేయ
లఁమ సంసారమును జేయు నాపురమున. 21

—●●◆ అన్యాయప్రయమానియము. ◆●●—

గీ. కల్లుసారాయినమ్ము పాకలుఁ, గటికదు, కాణములు, దోఁకపురుగులు గలచెఱువులు,
సెంగిలాకులవీథులు, నిండ్లదరిని, మిగుల లోఁతుకాల్వలుఁ గల్గి పొలుచుచుండు. 23

క. అన విని శౌనకుఁ డిట్లని, యెను దత్పురజనుల కర్మమెట్టిది! యట్లా
పనులువిమర్శింపక చే, సినయట్టి మహాత్ములెవరో చెప్పుముసూతా. 23

చ. అన విని సూతుఁడిట్లనియె నచ్చటియూనియనన్న గొప్పసో
పని నడిపింపఁ బూనుకొనువారలు చట్టము మంచిరీతి ను
న్నను బలులంచ గొండెలయి న్యాయముమాడక చెప్పకట్టుఁ బా
ట్లొనరిచియుంటచే నటుల నుండెననన్ విని పల్కిరా మునుల్. 24

క. పురినుండెడు నందఱు సో, దరులవలెఁ బరస్పరసుఖదగతులరయకుం
డిరె! యనఁగా విని సూతుం, డురుచర్చాకరసుబుద్ధియుతుఁ డిట్లనియెన్. 25

గీ. పన్ను లెక్కువగట్టి యాపన్ను లైనఁ, బ్రజలబాధపెట్టి తమపై వారివల్ల
బిరుదములొందఁగోరెడువారికోరులసౌఖ్య, మేల? యనియతండుమఱియునిట్టులనియె.

## శంకరపురజనవర్ణనము.

వ. ఆపురంబునం గాఁపురంబుసేయు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర చండాలాది సకలవ
ర్ణజనములును శిష్టాచారులనియు, భ్రష్టాచారులనియు, నుభయాచారులనియు మూఁ
డుతెరగతులుగా వర్తింతు రందు రవ్వారియందు. 27

## శిష్టాచారబ్రాహ్మణులు.

శా. వేదంబుల్ పఠియించి కర్మపరులై వీతాశులై యూహకు
ర్వాదంబుల్ విడనాడి శాంతులయి భాష్యవ్యోగ నిష్ఠాత్ములై
నాదబ్రహ్మముఁ గాంచుచున్ ఖిలులునిందల్ సేయ నానందులై
యూదిత్యప్రియులై వెలుంగుదురు శిష్టాచారవిప్రోత్తముల్. 28

క. చదువులు తప్పక చదువుట, చదివించుట చదివినట్టి సరసక్రియలన్
ముదమునఁ జేయుచు నుండుట, వదలక చేయించుచుంట పని వీరలకున్. 29

సీ. పూఁటింటికాఁపురంబును, జల్లనగునీటితానంబు, శుభభస్మధారణంబు
పత్యగ్రగూఢమై పరకాంతలకహాస్యమై రాజమాన్యమై యమరువేష,
మఖిలజనులుమ్రొక్క నర్హమా సంచార మతిశుచిపాకగృహాదికంబు,
నుపనిషద్వాక్యార్థ విపులకాలక్షేప, మఖిలదేవార్చనాత్యంతనిష్ఠ,
శమదమజ్ఞానవైరాగ్య విమలశీల, మతుల నిశితవాగ్బాణమహాధనంబు
గలిగి బ్రహ్మవర్చస్సుతో వెలుఁగువీరి, నతిఖలుఁడును భూదేవత లనకయున్నె? 30

సీ. కాలానుగుణ్యసౌఖ్యము నిచ్చుఁ బూరిల్లు భస్మమున్, జలినీళ్ళు బలమునిచ్చు
వస్త్రముల్ మూఁడు నబలై హ్యావేషంబు తేజస్సుఁ దనువందుఁ దిరము సేయు

జనగౌరవం బిహసౌఖ్యంబునిచ్చు, సదాచారమారోగ్య మలరఁజేయుఁ
వేదాంతదేవార్చనాదులు భూలోకవాసనల్ ద్రోసి కైవల్యమిచ్చు
శాంతవైరాగ్యములు చిత్తశాంతినిచ్చుఁ, బ్రబలవాక్శుద్ధియాప్సిత ప్రాప్తినిచ్చు
బ్రహ్మవర్చస్సు బ్రతుకును బలముపఱుచు, నహహ ! వైదికంబువిడువ నర్హమగునె 31

క. మనుజులలో బ్రాహ్మణుఁడై, జనియించియు, మంచిచదువు సదివియుఁ దెలివిం
గనియును వైదికవేషము, గొనకుండిన రెండుకాళ్ళగొడ్డనఁదగదే ? 32

క. ఏమతమునకామతమే, శ్రీమతమనుచుందురింత శ్రేష్ఠాచారం
బామతమే దేశములో, నీమహినున్నదొ గుణముగ్రహించియరయుఁడీ. 33

—రాజవైశ్యశూద్రులు—

చ. వినయ వివేకముల్ గలిగి విప్రుని దైవమురీతిఁ జూచుచున్
ఘనతరధర్మకర్ములయి కాలవశంబుననల్పవంశులై
జనులునుతింప లేదను విచారములేక సదాముదాత్మలం
దనరుదురట్టిక్షత్రియజనమ్ములు వైశ్యులుశూద్రులప్పుడిన్. 34

—అధమజాతి—

క. పాపంబునవచ్చెనుమన, కీపుట్టుకయనుచు జీవహింసవిడిచిస
ద్వ్యాపారముఁగొనివినయముఁ, జూపుమరట్టికడజాతి సుజ్ఞానముతోన్. 35

—బీదలు—

క. రెక్కాడినడొక్కాడును, డొక్కాడినబ్రతుకుడక్కు డొక్కయురెక్కల్
మిక్కిలిచక్కఁగ రెక్కాడనఁ, జక్కనియిల్లాలు చిక్కు, సంతతిగలుగున్. 36

క. ఆలియుబిడ్డలుగలిగిన, బేలతనముఁద్రోలఁజాలి వృద్ధులమైనం
జాలామేలౌలీలం, గాలంబేలంగఁబోలు ఘననాకమదే. 37

క. అనిజనసమ్మతమైతగు, వినయంబును, బాటుపడివివేకధనంబుల్
ఘననిజకులహితగతిచే, ననయమునార్జించుచుందురానిరుపేదల్. 38

-స్త్రీలు-

గీ. తగనివేషముల్ వేయక మగనిదేవు, రీతిఁజూచుచు శ్రీరంగనీతులెప్పుడుఁ
జెప్పకయతిమనశ్శుద్ధి నొప్పుచుందు, రట్టిసకలసత్కులకాంతలాపురమున. 39

విధవలు.

క. క్షితిపతులును బంధువులును, బతిమాలఁగ సహగమనము వదలితిమప్పుడీ
బ్రతుకే స్థిరమా ? యని స, ద్వ్రతమూనుదు రావిధవలు బ్రహ్మప్రజ్ఞన్. 40

చ. అనయము మూలడాఁగి శిశుహత్యలు సేసెడు ప్రాఁతరండలన్
ఘనమగు స్వేచ్ఛపీఁకిఁబడి నాథులఁ జంపెడు క్రొత్తరండలన్
బనివడి బండవాదములు పన్నుచునుండెడు మొండిరండలన్
జనువున వీరితిప్పెదరు చక్రనియంతలు ముక్తిరీతికిన్. 41

అత్తలు.

చ. కులమును వృద్ధిఁ జేసికొనఁ గోడలిఁ దెచ్చుటచే నదెట్టిత
ప్పులనొనరించినన్ విసుగుఁబొందక నీతినిఁ జెప్పియేరికిం
దెలియఁగ నీయకుండుటయె తెల్వికిలక్షణమంచు నట్టియ
త్తలు తమకూఁతులం బలెను దప్పక మాతురుపుత్రభార్యలన్. 42

కోడండ్రు.

క. సతియగు దానికి దైవము, పతియైనపుడతనిఁగన్న వారుపరమదై
వతములని యట్టికోడం, డ్రతిభక్తినిఁ గొల్చుచుందు రత్తనుమామన్ 43

—కొడుకులు—

క. పురుషార్థలాభసాధన, వరదేహముగన్న వారు పరదైవములం
చురుభక్తిఁ దల్లిదండ్రుల, నరసిభజించుచునె యుందు రట్టికుమారుల్. 44

—వేశ్యలు—

గీ. భరతసంగీతఘనశాస్త్రపాలనంబుఁ, జేసికొనుచుఁ దదానందసిద్ధివలనఁ
బరమవైరాగ్యచిత్తలై బ్రహ్మచర్య, విహితకృత్యలై యుండ్రట్టి వేశ్యలెల్ల. 45

—ఫలము—

క. ఈరీతి పుణ్యమతులగు, వారలుగొందఱు విడువక వసియించుటనా
యూరాశ్లేట్విధము, గారూపవినాశనంబు గాకుండెనిలన్. 46

—భ్రష్టాచారబ్రాహ్మణులు—

సీ. ఉదయమ్మున నెలేచి యుదకమ్ములోపల స్నానంబు సేసి సంజలుబుసేయు
జాముప్రొద్దెక్కినం జపమనికూర్చున్న సంసారకృత్యముల్ జరుగకుండు
ధర్మముల్ సేసినన్ ధనమంశయు నశించు బిచ్చమెత్తవలయు వృద్ధదశను
సత్యమాడినఁ గార్యసాధనవేళల దమ్మిడీయైన లాభమ్ము లేదు
దైవమును నమ్మి యూరకే తలఁచినయెడ, నోరునొప్పియే ఫలమిట్టి ఘోరకృత్య
ములివియేల? యనిసుఖము గలిగి విఱ్ఱ, వీఁగుచుండు భ్రష్టాచారవిప్రగణము. 47

సీ. జుట్టుచిన్నదైయున్న సొగసులేదదిగాక తలయూరుకదు దెబ్బదగిలె నేని
యనివిచారించి ఫాలావక్షశ్శిరోజమై కత్తిరింపులనలరుచుండు
హాయిగా బుద్ధుల నన్ని వేళలఁ ద్రాగి వారనారులఁ గోరి చేరుచుండుఁ
జౌర్యముల్ సేయుచు సతతంబు జూదంబు లాడుచు స్వేచ్ఛగాఁ బాడుచుండు
నిద్రభంగంబు నొందినం దెగులువచ్చు, ననుచు రాత్రిఁ జేయఁదగినపన్నుల నెల్లఁ
బగటివేళలఁ జేయుచు మిగులవిజ్ఞ, మిఁగుచుండు భ్రష్టాచార విప్రగణము. 48

సీ. విధవను బెండ్లాడి వివిధ మాంసములు దిం చిదిమంచిమతమని వదరుచుండు
గురులకుమిత్రులకును హానిఁ జేయుచు మాత్సర్యశీలురై మసలుచుండు
రెండక్షరములు నేర్చికొని చెప్పఁజాలని తలవిసురుతో మనుచునుండు
నన్నియు సరిగాని యాచారములనె చేసిరని పూర్వులను దూషించుచుండు
డబ్బె పావనంబని యెంచి యబ్బనైన, దెబ్బలాడించి యాడించి యబ్బురంబు
పుట్టఁగచ్చేరు లెక్కించి బోనులెక్క, తప్పుసాక్ష్యము లీగుంపు చెప్పుచుండు. 49

గీ. స్వేచ్ఛతోడ స్త్రీలందఱు వేశ్యలుగను, జేయుచును వేశ్యలకుఁ బెండ్లిసేయఁదలయు
నంత్రము గొంద ఱెంచార్యమతానుగుణము, గాని లోకోపకారమార్గంబుగలదె ? 50

క. అతిసౌందర్యము వెలయం, బ్రతిదినమున మొగముకేచు మంగలిపొందులీ
మతిమంతుల పెట్టెలలో, సతతంబును మెఱయుచుండుఁ జకచకరుచులన్. 51

గీ. రొట్టెయును నుప్పుఁ బిండియు రోజురోజుఁ, దిందు ; రంచులేని పటముఁ, దిలకహీన
ముఖముబోడితలయునుండె బుద్ధిమంతుఁ, డిదియె నాగరికతయని యెంచుకొనునె ? 52

గీ. పెత్తనము దాల్చి విధవలు పెండ్లియాడఁ, గానె జగములో విధికృతమైనవారి
వేషమీ మగలను బొందె ; వివిధములగు, నింటిపనులింకఁ జేయుదు రేమొ వీరు. 53

గీ. ఇతర మతమువారెక్కడకేగినను స్వ, ధర్మనిరతులై యుందురు తప్పకుండఁ
దమదు దేశముఁ జొచ్చు నితరమతముల, వారివేషముల్ దాల్తురు వీరకనుఁడు. 54

ఆ. జుట్టు క్రీస్తుమతము, బొట్టు మ్లేచ్ఛమతము, కట్టు బ్రాహ్మమతము గుట్టు బౌద్ధ
మతము, పుట్టు వేదమతమిట్టి పంచమ, తత్త్వమార్యసమ్మతమ్ము గాదు. 55

గీ. ఆర్యమతమందుఁ గల పరమార్థమెఱుఁగ, రన్యమతమందుఁ గల పరమార్థమెఱుఁగ
రదియె మంచిది దిదియె చెడ్డదనుటెగాని, కాంచినట్టి మేలేదియో కానఁబడదు. 56

గీ. దయయు సత్యంబు జ్ఞానంబు దైవభక్తి, సకలమతసమ్మతములై యొసంగుచుండెఁ
గాననివి యున్న నంతటం గలుగుముక్తి, యున్నదివిడిచి మతమొకటి యొందనేల. 57

చ. పరమతమత్సరుల్ సలుపు పామరనిందలుఁ దుచ్ఛమౌ నిహా
స్థిరసుఖబోధముల్ విని మదిన్ స్వమతార్థముఁ జర్చసేయకా

పరులకు సేవ సేయఁజని భక్తియు జ్ఞానము లేక యెప్పుడుం
బరజననిందయే సలుపు వారికి దేవుని క్షేమమగల్గునే ? 58

చ. అనితరచర్చతో మతము లన్నియుఁ జూచిన వీరి పెద్దలే
యనుభవమైనపిమ్మట యథార్థమెఱింగి ఘనార్యసన్మతం
బును గొనుటం గనుంగొనియుఁ బూనిన దుర్వ్యసనంబుచేత నీ
మనుజులు దగ్ధవాదములు మానరు, ప్రాజ్ఞులు దీని మెత్తురే ? 59

సీ. ఆర్యపండితుఁ డుపన్యాసమిచ్చునటన్న నేదేని మిషఁబన్ని యెటకొ పోవు
నొకవేళఁ బోవకయున్నచో నదియేమి సరసమోగాని యాసభకుఁ బోఁడు
వదలక యాహ్వానపత్రికం బంపినఁ జని మాటలాడక చదికిలఁబడుఁ
బట్టుతో సభ్యులు పలికించినన్లైన, నన్నియు మంచివే యనివచించుఁ
దద్విషమున నొప్పికొనియుఁ దాను దెచ్చి, పెట్టుకొన్న సాంకర్యమున్ విడిచి శుద్ధి
నందఁదగిన ప్రాయశ్చిత్త మరసికొనఁడు, వీరిలోన సామాన్యకోవిదుఁడు బళిర ! 60

గీ. అంచితాఖండయుక్తి బోధించి శ్రమము, గన్న స్వమతస్వదేశ పక్షునిఁగాని
వానినేఁగాని చేసినవాఁడుగాని, హరిహరాద్యులైనను ద్రిప్ప ననువుగాదు. 61

గీ. విహితకర్మవిహీనత వెల్లడించు, బోడితల ; తప్పుగతిఁ దెల్పుఁ గోడిజుట్టు
ననియమముఁ దెల్పు బహుచిత్రమైనబొట్టు ; మతముతలకెక్కె దింప బ్రహ్మ తరమగునె

క. ఇఁకఁ బలుకనుకులేటికి ? వీ, రికస్థిరములగు నిహసుఖ రీతులయందే
త్రికరణశుద్ధిగఁ దలఁపులు, ప్రకటంబగుచుండు ; లేవు పరసుఖకాంక్షల్. 63

పండితులు

సీ. అతికష్టతరవేదగతి విధించెనుగాని బహుభోగద స్వేచ్ఛఁ బలుకలేదు
శిలలఁ బూజింపఁగఁ జెప్పియుండెను గాని యదిమాధ్యమని యేడననఁగలేదు
త్రాగుఁబోతన్న పేరేగాని బూదిలోఁ బొరలెడు సౌఖ్యంబు వొందలేదు
స్త్రీకిఁ గూడఁ దెలియురీతి వ్రక్కెనుగాని పాండిత్యబల మగపఱుపలేదు
చాలుననుచు బ్రహ్మశంకరబలరామ, నన్నయాకవనరచనలనుమాఱు
చుండ్రు వీరిలోన సత్తుసప్రాజ్ఞుల, మన్నపేరు పెట్టుకొన్నవారు. 64

గీ. పూర్వకర్మగతిని వీరిఁబొందినట్టి, విద్యసంవాదములయందు వేదబోధి
తామలజ్ఞాననయరీత్యపార్థకాంక్ష, లందునుపయోగపడివంధ్య యయ్యెనకట. 65

గీ. వీరిలోనిత్యసేవకవృత్తినున్న, వారు సౌఖ్యస్వతంత్రజీవనముగల
వైదికులఁజూచి నవ్వుచువారిచేష్ట, లెంచి చెప్పుకొనుచు వెక్కిరించుచుంద్రు. 66

—కలియుగగుణచర్చ—

సీ. "నిస్సారయుగసూయి, నీరసులగులతల్, నీచశూద్రజనానీకమెల్ల
మాహాత్మ్యముగతించు, మగఁడునాలియుఁదండ్రికొడుకులుఁ గాట్లాడుకొనుచునుండ్రు
రాజులువిత్తపరాయణులగుదురు, బ్రాహ్మణుల్ సత్కర్మ బాహ్యులగుదు,
రీరీతిఁగలియుగ మేపొందధర్మంబు నిర్జనాటవులలో నిలిచియుండు"
నని మునులు పురాణములలో ననిరిమునుపె, గానమనమిప్పుడట్టులే గాక తప్ప
దనుచుఁగొందఱు సంకటులగుదురహహ !, వీరినాగరికతయిట్లు వెలుఁగుచుండె. 67
సీ. ఉర్విపండుచునుండె, దోషనుల్ గుణమిచ్చుచుండె, మంచిమనుష్యులుండిరెటను,
మంత్రబలంబులుమాయలేదు, పతివ్రతలుమంచికొడుకులు ధరణిఁగలరు,
ప్రజలసౌఖ్యముఁజూచు రాజులునుగలరు యజ్ఞముల్ సేయుబ్రాహ్మణులునుగల
రిదికలియుగమున మొదటిపాదమెగానఁ గొన్నిచోటులధర్మమున్నదిపుడు
గనుకవీరిట్లు సాంకర్యమునుబడయుట, చిత్రగుప్తహస్తము నొప్పిఁజెందినట్లు
చేయుటకెగాని శాస్త్రముల్ చేసినట్టె, పుణ్యమానులమాటనిల్పుటకుఁగాదు 68
ఉ. గోవులపాడిపాఁడగుట, గొర్రెలపాఁడిసమృద్ధియౌట, భూ
దేవుఁడుశూద్రునొద్దఁగడు దీనతవేదమువింట, యష్టవ
ర్షావసరంబునన్ శిశువులాండ్రడరుఁ బుట్టుట షోడశాబ్దముల్
జీవితమౌట యివ్విధము చెల్లుటలేనిఁక యెందుకీమతుల్ 69
క. అందుకె యని వాదింతురు, కొందఱటులె యౌనుగాక ;- గోవిందపదా
మందసపర్యానందం, బొందు పవిత్రాత్ములిందు కొడఁబడఁగలరే ? 70
సీ. కృతయుగంబునవేదకుతలేశ హేమకశిపులు దుర్మార్గతంజెలఁగలేదె ?
త్రేతాయుగంబున దైతేయులవణ రావణులు దుష్టత్వముంబడయలేదె ?
ద్వాపరంబునఁగంస భూపజరాసంధ ముఖులుదురాత్మతంబొందలేదె ?
కలితొలియంఘ్రినేకలుషవృత్తినిఁ గొన్న వారికిఁ దదనుభవంబులేదె ?
కానఁదనదు గీతావాక్య గట్టిపఱప, దేవుఁడొక సత్కులమున సుధీతనువునఁ
బుట్టివీరిపస లణఁగఁ గొట్టలేఁడె ? యింతమాత్రంబునకె ధర్మ మంతమగునె ? 71
గీ. ఎట్టిమంచిబిడ్డలు నెంచ కెల్లవారు, నెఱుఁగకె తమంత దుర్గతి నేగవలయు
నప్పుడది కలిధర్మమానంతెగాని, యెఱిఁగి దుర్మార్గులగుటదిది యేటిబుద్ధి ? 72
ఉ. దాసత, మాంసభక్షణము, దారుణజారత, మంత్రనిందలుం
జేసి మిటారిపెత్తనము, చెడ్డమతాంతరబోధ, జందెముల్

వీరిచరించుటల్ సలిపి దివ్యమునీంద్రులమాట నిల్పిరీ
భాసురపండితాళి, యిఁకఁ బాయదె? ధర్మము వీరికొంపలన్. 73

క. ఈరీతిధర్మబాహ్యుల, దారుణచర్యల్ హరింప ధర్మాధీనుల్
ఘోరపువెలివేసిరి సభా, వారము రక్షించుచుంట సరసముగాదే? 74

—మాంసభక్షణము—

చ. చిలుకయు, గోవు, మేఁకయు భుజించును బండ్లను, గడ్డిఁ; గాకియుం
బులియును మాంసమును దినును బుట్టుకకన్నియుఁ బ్రాణులైనఁ ద
త్ఫలపలలాశిసాధుతలు బాగుగఁ జూతుఁడు! మానవత్వముం
దెలివియుఁ గల్గియుం బ్రజలు నీచతమానరు సిగ్గుసిగ్గుఛీ! 75

—పశ్చాత్తప్తులు.—

సీ. మగవారిమించిన * మనధాతువుహరింపఁ దాపసుల్ స్త్రీ నస్వతంత్రఁజేయ
నాక్రోశులంగక యతివకు స్వాతంత్ర్యమిడి యది తమకంటె హెచ్చుటెఱిఁగి
మించెననుచుఁ దాము మేహధాతువునొంద నదియు దానిగడించి యతిశయిల్ల
నయ్యో దేవుఁడ మోసమయ్యె నింకెట్టులు సరితూఁగఁగలమని చాలవగచి
ప్రకృతి వైద్యాదిశాస్త్ర కర్తలును సంఘ, సంస్కరణసమర్థులునైన సన్మునులను
ద్రొక్కి యాత్మమతంబును బొగడుచుండ్రు, వీరిలో ననుభవమైన పెద్దలెల్ల. 76

—రాజవైశ్యులు—

గీ. సకలవిధముల వీరితో సాటియైయయి, వీరి నీచశబ్దములతోఁ బిలుచుచుండి
వీరివల్ల గౌరవమొందఁ గోరి గర్వ, పడుచునుండ్రట్టి క్షత్రియ వైశ్యజనులు. 77

—శూద్రులు.—

వ. అట్టిశూద్రులు గలియుగస్వభావమునసుసరించి 1 యుత్తములనియు, 2 మధ్యములని
యు, 3 నధములనియు మూఁడు తెఱంగుల నుందురందు. 78

—ఉత్తమశూద్రులు—

చ. సకలము బ్రహ్మమే యగుట సర్వసమత్వము మాకు ధర్మమా
నిఁకనొక వర్ణ భేదమననెట్టిది? లోకములోననేది? పా
తకమన జ్ఞానికందు సకలంబును బ్రాహ్మణగర్భశత్రులై
వికటమతిన్ సుధర్మములు వీడుదురట్టి మహోత్తమాంఘ్రిజుల్. 79

* మనధాతువని స్త్రీసామాన్యమున[illegible]ఘనామముగలదు.

—శూద్రబ్రాహ్మణ్యవిషయము—

గీ. జననమున శూద్రుఁడును, గర్మమున ద్విజుండును, వేదమును బఠించుటచేత విప్రవరుఁడు
బ్రహ్మ మెఱుఁగుజ్ఞానంబుచే బ్రాహ్మణుండును, నగుచునుండును మానవుఁ డవనియందు. 80

—వసిష్ఠాదులజన్మక్రమము—

సీ. భోగముదానికిఁ బుట్టె వసిష్ఠుండు చండాలకాంతకు శక్తి పుట్టెఁ
గుక్కలఁదినునీచకులములోదానిగర్భంబునఁ బుట్టెఁ బరాశరుండు
పల్లెదానికొడుకు వ్యాసుండు, చాకలనాతికుమారుండు నారదుండు
మాదిగదానికొమరుఁడు మతంగుఁడు కౌండిన్యుఁడొక బాలరండపుత్రుఁ
డిట్టినీచులె తపముచే నెంతొ మహిమ, గాంచి బ్రాహ్మణత్వంబును గనఁగ విష్ణు
పావనులమైన మేము తపమునఁ గనమె? బ్రాహ్మణత్వము ననివీరు పలుకుచుంద్రు. 81

గీ. తమతమజన్మక్రమమును సత్యంబుగాఁబు, రాణములవసిష్ఠాదులే వ్రాసికొనిరి
స్వల్పమతులైన కలియుగప్రజలు తమ్ము, నెంచివేయుదురను మాట నెఱుఁగరొక్కొ! 82

చ. ద్విజులయులేనిశూద్రుఁడెటు విప్రతఁ బ్రాహ్మణతం గడించు? నా
ద్విజులకె చెల్లునాల్గునవి వింతగ నందఱికొప్పనన్న చో
ద్విజతను శూద్రుఁడొందునని దెల్పుచునున్నది యాదివాక్యమే
కుజనమతిన్ యథార్థమును గోప్యము సేయుట మంచిమాటయే? 83

—వసిష్ఠాదులపరిశుద్ధి—

చ. కొనఁ, జోర, దాఁటఁ, జేయసమకూడనియద్భుతకార్యసిద్ధులన్
ఘనతరమాతపోమహిమఁ గాంచినమానులకుంగులంబుతోఁ
బనిగలదే? సువాసితము బ్రహ్మనివాసము నైనపంకజం
బునకపవిత్రతాగుణము పుట్టఁగఁజేసెనె? షంకమింతయున్. 84

క. పంకజమని పిలుచుటకును, శంకగలదె యున్న; శిష్టసమ్మతమైని
శ్శంకను ద్వియైనదానిని, సంకరమతితోఁ బిలుచుట పాపముగాదే? 85

మ. అతిఘోరోరుతపఃప్రభావమున బ్రహ్మాండంబులాడించియ
ద్భుతనానాసృష్టినిఁ జేసి బ్రహ్మఋషియై పూతత్వసంధానశా
శ్వతగాయత్రికి నాయకుండయిన విశ్వామిత్రునిన్ హీనసం
తతిజన్ముండనినాఁడు పామరుల పైత్యభ్రాంతిశాంతించునే. 86

క. ఆవిషయంబట్లుండం, గా వీరలు బ్రహ్మనూని ఘనబీజభవుల్
కేవలపావనులై జత, పోవిగత [illegible]షము ఖవోషగిఁజుల్. 87

గీ. ఎప్పుడు మనసేకాగ్రతనీశ్వరేశు, సకలశక్తిమంతుఁగలసి ప్రకృతిదాఁటి
యలరెనో యప్పుడే శూద్రుఁడగ్రజన్ముఁడై సమస్తజనులు మ్రొక్క నర్హుఁడయ్యె. 88

క. బ్రాహ్మణ్యశక్తిఁ గనుఁగొని, బ్రహ్మము లెగడగడమని వడఁకుచు భీతిం
బ్రాహ్మణుఁడనఁ; గాఁడనియు, బ్రాహ్మణులగు నధములనెడి పలుకులు లేకే? 89

క. మునిచంద్రదేవముఖులగు, ఘనులందఱు నీతిశుద్ధగాత్రియానంగా
జనతుచ్ఛుఁడు చాకలికా, దనినన్ రామునకు లోపమయ్యెనె? యిలలోన్. 90

క. ధాతయనఁదగు బ్రాహ్మణ, జాతులకభివృద్ధియింత చాలాయున్నే?
పూతమగు వేదమంత్ర, వ్రాతమ్ములు బెడిసిగొట్టి పాడుపఱచవే? 91

—శూద్రశుద్ధి—

క. ఘనహరిపదమున జన్మిం, చిన మాత్రంబున నె శుద్ధిఁ జెందిరె? శూద్రుల్?
వనజామృతలక్ష్ములతో, జనియింపదె? ఘోరవిషము సాగరమందున్. 92

—శూద్రతపస్సు—

చ. మునుపటిమాలవంశమునఁ బుట్టిన బ్రాహ్మణుఁడే కలిం దపం
బునకు ననర్హుఁడందు ఘనపుస్తకజాలము చాటుచుండఁగా
మునుపటినుండియుం దపము మూలమెఱుంగక టిట్టిపప్పుతో
మనియెడు కాఁపెటుల్ తగును? మాటలు సెప్పినఁ గార్యమున్నదే? 93

సీ. బ్రాహ్మణులను గొట్టఁ బట్టు దండమెగాని ఘనయోగదండంబు గానరాదు
మాయలోఁబడఁద్రోయు మల్లుపంచెయెగాని వైరాగ్యమిడు కావివలువ లేదు
బ్రాహ్మణునిందించు బహుమంత్రములెగాని నారాయణస్మరణయును లేదు
సొగసైనస్త్రీలను జూచు నేత్రమెగాని జ్ఞాననేత్రము కలదైన లేదు
బ్రహ్మవిద్వేషమగు స్వభావంబెగాని, బ్రహ్మపదమొందఁ దగు స్వభావంబు లేదు
దివ్యతపము వీరలకు సిద్ధించునంట!, బ్రాహ్మణత్వము నటుపైన వచ్చునంట! 94

క. ఒక వేళ దొంగవేషము, నొకదానిని వేసికూరుచున్నను గలిఁగి
త్రిక్కిఁ జెమటూర్చెడు వీరల, కకలంకపు సిద్ధియబ్బుటబ్బురముగదా? 95

—సారాంశము.—

గీ. సాముదాయకస్థితిమీఁద భూమినిపుడు, తపము సాధ్యముగాన చేతత్వమెఱిఁగి
యున్న మహిమసంపాదించియున్నఁ గాఁపు, వాఁడు బ్రాహ్మణుఁడని పిల్వఁబడుట లేదు

అసన్నాశాత్తపోవృద్ధి స్సన్నాశాత్తపసఃక్షయః. 95.

గీ. తపములేకున్న గోత్రులుత్రవ్వుచున్న, బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడనిపిల్వఁబడెనుజిర
కాలవంశపరంపరాగతతపఃప్ర, సిద్ధసహజబీజక్షేత్రశుద్ధివలన. 97

ఉ. కావున నీటియందుఁ దనుగాంచి ముఖంబుననున్న మ్మాంసముం
బోవఁగ రెంటికిం జెడిన పూర్వపువక్కవిధాన శూద్రులుం
బోవుదురేమొ! చక్కఁగను ముందుగ యోచనఁజేసి శూద్రతా
భావమునొందఁ బూనునెడ బాగుగనుండునటంచు నెంచెదన్. 98

—మధ్యమశూద్రులు.—

సీ. ద్రవ్యమ్మునాశించు బ్రాహ్మణులంజేరి శాస్త్రముల్ వేదముల్ చదువుచుందు
రరుణోదయంబగునగునంచు వడిలేచి స్నానజపాదులు సల్పుచుండ్రు
భారతాదులయందుఁ బనికిరాదనిరని మాంసభక్షణమును మానుచుండ్రు
యాచింపవచ్చు బ్రాహ్మణులవిద్యలను బరీక్షించి నగి వెక్కిరించుచుందు
రెంతచదువుకొనినను రవంతయైన, బుద్ధిలేనివారికి నీతిబోధ సేయు
చుందు రిట్టివారెక్కడ నుందురంచు, నందఱుఁ దముఁ బొగడ మధ్యమాంఘ్రిభవులు.

—శూద్రవేదాధికారప్రశంస.—

మ. భువిలోశూద్రుఁడు వేదముంజదివినన్ మూఢాత్ముఁడైవిన్న భి
న్నవిధాత్ముండయి తాఁకినం గ్రమముగా నాల్కం దెగం గోసియుం
జెవిలో సీసము గాచిపోసియు నొడల్ చెక్కించియుం శుద్ధుఁజే
యవలెం దప్పకయంచు వ్రాసిరి విధుల్ వ్యాసాదిపాపాత్మకుల్. 100

ఉ. పరగతిఁ జూపు వేదము నపారకృపారసపూర్ణుఁడైన యీ
శ్వరుఁడు స్వకీయపుత్రులగు సర్వజనంబులకై యొసంగఁగా
దురితమనస్కులౌ మునుల దుర్నియమంబులు చూచి ధీరశే
ఖరుఁడగు శూద్రుఁ డోర్చుకొనఁ గల్గునె? యెదురు గొంద ఱుగ్రులై. 101

క. కాఁపులు వేదముఁ జదువుచుఁ, దాపసులగుచున్నఁ గృషిని దాసత్వంబుం
గాపాడువార లెవ్వరు? కోపముతో దూఱఁగానె గుణమది యగునే? 102

శా. ధర్మవ్యాధముఖాంత్యవర్ణజులమున్ దత్త్వార్థరీతుల్ మనో
నైర్మల్యంబున నేర్చి సద్వినయులై న్యాయస్వవర్ణోక్తస
త్కర్మంబుల్ నెఱవేర్చి కీర్తిఁగనరే? గర్వంబుతో నీగతిం
దుర్మాత్సర్యమునొంది పాతకులుగా దూషించిరే? విప్రులన్. 103

క. జ్ఞానము భక్తియుఁ గావలెఁ, గాని యొకరిపనుల కొకరు గాల్గాడి పగల్
పూనుట మానవధర్మమె? దీనం దేవునిఋణంబు దీరంగలదే? 104

గీ. జ్ఞానముకొఱకే వేదంబు చదువవలయుం, నన్న జ్ఞానులయిన విదురాదులు శ్రుతిఁ
జదివిరే? వ్యవసాయము సల్పనట్టి, విప్రుఁడు వరియన్నము దింట విడిచినాఁడె? 105

మ. తమకున్ శూద్రుఁడు ధాన్యమీయ శ్రుతులుం దత్త్వంబు రక్షించుచుం
బ్రమదంబొందు ద్విప్రుఁడుండఁ, దమకుం బ్రహ్మంబుఁ జూపించు జ్ఞా
నము విప్రుండొసఁగ గృషిన్ సలుపు చాలించి కాఁపుండు టు
త్తమలోకవ్యవహారమార్గము గదా తర్కింపరే న్యాయమున్. 106

మ. అతులక్షీరము పామునందు విషమే యైనట్లు వర్ణక్రమా
గతబీజాశుచి శూద్రునందు శుచిమార్గం బైన వేదంబు వై
కృతమై యెవ్వరి నేమి సేయఁగలదో! కృష్ణా! కృపాళూ! జగ
ద్ధితకార్యా! భవదీయవాక్యములనీవే చూచి కాపాడవే! 107

—బ్రాహ్మణనిషేధములు—

సీ. కడవంబు మోచుచో సద్బ్రాహ్మణుండైన విధవతోఁ దుల్యుఁడై వినఁబడును
చేరంబు ముందుగా గోరు విప్రుఁడు మాలకంటె నధముఁడుగాఁ గాంచఁబడును
వ్యవసాయమును జేయు బ్రాహ్మణుం డతిఘోర పాపాత్ముఁడని శాస్త్రపాఠముండె
నాయాససంవాస మగు కర్మకాండంబు బ్రహ్మవిప్రునొసట వ్రాసినంట
యిట్లు నీచములును, లాభహీనము, లతికష్టతరములు నగు చెడ్డకట్టుబాటు
లేల పూర్వులు చేసిరో యీసుబుద్ధి, శూద్రు లూహింపఁగలరేమొ చూడవలెను. 108

—అధమశూద్రులు—

క. తమ్ము ముఖప్రీతి స్తో, త్రమ్ముల నుబ్బించువారి దగ్గఱనె గురు
త్వమ్ముగలవారి వలెనె ననఁ; యమ్మును వతిఁ గొంతు గట్టి యధమాంఘ్రిభవుల్. 109

—అధమజాతి—

గీ. బ్రాహ్మణులను మాటయె గాని వారు చేయు, పని యొకటియును లేదట్టి వారికి జడి
యంగ నేల? ని దుర్బలయట్లు చూతు, రట్టి రజకాద్యధమజాతి యవనిసురుల. 110

—అంత్యజాతి—

మ. మనపెద్దల్ మును బ్రాహ్మణుం డెప్పుడో లా మాయింటికి పెద్దల్లుఁ డం
చును జెప్పన్ వినుచుంటె గాని యొప్పుడుం జూపంగ లేదిప్పు డ

ద్ది నిజం బయ్యోవటించు విప్రులకుఁ బుత్రీరత్నదానంబు లి
చ్చి నయం బొప్పఁగ గౌరవించెదరు ; సుశ్రీమంతు లీమాదిగల్. 111

చ. తమ పగవారి కొంపలును ధాన్యపుఁగుప్పలుఁ గాల్చి యంతుబ్బం
దమునకు మందుఁ బెట్టి పలు తస్కరబాధలుగల్గఁజేసి హీ
నములగు మాటలాడుచు ఘనమ్ముగ జిక్కులు పెట్టుచుండె యీ
యమభటజాతికెం ప్రియము లయ్యెయొ! దేవుఁడు వీరిఁ గాచునే? 112

—స్త్రీలు—

గీ. వేదశాస్త్రములను విసుగులేక చదివి, మానసమున దురభిమానమూని
స్త్రీయె గొప్పదందుఁ జెలరేఁగి పుస్తకాల్, వ్రాయుచుందురట్టి వనితలెల్ల. 113

గీ. అన్నిటను స్త్రీదె యధికార, మంతెయు నిఁకఁ, బురుషునెక్కువ యేదని పొగరుపట్టి
తగవు లేక కొందఱు వీరు మగల నెపుడుఁ, గుక్కఁగొట్టిన కజ్జను గొట్టుచుంద్రు.

—నాగజాస్త్రీలు—

చ. పతిననువంచుభార్య సమభాగమె కొవ్వున జంకు నేల యం
చతులితసాహసంబున మహాసభలందును సిగ్గులేక వా
క్చతురతఁ జూపుచుం బురుషులైవడి నంతట స్వేచ్ఛగల్గి సం
తతమును సంచరింతురు ముదంబునఁ గొందఱు సుందరీమణుల్. 115

—వికృతస్త్రీవిద్య.—

గీ. ఒకతె విధవలకుఁ దలవెండ్రుకలు దీయ, వలదనియు నొకర్తె స్త్రీకి వరుగుసేయ
వచ్చుననియు నుపన్యాసమిచ్చును ; కలి, యుగములో స్త్రీల చదువు ప్రయోజనమిదె.

గీ. పూర్వకాంతల యాచారములు గ్రహించి, బాల్యమున నుండి నడిపింపవలెను గాని
పూర్వకాంతలను ప్రమాణముగ గ్రహించి, స్త్రీలఁ జదివించినంతనే క్షేమమున్నె?

చ. అతివకు నగ్గలొఁ బెరిఁగి యన్నసమంబయి యన్యదేశప
ద్ధతి గళకర్తరీగతినిఁ బాపసరీతుల నొక్క కాలమం
దతివలు విద్యలం జదివి యంచితవృత్తుల నుండుగన్న స
మ్మతిని వహించునే? బుధుఁడు మాటలు సెప్పినఁ గార్యమున్నదే? 118

—భ్రష్టస్త్రీలు—

చ. "విధవలు పెండ్లి యాడుఁ"; డని వేత్తలె చెప్పుచునుండ నిప్పుడీ
యనములబాధకోర్వఁదగునా? యనుచుం దమస్వేచ్ఛనడ్డపె

ట్టుధవుల మందు పెట్టియుఁ గఠోరపుఖడ్గముచేతఁ గొట్టియున్
నిధనమునొందఁ జేయుదురు నేర్పునఁ గొందఱు చెడ్డకామినుల్. 119

సీ. దొరసానివేష మొక్కరికై ధరించును బీబీలవేషంబు వేయు నొకతె
కోమలలోఁ గుంకుమ బొట్టుపెట్టునొకతె ప్రేలాడు ప్రేల్మడి వేయునొ
గోఁచిపోసి యొకర్తె కోకగట్టుచునుండుఁ జుట్టకుదురుసిగఁ జుట్టునొకతె
యడ్డపాసను దీసి యందంబునొకర్తె పొరుగిండ్లకే వేళఁ బోవునొకతె
మూఁడుపూఁటల దాంబూలమును ధరించి, పెదవిఁ జూపుచు వాఁకిటవదలకుండి
వచ్చిపోయెడివారినిఁ బల్కరించి, నవ్వుచుండు నొకర్తె మనము చలింప. 120

గీ. పైఁటజాఱవిడిచి పాటఁ బాడునొకతె, యేమి వేషమేయిదియని యెన్నఁడైన
నన్నచో నత్తమామల నాక్షణమున, నిల్లువెడలఁగాఁ గొట్టించు నింకొకర్తె. 121

సీ. పాపయ్యకూఁతురు బంతులాడుచునుండుఁ బ్రమదంబుతో రాచవారితోడ
రాజన్న పెండ్లాము రంగములో లచ్చవరహాలను గడించి వాసికెక్కె
గురవప్పకోడలు గుఱ్ఱపుబండిపై నెక్కి చల్లనిగాలికేగుచుండు
దుర్గయ్య చెల్లెలుద్యోగస్థులను జూచి యిప్పటికినిఁ బ్రాణమిచ్చుచుండు
దినదినంబును నొకకూరదినుట విసుగు, గాదె? మనకడ్డువచ్చె యూగాలుసేసి
నట్టియత్తమామల బ్రతుకను దుగుంపు, గూడి కొంపలు మాట్లాడుకొనుచునుంద్రు. 122

—ధూర్తస్త్రీలు—

గీ. "ఆఁడువాండ్రము మనము మహాత్ములేమి, యనెదరో" యనుభయము రవంతలేక
పత్రికాముఖములనఁ జాల పాడుమాట, లాడుకొనుచుందురట్టి గయ్యాళులెల్ల. 123

—విధవలు—

ఆ. మగఁడుపోవ మాఱుమనువుఁ గట్టుకొనఁద, లంచి స్వేచ్ఛఁ బూని లజ్జ విడిచి
జుట్టు పెంచుకొనుచుం బొట్టుపెట్టుకొనుచు, వెలయుచుందురట్టి విధవలెల్ల. 124

—అత్తలు—

గీ. పనినిజేసినఁ గొలఁదిలోపములు నూపి, తిట్టుదురు చేయకుండినఁ గొట్టుచుంద్రు
సాధురాండ్రైన కోడండ్రఁ జక్కనిదియి, దనివచింప రెప్పుడునట్టి యత్తలెల్ల. 125

—కోడండ్రు—

క. కరుణన్ వస్త్రములన్నము, సరిగాఁ బెట్టక పనులను సలుపుమనుచుని
ష్ఠురముల నాడుచు నత్తల, గురుబాధలనలఁతురట్టి కోడండ్రెపుడున్. 126

—కొడుకులు—

గీ. ఈముసలివాండ్రు చచ్చిపోరెన్నటికిని, దమ్మిడీయైనను మనకుఁ దక్కదనుచు,
నిద్రవోయెడి తండ్రులనెత్తి మీఁద, గట్టెఁబాయెత్తి వేయుదు రట్టిసుతులు. 127

సీ. చదువుసంధ్యలు వేశ్యచెంత నాకఁగఁబోయె సంగీతవిద్యలఁ జౌకనాయెఁ
బోగచుట్టగాల్చుటే పూర్ణభోజనమాయె ననుదినక్షౌరంబె యందమాయె
గోఁచీలు పెద్దపాకీచీఁపురులు నాయె నాచారవర్తనమనుగుమాడె
స్వమతాభిమానంబు పరులపంచలఁజేరె నూళ్లంటఁదిరుగుటుద్యోగమాయె
భార్యనూఁతిపోసినబోధపథ్యమాయెఁ, దల్లిదండ్రులమాటలు తప్పులాయె
గౌరవంబనునదినీళ్ళుగాఱె నేత, ద్రగవంశ యౌవనబాలకాళికార ! 128

—వేశ్యలు—

గీ. రాజరాజువచ్చినను గౌరవముసేయ, రంత్యజాతికైన దేహమ్మునమ్ము
చుంద్రు; నగలతో నిద్రించుచుందు రాఁటి, విటులఁ జంపివేయుదు రట్టి వేశ్యలెల్ల.
క. తమకులవృత్తి నణఁచుచు, త్తములే మనుకొని తిరిగెడి బుధవ్రజముల చి
త్తములనె యతిమోహాయ, త్తములను జేసెదరు; వీరు తగినవిధమునన్. 130

—ఫలము.—

సీ. ఇట్టివారలు పెక్కురెప్పుడు సమృద్ధులై కాఁపురంబుండిన కారణమున
బాల్యవైధవ్యముల్, బాలమరణములు, భోగభంగంబులు, రోగవృద్ధు,
లధికతస్కరబాధ, లగ్నిభయంబులు, నాఁకలిదప్పుల యలసటలును,
వర్షముల్ వేళకు వర్షింపకుండుట నీళ్లున్నసస్యముల్ క్రుళ్లుటయును,
బండసిద్ధంబులైనవి వఱదముంప, మట్టిలోఁగలియుట, పండినట్టివెల్లఁ
బక్షులుతినుట మొదలైన బాధలతిశ, యంబులై స్థిరమైయుండె నాపురమున. 131

—ఫలవిచారణ.—

చ. జనులకుఁ బూర్వకర్మమున సౌఖ్యముఁ గష్టముఁ గల్గు దానికా
ధునికులవృత్తి హేతువని తోఁచినయట్టులు పల్కవచ్చునా ?
యనకుఁడు "ధర్మరాజుగల యచ్చటఁ దప్పక కల్గు గోసమృ
ద్ధి, నెలకుమూఁడువానల"ని తెల్పెను వ్యాసుఁడు భారతంబునన్. 132
గీ. "కాఁపుతపముచే మృత్యువు గన్నవిప్ర, సుతుఁడొకండు శ్రీరాముఁడా శూద్రుఁ జంపి
నంతలోఁ బునర్జీవితుఁ డయ్యెమజల" నని వచించె వాల్మీకిరామాయణమున. 133

—త్రికరణరూపము.—

ఉ. ప్రాణులుపంచభూతసమభాగపుఁగూడికఁ బుట్టిరందులోఁ
వాణినభంబు, మానసము, వాయువు, దేహముభూమిగావునన్
ప్రాణులుత త్త్రిమార్గగతవర్తనముందగినట్లుపూనినన్
క్షోణినిఁ బాఁడిపంటలొడఁగూడును శేనియొడంగసుం జెడున్. 134

—మనోబలము—

ఆ. అందుసకలమునకు నాధారభూతము, వాయువగుటచేత వాయురూప
మైనమనసుముఖ్యమైనదానిఁగనెంచి, యున్నతిక దేయాది యనిరిమునులు. 135

—మహర్షిశక్తి—

గీ. ఇట్టిభూతశక్తినిగని పెట్టియోగము, హఠములసుసాధకముచేసి యధికశక్తి
యోగులై మనోబలముచే జ్యోతిషంబు, వైద్యమార్గముగని భగవంతులైరి. 136

ఉ. దాననె బ్రహ్మ విష్ణు శివ దండధరాది పురాతనలోకన
జ్ఞానమునొంది వానికి జనంబులసంగిలమార్గమ్ముల్ మహా
మానగతిన్ లిఖించిరి మహోపకృతిన్ వెలుఁగొందరి యుప్పుడా
మానసశక్తి వాసుదురు మర్త్యులు 'మాపృతిదమ్ము' చేరిటన్. 137

—కవీశ్వరశక్తి—

“చ. గడియకు నూఱు పద్దెములు గంటములేక రచింపనేర్తు నే
ర్పడఁ గవితాప్రసంగమునఁ గ్రమ్మినఁ గోపమువచ్చి తిట్టఁగాఁ
దొడఁగితినా పెకిల్లుమని దొర్లిపడుం గులశైలరాజముల్
విడువ కనుగ్రహింప నిరుపేద ధనాధిపతుల్యుఁడౌను నే
నడిదమువాఁడ నూరన సమాఖ్యుఁడ నాకొకరుండు తుల్యుఁడే ?” 138

క. ఇటు లోకకవి పలెగ్రనతని, పలుశాపముచేత గండ్లు పడిన సరస్సా
కట్టటి యిలలో నిపుణునుగల, విటులగుట మనోబలము మహిమమునఁగాదే ? 139

—ఘోరకలివృద్ధిహేతువు—

గీ. అట్టి మహనీయమునుల వాక్యముల నెప్పుడు, మానవులు గౌరవించుట మానినారొ
యప్పుడే కలివర్ధిల్లు నఖిలభూత, ములును సారహీనములగు భూమియందు. 140

-సిద్ధాంతము-

గీ. నల్లమందుతిక్క నణఁచు నల్లమువలె, వృద్ధిఁజేసెడు పొగచుట్టవిధముగాను
పూర్వకర్మముల్ మనుజుల పుణ్యపాప, వృత్తులెగదిగఁజేయునీపృథివియందు. 141

—ఉభయాచారభ్రష్టాత్ములు—

గీ. చిరుదుకాడైన నిది దొంగఁ జేర్చిరంటఁ, జక్కఁ జాలమిబ్బినదినక పరులయింట
నల్లి పేటా కుదుకమాస నాఁటిరాత్రి, లంబమందముభ స్నానాచారభ్రష్టరాశి.

గీ. అర్థము దెలియకున్నఁగ తానుగతిని, లగుచు వేదశాస్త్రమతము న్వతులిరవ్రి
యత్నులైనిలుపుదుముందు రైహికవ్రి, ధానకామ్యకర్మనష్టులైనవీరు. 143

క. అతిమూఢంబగువీరల, గతిరోపాషండ నాస్తిక ప్రముఖులదు
ర్మతవాదంబులు జగతిం, బ్రతుకటకాధారమయ్యెఁ, బరికింపంగాన్. 144

—దాంభికులు—

క. కొందఱు పరులను తిరుపఁగఁ, గొందఱు పెద్దలకు జడిసి కొందఱు బంగల్
నిందింపకుండ సంధ్యా, వందనమును జేయుచుందురు ప్రతుమతివీరల్. 145

గీ. మనసునుబ్బసానిముఖంబుగను దుమందు, వాకురు-భావ్యను దిట్టుట వదలకుండుఁ
జేయుపితృతర్పణంబులు సేయుచుండు, నేమియనవచ్చుఁ బ్రాహ్మణ్యమిట్టులుండు

—అజ్ఞానసంసారులు—

గీ. ఇతరగృహములయందేవి యేనియుశుభ, కార్యములయినఁబోయి సంసా(రులమము
రెట్టిద్రవ్యము నిడి సంసారింపుఁడనుదు, నూరకే బాధ పెట్టుచు నుందురీవీరు.

క. కొమ్మనియిచ్చినఁ గైకొన, కుమ్మనుచు మొగంబు ద్రిప్పుదుండెదు నీమొ
త్తమ్ములచేతనె బ్రాహ్మ, ణ్యమ్మునుగాక నీదవృత్తి యయ్యెనయయ్యో.

—అశక్తశిష్టులు—

గీ. అన్యశాఖోద్భవులు వంచునన్న మేమి, రైనదిన మాహితాగ్నుల మనుచు (ధనము
నిచ్చెదమధికముగనన్న రొండలదిందు, రంత్యజాతులచేతికూడైనవీరు. 149

—అయుక్తవర్తనులు—

క. మానవషాషాంతకరిల, దానాదిగ్రహణులగుచుఁ దావసకృతత
ద్దానపాత్రయుక్తివి, హీనతమును చుందురీవీరు హీనకళాస్యుల్. 150

గీ. ప్రథమశాఖవాఁడపరమంత్రప్రయోక్త, పైతసాపిండ్యషోడశావిరతభోక్త
తూర్పువాయుదజీవన సుదతిభర్త, వీరువర్ణ్యున్ననందొకరు తీరువారు. 151

—అవధానులు—

సీ. ప్రతివత్సరంబునుగ్రామములో శ్రావణపూర్ణిమకుధనంబుఁ బొందవచ్చు
శిష్యులకుఁజదువు సెప్పియున్నపనులు ఘనముగాఁజేయుంచు కొనఁగవచ్చు
నెట్టివేళలనైన నెదటికేఁబోయినన్ ముందుగా గౌరవ మొందవచ్చు
నితరగృహంబుల సేవకులైనను రెట్టిసంభావనఁబట్టవచ్చు
గీ. యజ్ఞమును జేసెదమనుచు యాచన్న సేసి, భార్య మెడను గాసులు వేయువచ్చు ననుచు
దూరదేశమైనఁజని మధుకరవృత్తి. నోపికను వేదముఁజదువు చుండ్రువీరు.

—వేదపాఠమహిమ—

క. ఏమతితోడఁబఠించిన, నీమహనీయశ్రుతుల మహిమమునవీరల్
భీమసమానారోగ్య, శ్రీమన్మూర్తిత్వగరిమఁ జెలఁగుదు రెపుడున్. 153

శా. ఆరోగ్యంబును దెల్పుశాక్యకృతులం దత్యంతవిద్వాంసులౌ
వారల్ మర్త్యులుగాదు రజ్ఞులగుచున్ వల్లించినన్ వైదికుల్
సారారోగ్యము గల్గియుందురు, ప్రజల్ సద్బుద్ధిదుర్బుద్ధిఁగా
ర్యారంభత్వముగన్న వస్తుగుణమాహాత్మ్యంబుపోనేర్చునే. 154

—సోమయాజులు—

చ. పరసతిఁగూడ సాహసము, వారసతింగనడబ్బులేదు, దు
ర్భరదురితంబు చేదొరికె భార్యకురూపిణి; స్వర్గమందునుం
దరియగు రంభతోఁగలసి ధన్యతనొందఁగవచ్చునంచున
ధ్వరములు సేయుచుందురు గతజ్ఞులుకొందఱు వీరిలోపలన్. 155

—యజ్ఞప్రయోజనము—

ఉ. ఆదినివీరలెట్టిహృదయమ్మున నీక్రతుదీక్ష దాల్చినన్
మోదుగుపుల్లనేతులను బుట్టినధూమము దేజముం, బలా
మోదదవీర్యవృద్ధియును, భూతలవృష్టియుఁజేసె; ముక్తికై
శ్రీదయితున్ స్మరించుపని చేతదురూహలు దూరమౌగతిన్. 156

క. రంభారమణీస్తనపరి, రంభానందరతినధ్వర విహితకర్మా
రంభాన్వితులగుటతదా, రంభార్యోక్తులనగోచరమిదెకడిదో. 157

చ. మృతుఁడగువాఁడు సౌఖ్యపడ, మేదిని రాజయి పుట్ట మూలమౌ
క్రతుభుగగారవీథిఁ గ్రతుకర్తలు వొందుదు; రల్లరంభతో
రతియొనరింతురంట కవిరాజుల ప్రౌఢత, యీయథార్థముల్
శ్రుతివచనప్రభావ పరిశోధనశూన్యుఁ డెఱుంగ నేర్చునే? 158

చ. పశువధనిందఁ జేయుదురు ప్రాజ్ఞులె కొందఱు; వీరిపాటి ధీ
విశదులుగారె? యాద్యులగు పెద్దలు; రావణభంగి దేవుకై
స్వశిరమునైన వేల్చఁగల సాహసకార్యము నభ్యసింపనీ,
పశువధమాదిఁ జెప్పఁబడెఁ బావనకర్మమె పెద్దహద్దుగాన్. 159

క. కాననె ఛందఃకవులగు, మానులు మేషాశ్వధేను మనుజక్రతువుల్
శ్రీనాథుఁ దృప్తుఁ జేయక, మానవ నివిధించిరత్తమక్రియలంచున్. 160

—శాస్త్రిలు—

సీ. శాలువుల్ ధరియించి జనులచే నెపుడు శాస్త్రిలుగారని పిలుపించుకొనవచ్చు
నూరనూరను ధనమున్న దాతలఁ గ్రోల్చి వార్షికంబులు దెచ్చి బ్రతుకవచ్చుఁ
బండితుల నెదిర్చి వాదించి సభలలోఁ బూజ్యులచే మెప్పుఁ బొందవచ్చు
గవనంబు నేరిచి గ్రంథముల్ చేసి భూపతులనైశ్వర్యముల్ పడయవచ్చు
గీ. స్త్రీలకడ నలంకారార్థజాలములను, జెప్పి యిహలోకసౌఖ్యముల్ చెందవచ్చు
ననుచు దూరదేశంబులకైనఁ బోయి, యోపికన్ శాస్త్రముఁ జదువుచుండ్రు వీరు.

—పండితులు—

గీ. తత్వమెఱుఁగక విష్ణువే దైవమీశ్వ, రుండుగాఁడని వాదించి రోషచిత్తు
లగుచు గ్రంథములందు నపార్థములనె, వెదకుచుందురు కొందఱు వీరియందు.

గీ. తమకు నభివృద్ధి యగు నన్న, ధనము నిత్తు మన్న, యశముఁ బుణ్యము వచ్చు నన్న, నేమి
యన్న, వీరు కొంద ఱెవరికైనఁ జదువుఁ, జెప్ప నిష్టపడ రదేమి చేటొ గాని.

—సన్యాసులు—

గీ. భార్యల చెడుమార్గముఁ జూచి భయము సెప్ప, లేక, సంసారము నడపలేక, పీఠ
మెక్కి ధనము సంపాదింప నెంచి వీరు, కొంద ఱుపవీతములఁ ద్రెంచుకొందురకట.

—పీఠాధికారులు—

మ. కలిసన్న్యాసనిషేధముం దెలిసియుం గణ్యాశ్రుతిశ్రీమతం
బలరంజోధరయొనర్పఁ బీఠముల నాద్యాచార్యుఁ డేర్పర్చుటం

కొమ్మ కోరినయట్టి కోర్కెఁదీర్పనివాఁడు భర్తగాఁడొక ప్రాణహర్త గాని
భార్యస్వాతంత్ర్యంబు భంగపఱచువాఁడు భర్తగాఁడొక ప్రాణహర్త గాని
గీ. యేమిరైనఁ జేసినజను లెంతురిట్టి, జన్మమేలని? యొకొక్కఁ సహయముందు
నల్లమందును నూనెయుం ద్రాగుచుంద్రు, కొందఱు స్వతంత్ర్యస్త్రీలు మందమతిని.

—పరనిందాపర స్త్రీలు—

సీ. వీరమ్మకోడలు వీథులంటఁదిరుగు నెప్పుడుఁజూచిననది యేమిగుణమొ
రామయ్యచెల్లెలు రాజన్నఁజూచినం బ్రాణమంతయునిచ్చి పలకరించు
సీనయ్యభార్యను జెప్పనక్కఱలేదు రాచకొంపలకెల్ల రాజ్యలక్ష్మి
యత్తవారిగృహాన కరుగనిభద్రమ్మ మనముచ్చరింపఁగఁ బనికిరాదు
గీ. భూమిలోమనగోటినిఁ బోలగలరె!, యెవ్వరైననంచును డెబ్బదేండ్లుగడచి
యున్నతమతప్పులను దాఁచి, యొకరితప్పు, లెంచెదరు వీరుకొందఱుమంచిలేక.

—భూషణాసక్త స్త్రీలు—

సీ. కంసాలిచేసెడు కాలమందట్టిట్టు చేసితప్పకకొంతదీసి దాఁచు
నఱిగికొంతహరించు నతుకుగలదియయి యున్నచోఁ గరఁగినవన్నెదగ్గుఁ
గాలకర్మగతియే గతినుంచునోయని యొకకంటితోనిద్రనొందవలయు
నెప్పుడైననెట్లైన నేగుచోఁ బ్రాణంబులను బిడికిటనుంచుకొనఁగవలయు
గీ. నిట్టిపాడునగలుమనకేల? మగఁడె, స్త్రీకి మంచిభూషణమని తెలిసికొనక
"కంటెగావలెఁ గాసులుగావలె"నని, మగనితోఁబోరుచుందురుమందమతులు.

—ధూర్త స్త్రీలు—

గీ. కొప్పువిడిపోవఁగాఁబైఁట కొంగుజాఱ, వారలనుజూచి గుడ్లెఱ్ఱవాఱ గౌర
వస్థులకురవంతయు భయపడకక య్యొ, మోడుకొనుచుందురట్టి గయ్యాళులెల్ల

—విధవలు—

సీ. కొంతకాలము దాఁకఁ గోర్కెలన్నియుఁదీర, బొట్టునుమాత్రముపెట్టకుంద్రు
తలపనిదీరిన తరువాతనొక్కింత, యోగ్యంబులగునగ లుంచుకొందు
రొకసారిజననింద నొందినంతటజలతారు వస్త్రంబులు దాల్చుచుందు
రెవరెట్లుండిన నెవరికేఁగావలె, ననియందఱును దమ్మునకయున్న

గీ. వెనుకజంకక, తాంబూలమునుధరించి, కొనుచు శీరంగనీతులు కోట్లకొలఁదిఁ
బలుకుచుంతటందిర్పు కత్తెలయియిష్ట, వృత్తిసంచరించెదరట్టి విధవలెల్ల.

—అత్తలు—

ఆ. ఏమియన్న (బుత్రి దేమిసేయునోయని, పీటమీఁదఁబెట్టి పిల్లిమీఁదఁ
బెట్టితిట్టుచుండుఁ గట్టిగాఁగోడండ్ర, నట్టియత్తగారు లనవరతము. 184

—కోడండ్రు—

క. పలువిధములఁగొరుపువలెను, నలిపెడునత్తల బయటికిసాగఁగనంపం
దలఁచియును జడియుదురుగా, కులకుసుకులజలగునట్టి కోడండ్రచటన్.

—కొడుకులు—

గీ. మిక్కిలిమదించి భార్యలచక్కఁదనపుఁ, జిక్కములఁజిక్కియెన్నియో చి
(క్కులువడి
తమ్ముఁగాంచిపెంచినతల్లిదండ్రులనొక,యధములవలెను భావింతురట్టిసుతులు.

—వేశ్యలు—

ఆ. విటుఁడుసకలలోక విభుఁడైనఘనుఁడైన, "నందకున్నఁగాలు నందినట్లు
లైనజాట్టు"ననెడి యార్యోక్తియర్థంబు, విడువకుందురట్టి వేశ్యజాతి. 187

—ఫలము—

గీ. ఇట్టిపుణ్యపాతకకర్మ లెంతొ వృద్ధిఁ, బొందియున్న కారణమున భూమియర్థ
ఫలము నైననిచ్చి జనులబ్రతుకఁజేసె, నచ్చటనని తెలియుఁడీ మహర్షులార.

—వర్ణనలక్షణనిర్ణయము—

వ. నేనుజెప్పిన పనులే యాయాజనులకు నిత్యకృత్యంబులని భావింపవలదు.
సాముదాయిక ధర్మంబులైయుండును. 189

—సౌధవర్ణనము—

మ. అటఘాసిల్లును వెన్నకుండయనభవ్యాకారమౌ కోటయొ
క్కటి, కాల్వెట్టినచోటు పాడువడుమార్గంబే విచారించుచుం
బటుబుద్ధిన్నిజలాభముల్ వెదకు బామార్గాలజాలక్రియుల్
విటపానప్రియదుష్టదానకవిరాడ్విప్రుల్ తనుంగొల్వఁగన్. 190

—రాజగృహవర్ణనము—

శా. పలుకోఁకాయలు, బ్రాందిబుడ్లు, పులికల్లుప్యాంగు భాండాలుబల్
కుక్కల్, పందెపుఁగోళ్ళు, కౌజుపులుఁగుల్, క్రూరాత్మ వేశ్యాంగనల్
కోకోఁకంబు, ఫిడేలు. వీణె, గిలకల్, గోక్యంకలుంగల్గి పెం
పెక్కఁగ రాజగృహంబు నూత్నవిభవం బేపొందనాకోటలోన్. 191

—మూఢరాజవర్ణనము—

గీ. కొమ్మనెక్కిదానినఱకుకొనెడువాఁడు, ప్రభువఁట! నఱకుమనిచెప్పువారుభృత్యు
లంట? చెప్పెడిదేమున్న దాపురపతి, యైనమూఢరాజునవస్థ మానులార!

సీ. తాఁదాఁగినసఖులకు ధర్మార్థ మొక కాయ, ప్రతిదినంబందును బంపుచుండు
భాగ్యవంతులయిండ్ల బందిపోటులు సేయఁ, బగటజూదరులను బంపుచుండు
దనయొద్దకాలినం పనివారినమయంబు, దొరకినంగ్రిందికి దొ్రక్కైదు
ననిశంబునాకకూర దినుటకువిసుగంచు, నాలినివిడిచి వేశ్యలనుగూడుఁ

గీ. బిట్టవేఁటలనెపమున వీథులఁబడి, వచ్చికానిపిరిచెడుస్త్రీల పైనిమట్టి
యుండలువిడిచి వారుతాటొఁదుచుండ, ముదముపడుచుండు సఖులతో మూ
(ఢరాజు. 193

సీ. తాఁగన్నగాండ్రకుఁ దాపీలుసెప్పును, సొమ్మప్పగానిచ్చుజూదరులకుఁ
గోడెపందెముగట్టు కూర్మిగాండ్రకురోఁజు, పైవెచ్చమునకగు పైకమిచ్చు
లంజెఁదారుచువారలకు శాశ్వతంబుగా, జరుగుమాన్యంబు లొసఁగుచుండు
సారాయిసీసాల నరగఁదెచ్చెడువారి, కెంతధనంబైన నిచ్చుచుండు

గీ. నింద్రుఁడవునీవు చంద్రుఁడ వీవటంచుఁ, దన్నునుబ్బఁజేసెడునబద్ధాలమూట
లందయనుజూచుచుఁదనపెండ్లామునైన, ముచ్చటగ దారవోయును మూఢరాజు.

సీ. రారాజువలెఁజూపు రాజసంబున వాచ్యు, నట్లుసేయుచ వాచ్యమైనదాని
నమృతంబు విషమునట్లతినీచముగఁజూచు, విషమమృతమువలెఁ బ్రియము సేయు
రూపాయపైనతీరుగఁ గర్చుపెట్టును, బైనను రూపాయవగిది దాఁచుఁ
బరభార్యఁదనభార్య భాతిసంభావించుఁ, దనభార్యఁబరభార్యదారివిడుచు

గీ. నంతియేగాని యావనులందుసౌఖ్య, కష్టసమయాసమయలాభ నష్టపాప
పుణ్యములు విమర్శింపఁడామూఢనృపతి, యింకవానిమహాకీర్తి కేమిలోటు!

క. జారత్వపద్మనయనా, నారత నానారతుండు నరహరిభజనా
చారత్వవేదగతిజా, లారిపుజాలారిపుండు నతఁడొకఁడెధరన్. 196

—పాపరాజవర్ణనము—

క. ఆరాజు రాజ్యతంత్రపు, భారంబు వహించి మంత్రిపదవీస్థిరుఁడై
నేరుపుచేఁ దనరాజును, రారాజును జేసెఁ బాపరాజు సుఖముల౯. 197

ఉ. పూనిక శాస్త్రముల్ చదివి పుట్టుకయుండు నిరక్షరుఁడౌటచే
జ్ఞానినటంచుఁ గర్మములొనర్పక యుండుటచేత, బంధుస
న్మానము పోవునంచు నధమక్రియులైనను దండ్రితద్దినం
బైనను బెట్టుచుంట, నతఁడామనుజత్రయరీతి భాసిలు౯. 198

—దుష్టమంత్రి—

సీ. బ్రాహ్మణుల్ మాన్యముల్ పండినన్ ధనికులై మనకుభయపడుట మానుదురని
వారిమాన్యాలకు నీరీయకుండంగ వ్యవసాయపరులకు నాజ్ఞసేయు
బహుకాలముననుండి వానిప్రక్కలఁ బ్రవహించు కాలువలు కప్పించుచుండుఁ
దనయిల్లునిండిన తరువాతఁ దనరాజు క్షేమవిచారణఁ జేయుచుండుఁ

గీ. తెలివికొండంతయుంటచే "దీపమున్న
యప్పుడే మేలుకొను" మను నట్టిపలుకె
యనయమును నమ్మి లంచముల్ గొనుచు ధర్మ
పద్ధతిని లక్ష్యపెట్టఁడా పాపరాజు. 199

—గర్వపురుషుఁడు—

సీ. మీసాలు దువ్వుచు మిట్టిపడుచు నిదే పురుషలక్షణమని గరువపడును
జిన్నబొట్టును బెట్టి చెవులపూల్దాల్చి నాముఖమె చంద్రుండని మురియుచుండు
సన్ననివస్త్రముల్ కొన్నినగల్ దాల్చి నేమన్మథుఁడనని నిక్కుచుండుఁ
దలపైనిగుళ్ళాయి దాల్చి యిదే రాజచిహ్నంబటంచును జెప్పుచుండు

గీ. నల్లతొక్కుడుబండియే యుమరయాన, మనును వారకాంతయె రంభయనును గాఫి
యే యమృతమనును, సకలంబు నెఱిఁగియున్న, బ్రహ్మరూపంబు నేననుఁ బా
(పరాజు

—అతిలోభి—

చ. తనియెడువేళఁ బట్టుకొని సాగుచువై తరణింపరింతనా
వనుగొనఁగన్నా, దుష్టజన బాధకులౌ యమకింకరాళికిన్
ఘనముగ లంచమిచ్చుటకొ గాని ధనంబును జాలఁ దాఁచెఁ దాఁ
దినఁడుదయార్ద్రచిత్తుఁడయి దీనులకీయఁడతండు చూడుఁడీ! 201

—ప్రస్తుతప్రబంధకవిత్వము—

గీ. ప్రకటచంద్రికాపరిణయ వసుచరిత్ర, ములను జూచి సిగ్గుపడివిముఖుఁడు గాక
కల్పనాశ్లేషరీతులఁ గవనముల్లఁ, దలఁచునే? బుద్ధిమంతుఁడు ధరణినిపుడు.
. ముఖ్యశబ్దార్థగాంభీర్యములు సెలంగ, వసుచరిత్రములో దానిభంగిగీత
మైనఁ జెప్పఁగలఁడె? యౌన్నఁడైననిపుడు, సెప్పినను దొంగతనము నే చేయుఁగాని.
చ. అనఘులు బాణమాఖ్యులు మహాత్ములు పూర్తిగఁ గ్రోలిపాఱవై
చిన కవితాసుధాఘటము చిల్లరముక్కలు నాకిరల్ల పె
ద్దనముఖులట్టి పెంకులొకదారిని నాకిరచించునట్టి యా
ధునికకవీంద్రవాక్యములఁ దోఁచుగుణంబు వచింపవచ్చునే? 204

క. కానఁ బ్రబంధము సేయఁగ, బూనందగ దింక మంచిబుద్ధిగలిగినన్
శ్రీనాథకథారచనా, ధీనుండై ప్రజకు నీతిఁ దెలుపఁగవలయున్. 205

—భాషాంతరీకరణము—

గీ. పూజ్యసందర్భములు గలపుస్తకంబు, లన్యభాషకు మార్పఁ బయత్నము పడఁ
గూడ దంశలి భావంబు గొఱఁతపడినఁ, బతులకీర్తికి మసిఁబూయు పాపమగుట.

గీ. అనిరసగ్రహణసమర్థులైనవారు, సెప్పునట్టి నీతిపథము చెవినిఁ బెట్టి
కల్లపెద్దనాదులకీర్తియందు లక్ష్యముంచకుఁ గవిత్వమును జెప్పుచుండునతఁడు

—వికృతకవిత్వము—

సీ. శ్లేషయటంచు విశేషచోరతఁ జేసి యాక్షేపణార్థంబులరసి కూర్చి
పాండిత్యమును జూప బండతాలను బోలు పదపదసంధులు వెదకి పెట్టి
యందఱికిఁ దెలియు నట్లుండవలెనంచుఁ బెసరపప్పుపదాలు పోసఁగఁ జేసి
తనపోషణంబు నర్థవిశేషకరమని నలులలలలలులలచ్ఛలను గలపి

గీ. యారభటియును గౌడియు ననునర్థ, మందు శృంగారరసమును బొందుపఱచి
వరమహాకవులు సంతోషపడెదనట్లు, గంటకోకపాదముల్లంగ ఘనుఁడతండు.

—దుష్ప్రబంధకథ—

గీ. భక్తునకు నైన, సన్మార్గసక్తబుద్ధికైన, విద్యార్థికైన బుధాళికైనఁ
బనికిరాక మూర్ఖులు హర్షపడుచు పాడిపాడి, కతలనల్లంగ మిక్కిలి ఘనుఁడతండు.

—దుస్సాహిత్యము—

గీ. కఠినకీర్తిఁ దాఁ జేసిన గ్రంథమునకుఁ, గొంతకాలమైన వెనుకఁ గొంచెమైన
నొప్పుగా నర్థభావముల్ చెప్పలేఁడు, వానిసాహిత్యసారంబు వట్టిదనమె.

—గాలిపాట—

శా. సారంగంబును బాడి యేదియనినే స్తాఁ యందుఁ బ్రశ్నించినన్
శ్రీరాగంబను; దానిఁ బాడుమన సద్రీత్యంతరాభిఖ్యగాం
ధారాచ్ఛస్వరమధ్యమంబులు సఖత్వంబొంద నాస్యస్పృహా
సారంబందు మహాఖరస్వరముతో సంగీతమీభంగియా. 2 ।।

—దుష్టపురుషుఁడు—

ఆ. విద్యబుద్ధిగల్గి విభుఁడైన వాఁడును, గతిని నడచెనేనిఁ గలజనులు సు
గతిని నడచెదరని కలిపురుషుఁడు తన, యందునిల్పె దుష్టుఁడయ్యెనకట.

సీ. తనపనికంటెను దక్కువగుణము గలదైనఁ బచ్చిబూతులను దిట్టుఁ
దనపనిలో సమర్థంబుగలదైన నెఱసులను వెదకి నింద సేయుఁ
దనపనికంటెను ఘనమైనదైనచో గుణము దోషంబుగా గొణఁగఁ దొడఁగు
నుపమానరహితమై యున్నచోఁ దనపని హీనమగునని లోలోన నగను

గీ. నంతెగాని ముఖప్రీతికైన హాస్య, వచనము కనముఖ్యవృత్తియా పనిని నెవ్వఁ
డైనఁ జేయుచునున్నచోఁ దానిఁ జూచి, పరులయభివృద్ధికోర్వని పాపరాజు.

గీ. తాను జేసెడుపని నెవ్వఁడైన జేయు, నెడల దానిఁ జెడఁదీయు నెంచు; నితరు
లేదియడిగిన నా యొద్దలేదు నాకుఁ, దెలియదనుఁబట్టిపురుషుఁడీయిలనుగలఁడె?

శా. దేవబ్రాహ్మణవృత్తులం జెఱుపనం దేహింపఁడా పూఁటకుం
జీవింపంగతిలేని దీనులనగా నింబెట్టు లంచాలకై

గీ. యెల్లస్త్రీలును దనయాజ్ఞ నెపుడుఁ దాల్చ, నట్లు చేసికొని యమిత ఖ్యాతి నొందె
నా పతివ్రతాస్త్రీరత్న మహహ! నోచు, మంచిదైనచో నూరును మంచిదగును?

—ప్రతిదినాహ్న కృత్యస్త్రీ—

సీ. నాలుగుగంటలకే లేచి కాలోచితపుఁ గృత్యములతి యుక్తముగఁ దీర్చుఁ
బదిగంటలకు వండి పదిలంబుగాఁ బెట్టి తనభర్తను దివాణమునకుఁ బంపు
నభ్యాగతులఁ జూచి యతిభక్తిఁ బూజించి రెండుగంటలకుఁ దాఁ దిండి దినును
బీదసాదల జాలి నాదరించుచు విష్ణుకథల చేతను బ్రొద్దు గడవఁ జేయుఁ

గీ. జేసినది యీశ్వరార్పణఁ జేసి దేవదేవు ధ్యానించి చాల మోదించుచుండు
నా పతివ్రతాస్త్రీరత్న మహహ! మంచి, యాడుదేగ నా యింటికి ఖ్యాతి దెచ్చు.

—భర్తృసగానందకరసుధీస్త్రీ—

సీ. పొన్నకాయను బోలు చిన్నికొప్పు ముడిచి చాల మేలుగఁ బ్రాలు పూలు దురిమి
మెఱుఁగునూనెను రాచి మేలికాటుక దిద్ది పాల్పుగాసమైన బొట్టు వెట్టి
జలతారు చేవిరాఁబు చలువకోకను గట్టి నానావిధములైన నగలు దాల్చి
పరిమళించుచు నున్న బహువస్తువుల నంది చెన్నైన పూబంతి చేతఁ బట్టి

గీ. పాన్పుఁ జేరి కళాశాస్త్రపద్ధతులును, గావ్యరీతులుం జెప్పుచుఁ గాంతునకను
రాగముం బెంచు నా సతీరత్నమెల్ల, యపు 'శయనేచరంభా' యటన్న దెజేఁగి,

ఉ. అప్పటనప్పటన్ మగఁడు హర్షముతో నిడుసొమ్ముఁ దండ్రితోఁ
జెప్పక తల్లి యిచ్చినది చేరిచి వడ్డికి వైచి దానితో
నెప్పుడు నన్నదానమును హెచ్చుగఁ జేయుచు భర్తలోభితన్
దప్పును గప్పు నా మెపతి ధన్యుఁడు గాఁడె? సుభార్య గల్గినన్.

గీ. ఇంటిపై వెచ్చమునకుఁ దా నిచ్చుసొమ్ము, సగము మిగిలిచి యిచ్చుచు జగము మెచ్చ
గాంచు నా నెకుఁ బెట్టె బీగంబు గాక, యింటి సర్వాధికారంబు నిచ్చు మగఁడు.

ఉ. చిన్నతనంబులో జననిచేసిన నీమము చేత నీడులోఁ
గన్న సమస్తకావ్యములుఁ గాంతునకిష్టముగూర్ప నిచ్ఛ తే
కెన్నఁడుఁ బుత్రవాంఛ రమియించవఁగఁ దోఁప డెనా మెకట్లు గా
కున్నఁ గలిన్ స్వతంత్రసతు లుత్తమలౌదురె? కావ్యరీతులన్.

—ఆశ్వాసాంతము—

వ. ఇట్లా పతివ్రత కలలోనయిన మగనికిం గష్టంబు గలుగనీయక యతనియైశ్వర్యమునకును, గలియుగంబులో వేదశాస్త్రపురాణ ధర్మములు నిలుచుటకును మూలమై శ్రీమహాలక్ష్మీ కటాక్షపూర్ణాశాలయి, భగవద్భక్తి విశేషముచేఁ బుట్టిన వైరాగ్యజ్ఞానంబులచే బ్రహ్మానందంబు గలిగియుండె, నాపావరాజును దత్సతీసంయోగంబువల్లఁ దనపాపంబు లెప్పటికప్పుడు నశించుచుండఁగా రాజైనిలిచి యామహాచక్రభారమంతయుం దానే వహించి యంతటం జయంబుగల్గి సకలవిధ మహాభోగంబులు ననుభవించుచునుండెను.

—మహాచక్రబంధము—

శా. రక్షోరాడ్ధం! సూర్యసంభవసుమిత్రా! విత్తదేంద్రాంబురా
జక్షేమప్రద! రమ్యమౌనివర రక్షాకృత్పినాకిస్తుతా!
వక్షశ్చంచల! కమ్రభక్తవశధీభాతిప్రజాతండనా
నాక్షాగారగ! శ్రీజయాహవసుశూరా! లోకత్రాతా! ఘనా!.

—గద్యము—

ఇది

శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, ముత్యసంతాన క్షీరపారావారాత్రిపుత్ర వేంకయ్యార్య ద్వితీయపుత్ర, బాపన్నార్య పౌత్ర, చిన సర్వయార్యైకాదశాబ్దపోషిత పుత్ర, సీతయ్యార్య స్వీకృతపుత్ర, సకలజన కారుణ్యకటాక్షపాత్ర, సీతారామచంద్ర పరబ్రహ్మార్పిత సకలకర్మ, సూర్యనారాయణమూర్తి శర్మ ప్రణీతంబై, యపూర్వాద్భుతచరిత్రయగు సకలానందనామక నవీన ప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ.

శ్రీరస్తు.

సూర్యనారాయణశాస్త్రీయము.

# సకలానందము.

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీమహితవేదభాషిత, మహామార్గంబునబుధతతి యముదీరిచిని
షాఢ్ముఁడవైతగిలోక, స్తోమమునకు నీతిరీతిఁ, జూపినరామా. 1

వ. దేవా! దివ్యచిత్తంబున నవధరింపుము. అట్లు చెప్పఁగా విని యవ్వలికథ చెప్పుమని యడిగిన శౌనకాదులకు సూతుండిట్లనియె. 2

గీ. అట్లువారలు సకలసౌఖ్యములు గలిగి, కొంతకాలముగడపిన యంతనొక
నాఁడు లోకులప్రస్తావనముసలుపుచుఁ, దనముగనిఁజూచియీరీతిననియెసుమతి

—సంతానప్రశంస.—

గీ. నేఁటికేఁబదియేండ్లయ్యెనునేనువచ్చి, యొకకొడుకునైనఁగనుఁగొనకుంటి;నెవరిఁ
గనినముచ్చటౌను; సుతునిఁ గననిబ్రతుకు, బ్రతుకె? యనభార్యకిట్లనెఁ బా
పరాజు. 4

క. కాంతా! సంతతిలేదని, చింతంజిత్తంబునందుఁ జేర్చుచునుంటే
యింతయెఱుంగవె; చెప్పెద, సంతతిచేఁగల్గునట్టి సౌఖ్యమువినుమా. 5

గీ. గర్భముధరించిమోచుటకనుటవెనుక, మంచినేర్పుమక్కువలతోఁ బెంచుటయివి
యెంతసౌఖ్యమోపడ్డవారెఱుఁగవలెను, గానితెలియునే? నీవంటిదానికబల.

గీ. అదియుఁగాకబిడ్డనుగన్నయంతస్త్రీకి, యౌవనముతగ్గు; వారికైయధికధనము
వ్యయమగును; వారుచెడ్డవారైనఁజింత, గలుగుఁ; జచ్చినఁ వారిపైనిలుచు
మనసు. 7

వ. కావుననిహపరసౌఖ్యదూరంబైన సంతానంబు లేదని చింతింపక వైకుంఠ
సమానంబైన యీగృహంబున నాతో మహాభోగంబు లనుభవించుచు బ్రహ్మా
నందంబుతోనుండుమనన నామె యిట్లనియె. 8

గీ. ఇట్టినష్టవాక్యములాడు టేల? పుత్ర
వాంఛగలవారికిఁ గడుపు బరువె? దైవ
కరుణ చేసుఖప్రసవము గలుగరాదె?
ధనముగలవారు పిల్లలఁ బెనుచుటరుదె? 9

ఉ. ఇంక శరీరభోగముల కెక్కుడు నామది, మంత్రినైనిరా
తంకముగాగడించుకొని దాచితిద్రవ్యము నేమిసేయఁగా?
వంకరలేనివృత్తిగల వారలులేరె? కుమారులందు, ని
శ్శంకగ మోక్షవాంఛగల జ్ఞానులు చావునకుంజలింతురే? 10

క. ధనమును విద్యయు సద్వ
ర్తనమును గీర్తియును గల్గి తలిదండ్రులకుం
జనులకు సంతోషంబిడు
తనయులు జనియింపరాదె? దైవవశమునన్. 11

క. అనితగినయట్టులుత్తర
మును జెప్పఁగఁ జాలసిగ్గు పొందియుమగఁడౌ
టనతఁడు నీకోరికయే
మనఁగా నావరసతి వినుమనియిట్లనియెన్. 12

— సంతానదాయకకర్మములు. —

సీ. సప్తగోదావరీ సాగరసంగయాత్రను మంచిభక్తితో నొనరుచుటయు
షష్ఠీచతుర్థుల సన్నిష్ఠగలిగిసు బ్రహ్మణ్యదేవతా వ్రతులగుటయు
రామాయణమనుపు రాణము చదివించి శ్రీరామపూజను జేయుటయును
భాగవతపురాణ పఠనంబు గావించి పుత్రగోపాలార్చఁ బొనరుచుటయు

గీ. మొదలయిన కొన్ని సత్క్రియల్ పొదలుచుండె
వీనిఁజేసికొందఱు సంతానవంతు
లైరి యిప్పుడా సత్క్రియ లందు నాకుఁ
బుత్రగోపాలపూజపై బుద్ధిపుట్టె. 13

— పూర్వజన్మకర్మఫలముతప్పదనుట. —

క. అనునాతఁడు పకపక న
వ్వి నెగడియున్న తన మెట్టవేదాంతముతో
ననె నిష్ఠలెన్నిచేసినఁ, దనదు పురాకృతఫలంబు దప్పునె? కాంతా. 14

గీ. పుణ్యవంతులు కష్టముల్ పొందుచుంట, లేదె? పాపులకు సుఖముల్ లేవె? వాని
కైవ్యయప్రయాసంబుల నందుటొకటి, పట్టిపెట్టియుండఁగ నామె యిట్టులనియె.

— పౌరుషప్రాధాన్యము. —

గీ. కారణంబన్నిటికిఁ బూర్వకర్మమె యగు, నైన మానుషయత్నము మానఁదగునె?
మనము నవులు ట్రమింగుట మానుకొనిన, నన్నము కడుపులోఁ బడి కరఁగఁగలదె

— పూర్వపుణ్యపాపనాశనవిషయము. —

గీ. పూర్వపాపము కుడువక పోదు నిజమె, గాని కొన్ని సత్క్రియలు తత్కర్మఫలము
కొలఁదివేళలోఁ దినిపించి కుశలమిచ్చు, ననిప్రమాణములు గల వేవనిన వినుము.

శ్లో. పూర్వజన్మకృతంపాపం, వ్యాధిరూపేణ బాధతే
తచ్ఛాంతిరౌషధైర్దానై, ర్జపహోమసురార్చనైః.

క. మునుపటిజన్మపుఁ బాపము, ఘనరోగంబై మనుజుల గాసింబెట్టుం
ధనదానౌషధదేవా, ర్చనజపహోమంబులనది శాంతింబొందుం. 18

చ. అనియటు శాస్త్రముల్ దెలుపు, నద్దియుఁగాక యజామిళుండు చ
చ్చినపుడు పుత్రుపేర హరి శోభననామము నెంచు దానిచేఁ
దనదురితంబు కాలభట వర్యనభీతిగతిన్ భుజించి సం
జననభయంబువాసి చిర సౌఖ్యకరంబగు మోక్షమొందఁడే? 19

గీ. గొల్లసతులు కృష్ణవిటుఁగఁ గోరికూడి, యతని నొకదినముఁ బాసి యావియోగ
తాపరూపముగాఁ దమపాపఫలము, లనుభవించి తుదను మోక్షమందలేదె? 20

క. ఘనభక్తుండై విలసి, ల్లిన బమ్మెర పోతరాజు లేమిదుఃఖమునం
దనపాపకర్మఫలమే, ల్లనుభవించి తుద మోక్షలక్ష్మింగనఁడే? 21

గీ. అవి నిజములుగావంటివేని వినుమా, కాలిలోని ముల్లును దీయువేళ నొప్పిఁ
బెంచి యొక్కక్షణములోనె మంచి సౌఖ్య, మిచ్చు సత్కర్మ సామర్థ్యమిదియె సుమ్ము.

క. అల్లము పైత్యము విఱువదె ? బెల్లము బలమీదె ? మునకు వేదస్మృతులం
జల్లనిదయ దేవుండిదు, టల్లంతయు నిష్ఫలంబె ? యానే ? కాంతా. 23

క. ఘోరావక్ర పరాక్రముఁ, డౌరావణుఁ డానవగ్రహంబులన్ గాకఁబోఁ
జేరిచి కట్టఁగలేదె ? కు, మారుఁడు పుట్టు సమయమున మానితశక్తిన్. 24

క. శివుఁడే పదియారేండ్లా, యువు దనకిడ నిష్ఠ మానినుప్పించి చిరా
యువు మార్కండేయుండీ, భువి సంపాదింపలేదె ? బుద్ధిం గనుమా. 25

చ. ధనవనితాద్యతిప్రియుఁడు దారుణశోకము సంభవించినన్
ఘనముగ నేడ్వకుండఁ బరకాముఁడు జ్ఞానవిరాగశాంతముల్
గనఁగ, నశక్తుఁ డూరకొనఁ "గో" "ముసు సేసిన కర్మముల్ భుజిం
పనెవరికైనఁ దప్ప" దని వ్రాసిరి వస్తుగుణజ్ఞులౌ బుధుల్. 26

గీ. పుణ్యకర్మఫలము గూడఁ బోవుఁ జెడ్డ, పనులవల్ల ; ధనమదము వలన మొదటఁ
ద్రాగుడియు లంజపొత్తును బాగుగఁ గని, పిండి కొఱువాతముష్టి యెత్తించినట్లు. 27

— ఐహికకర్మఫలప్రాప్తి విషయము. —

సీ. కలలోన మన యిల్లు గాన్పించె రాతిరి యని బుద్ధి యింటిపై నాపుచుండ్రు
నడకచే నాయాసపడి యేలవచ్చెనీ యాత్ర యనుచు మనుస్సు రనుచుండ్రు
రూపవంతులగు నరులను జూచి మనసు చెఱుచుకొని పనులు సేయకుండ్రు
యాత్రాపరులు దేనినైన మఱచినచో దాని మెల్లగఁ దీసి దాచుకొందు

గీ. రింటికిఁ గవచ్చితమ పుణ్య మెల్లఁ జెప్పు, కొందు రొకగొప్ప గానిట్టి మందమతుల
కెట్లు ? లబ్బు సుకృతఫలమిహమునందు, నున్న దుత్తరజన్మమునాదవుఁ గాని.

గీ. పరుల మెప్పుగోరక దేశపాత్రకాల, ములను జూచి చేయు సుకృతములిహమున నె
ఫలమునిచ్చును ; మనసు నిశ్చలము గాక, చేయు పని పూర్ణఫలదమై చెల్లకుండు.

క. మనసే రీతిని నడుచునో, మనుజుల నారీతిఫలము మానక పొందుం
గనుక సకలవస్తులలో, మనసే ముఖ్యమని లేదె ? మనశాస్త్రములన్. 30

గీ. అన్యబోధచే బ్రాహ్మణు నడఁచువాఁడుఁ, జంపు వేళఁ జేయూడక జంపువాఁడుఁ
బనిని జేసి పశ్చాత్తాపపడెడు వాఁడు, దాని ఫలమును జన్మమునఁ గానకుండ్రు. 31

క. త్రికరణశుద్ధి గలిగి చే, యు కలుషపుణ్యములిహమున నొందు నరులమా
నక యుట్టి వాయుతుల్యతఁ గట, సుకృతాఘములనియున్నంగుఁ జూచుచు ముత్తుర్యకన్.

గీ. ఇట్టిసూక్ష్మముప్రారబ్ధమెల్లనణఁగి, పోవుమార్గముదెలియక దైవనింద
సేయుదురుకొందఱీవింకఁజెడ్డతలఁపు, లూనక వ్రతముసేయుట కుద్యమింపు.

వ. ఇట్లతియుక్తియుక్తంబుగ నుత్తరంబిచ్చినలోనంజాలసిగ్గునొందియు లౌకికశిఖామణియగుటచే మాటలచే నర్ధాంగీకారత్వముసూచించి కాంతా! నీయిష్టప్రకారమువ్రతముసేయుటకు నిశ్చయించితిని. కాని దేశకాలపాత్రాదివైపరీత్యములనాలోచించి నేదాచినకోటిధనంబుకదుపుట ధర్మంబుగాదు. ప్రస్తుతము సొమ్ము లేదు. కావునమఱియొకప్పుడు సేయుదము. ఇప్పటికోపికనుబట్టుమనఁగా నామెయిట్లనియె. 34

సీ. ఇంటికొకరూకవంతున నిండటందుఁ, బ్రభువుమాన్యముల్ దున్నెడు వారికాజ్ఞ
చేసిదానిచేనివ్వడు చేయుదమన, నామెమాటకుమాఱుమాటాడలేక. 35

గీ. ఆతఁడట్టులేచేయుదమతివ! వ్రతమొ,నర్చుటెట్లన? నామెసాఁకిందమును దెచ్చి
చేతిలోనుంచిపత్త్రాలు చేతఁజూపఁ,జక్కఁగాఁజూచియతఁడిట్లుచదువఁదొడఁగె

— పుత్రగోపాలవ్రతవిధానము. —

వ. "సకలఫలములనీయఁజాలినయీ జంబూద్వీపమునందు జనించియుఁబుత్రహీనుఁడగువాఁడు జడప్రాయుఁడు. వానికంటె నిరర్థకజన్ముఁడులేఁడు. పుత్రహీనునికి ధనరూపాది సంపదలుండియు సార్థకములుగావు. "అపుత్రస్యగతిర్నాస్తి" యని ధర్మశాస్త్రములనుచున్నవి. ఎల్లప్పుడునుదకాంజలినపేక్షించు పితృదేవతలు పుత్రహీనుంగని నిరాశులైచింతింతురు. అపుత్రవిషయికప్రాయశ్చిత్తము శాస్త్రములయందులేదు. పంచపర్వములందును గామాతురుఁడైసతింగూడుట, బ్రాహ్మణవివాహమునకు విఘ్నముసేయుట, పాలమీఁదయాశచే దూడకుఁ బాలుంచకదానింజంపుటమున్నగు పాపములపుత్రత్వప్రాప్తికి హేతువులు. ఇట్టిపాపకార్యములుసేయువారిభార్యలు గొడ్డుఁబోతులై (1) కా

— షడ్విధవంధ్యలు. —

కవంధ్య (2) కదళీవంధ్య (3) యంధవంధ్య (4) స్త్రీప్రజావంధ్య (5) స్రవద్గర్భవంధ్య (6) రజోవంధ్య యని యాఱుభేదములనుందురు. (1) అన్నవస్త్రములు చక్కఁగా విమర్శింపక కోడలినిదుఃఖపెట్టునది ధనధాన్యవ

ర్జితయై, మహారోగపీడితయై, బంధుతిరస్కృతయై, పుత్రహీనయగును. ఇది కాకవంధ్య (2) మత్సరముచేత నింటికి నిప్పుపెట్టునది పుట్టినమగబిడ్డలు చావఁగా నొకరిద్దఱాఁడుపిల్లలు గలిగి సర్వజనులు నిందింపఁగా నన్నవస్త్రములకు గతిలేక యాఁకలిదప్పులచేఁ బీడింపఁబడుచుండును. ఇదికదళీవంధ్య (3) ఋతుకాలములలో రాత్రియౌవనవతియై యుండియు ధనధాన్యరూపసుశీలాది సంపదలుగలిగి యౌవనవంతుఁడైన ప్రియుని రమింపక వంచించి తిరుగునది స్త్రీప్రజనేకనును. ఇది స్త్రీప్రజావంధ్య (4) వ్రతముపట్టి హేతువులేక నడుమ మానునది చావుబిడ్డలనుగనుచుండును. ఇదిపుత్రవంధ్య లేక యంధవంధ్య (5) ఒకరుచేయువ్రతమునకు హేతువులేక విఘ్నముచేయునది రక్తశూలగలదియై గొడ్డురాలగును. ఇదిస్రవద్గర్భవంధ్య (6) పాలన్నియుంబిండుకొని యావుదూడనుజంపునది దరిద్రయై పుట్టిమాదకన్యయగును. ఇదిరజోవంధ్య. ఈ 6 విధములవంధ్యలును నరకభాజనలు. సర్వపాపపరిహారకమును, మోక్షదాయకమునైన పుత్రగోపాలమంత్రము వీరికుత్తారకమయియున్నది. తొల్లి పెక్కండ్రు నరులీపుత్రగోపాలవ్రతముచేసి పుత్రవంతులైరి. ఈమంత్రప్రభావమిహపరసుఖములిచ్చి విష్ణుసాయుజ్యమిచ్చును. బ్రహ్మహత్యాదిపంచమహాపాతకులు, స్వస్త్రీపరులుగాక సంతతిగాంచనివారు నీమంత్రము సహస్రావృత్తిజపము చేయుదురేనిఁ బుత్రవంతులైపుణ్యలోకమునొందుదురు. రోగులు, దరిద్రులు, లక్షజపముచేసియందుఁబదింట నొకభాగముతర్పణము, నొకపాలుహోమము దానిలోఁబదింట నొకపాలు బ్రాహ్మణసంతర్పణమును జేసి యారోగ్యధనికత్వములుపొంది పదంపడిముక్తులగుదురు. పుత్రకాముఁడు శుచియై మౌనముతో నీమంత్రమును విధ్యుక్తముగాఁ బ్రతిదినము సహస్రజపముచేయుచువచ్చి, జపాంతమున హోమము, బ్రాహ్మణభోజనము, శక్తివంచనలేక చేయునేని సంకల్పసిద్ధినొందును. హోమము పరమాన్నముతోనైనను, రురు(నల్లచారలుతెల్లమచ్చలుగలదుప్పి) మాంసముతోనైనను. నువ్వులుగలిపినచక్కెరతోనైనను జేయవలయును. ఏకద్రవ్యహోమముచేత నేకామ్యముఫలించును. పదివేలుజపముచేయునెడల నిద్దఱుకొమరులుగలుగుదురు. దానిచేనొకవేళఁగలుగకున్న నిలువదివేలజపముచే ముఖ్యముగాఁ గలుగుదురు. నియమములేని జపము సిద్ధికానేరదు. పుత్రప్రాప్తికి స్త్రీపురుషులు వేర్వేఱజపించుటయుత్తమప

తుటు. అదిరాత్రివేళనుపక్రమించి దీక్షాధర్మముతోఁ బుద్ధిచలనములేక జపిం పవలయును. స్త్రీపురుషులదోషనివృత్తికై ప్రతిదినమునఁ దంతులమార్జనము చేయవలెను. అదంపక్షులాబియ్యపుటన్నము సేవింపవలెను. బియ్యముప్రోగు గాఁజేసిదానింజతురముగానెఅపి యందుపై యంత్రములిఖించి దానిపైఁ గల శముస్థాపించి శోభనాక్షతలతోఁ బూజింపవలెను. అట్లుచేయుటవలనఁ బూర్వ పాపమునశించును. ప్రతిదినము జపసంఖ్యకుఁ దగినట్లామంత్రముతోనే హో మము చేయవలెను. అట్లేబ్రాహ్మణసంతర్పణము చేయవలెను. ఈగోపాలమంత్ర ము దశాక్షరము. పుత్రకాములు దీనిని న్యాసపూర్వకముగా జపింపవలయును.

## — మంత్రప్రకారము. —

ఆదియందు సర్వకామప్రదమైన హుం అను బీజాక్షరమును, దానివెంబడి శ్రీం అను బీజాక్షరమును, దానివెనుక "శ్రీ పుత్రగోపాలాయనమః" అను మంత్రమును గూర్చి పఠింపవలెను. ఈమంత్రమేదశాక్షరమంత్రరాజమని మును లుచెప్పుదురు. పుత్రకాములకుశుభప్రదమంత్రము బ్రాహ్మణమూలమున నియమ పూర్వకముగా జపింపవలెను. ఈమంత్రమునకు ఋషిబ్రహ్మ, ఛందస్సు అను ష్టుప్పు, దేవత గోపాలదేవుఁడు.

## — న్యాసమంత్రము. —

శ్లో. ఛందోనుష్టుప్తథాదేవో, దేవకీనందనశ్శిశుః
హుంకారోబీజమాఖ్యాతం, నమఃకీలకముచ్యతే
గాంశక్తింబ్రాహ్మణఃప్రోక్తం, మంత్రస్యాస్యమహాత్మనః
షడ్దీర్ఘాంగలాఇతిప్రోక్తా, స్సర్వకర్మఫలప్రదః .

అని యీ న్యాసమంత్రమునను సంధించి పిదపనీలవర్ణుఁడు, సుదారాంగుఁడు ను, దేవకీగర్భసంభూతుండును, గంసభీతులైన దేవకీవసుదేవులకభయప్రదుం డును, నై పుత్రగోపాలనామమునఁ గీర్తనీయుఁడైన శ్రీకృష్ణభగవానుని ధ్యా నించి, కృష్ణాజినముపైఁదూర్పుమొగముగాఁ గూర్చుండి, నిశ్చలుఁడై ఫలకా ముఁడగువాఁడే పుత్రగోపాలమంత్ర జపముచేయవలెను. అనంతరముబంగా

రుతోనైనను, వెండితోనైనను, ఱేకొకటికొట్టించి దానిలో నాలుగుమూలలు నైదు రేఖలుగల యొకయంత్రమును వ్రాసి, యందు నడుమ నగ్ని బీజయుక్తముగా లక్ష్మినిఁ జిత్రించి, అయిదు రేఖలందును నరసింహ బీజాక్షరములు వ్రాసి యా యంత్రమైదురాత్రులు తత్పరుఁడై పూజించి కబళప్రాశనానంతరము

శ్లో. హరిరమా నాథలోకేశ, హాసీతావల్లభ ప్రభో
రక్షమాం పుత్ర దానేన, కృపయా పూర్ణయా సహ.

అను నీశ్లోకము ననుసంధించుచుఁ దోరము సందిటం గట్టుకొనవలయును. పిమ్మట రఘునాయకమూర్తి నైదు రాత్రులర్చించి, హనుమచ్చంద్ర సూర్యాంకితమును, బుత్రలాభ హేతుకమునైన యంత్రమును ధరించి జపసమాప్తి చేసి పాయసాన్నముతో గృహ్యాగ్ని యందుఁ బూర్వోక్త మంత్రము చేత షట్పాత్ర విధానమున రెండువేల హోమములు చేయవలెను. ఇట్లయిదు రాత్రులు జరిపిన వక్షమున జీవమూర్తి యగును. అంతట వరల విధివంతముగా హోమము చేసి హోమ శేషమైన చరువును బ్రహ్మస్వరూపముగా ధ్యానించి తీసి యొకపాత్ర యందుంచుకొని, మనోభీష్టమును స్మరించుచు దాని నైదు భాగములు చేసి యధ్వర్యుని వలన యజమానుఁడు తన భార్యకిప్పింపవలెను. అట్లిప్పించునప్పుడు ప్రథమాంశము నధ్వర్యుఁడు చేతఁ బుచ్చుకొని

శ్లో. భక్ష్యమేవం విశాలాక్షి, హోమశిష్టమిదం చరు
అనేక దోషసంభూతం, ధ్యానాత్తే మే వినాశయ.

అని యీయఁగా యజమానుని భార్య భుజింపవలెను. తరువాత

శ్లో. గోవత్సహననాత్పాపం, పాపం యచ్ఛిశుమారజే
హనచ్ఛ్రేణతత్పాపం, రక్షమాం పుత్ర దానతః.

అను శ్లోకము ననుసంధించుచు రెండవయంశమును,

శ్లో. దేవకీగర్భసంభూత, పాపం మేభయవర్జిత
తత్సర్వం నాశయాశుత్వం, కబళస్యాస్య భక్షణాత్.

అను శ్లోకము ననుసంధించుచు మూఁడవయంశమును,

శ్లో. పుత్రగోపాలసర్వేశ, పశ్యమామపుత్రిణీం
రక్షపుత్రప్రదానేన, చతుర్థస్యాస్యభక్షణాత్.

అను శ్లోకముననుసంధిలచుచు నాలుగవయంశమును,

శ్లో. అథత్త్వపితరోగర్భం, కుమారంపుష్కరాగ్రజం
యథేయంధారయిష్యామి, కబళస్యాస్యభక్షణాత్.

అను శ్లోకముననుసంధించుచు నైదవయంశమును భుజింపవలయును. ముగ్గురుభార్యలుగలచోట 6 చరువులుచేసి యాయాయంశములను క్రమముగా నాయామంత్రములతో జ్యేష్ఠానుక్రమముగా ముగ్గురిచేతను బ్రాశనముచేయింపవలెను. ఇట్లు స్త్రీలు చరుప్రాశనముచేసినపిమ్మట స్వస్థచిత్తుఁడైయజమానుఁడు భార్యాసహితముగ నేకాసనమునఁ గూర్చుండి, ఆరతిలోనగుమంగళముల నంగీకరించి, వృద్ధులును బూజ్యులునైన వారికెల్లనమస్కరించి వారిదీవనలుగ్రహించి యథోచితముగా బ్రాహ్మణులకు భోజనములుపెట్టి దీనానాథజనులనాదరించి సత్కరించి భక్తిభావనతోఁ గూడినవాఁడై వర్తింపవలయును. ఇట్లు యథావిధిగాఁ బుత్రగోపాలవ్రతము నాచరించువాఁ డపుత్రత్వవిముక్తినొందితోడనే దీర్ఘాయుష్మంతులగు సత్పుత్రులంబడయును. బహుజన్మార్జితమనోవాక్కర్మజనితపాపములెల్ల మూలముట్టుగ నశించును."

ఇట్లు చదివి మనోబలమును గూర్చి కొంతయోచింగినవాఁడగుటచే సారస్యమును గ్రహించి భగవత్పూజాసక్తుఁడయ్యెను, బాల్యంబునం దల్లిదండ్రులు సేసినలాలనమహిమయు, దుస్సహవాససంప్రాప్త పాషండమతత్వవిశేషమును, వేదశాస్త్రసారావిమర్శోద్భవాజ్ఞానంబును, యుక్తిపరుండననుగర్వంబును బురుషుండనను సాహసంబును నొకసారి తన్నుఁ బ్రేరేపింప నామెబుద్ధివిశేషమునైనను స్మరణకుఁ దెచ్చుకొనక యిట్లనిరి. 37

— జ్ఞానివిషయము. —

మ. తరుణీ! చూచితినీవ్రతక్రమమునంతంగాని నా బుద్ధికొ
క్కరవంతేనియునచ్చలేదు ; జగముల్ గల్పింపరక్షింప సం

హారణంబులఁ నెఱవేర్పఁ గర్తయగు బ్రహ్మంబేనయై యిట్టులీ
శ్వరుఁగా నెంచుచుఁ బూజసేయఁదగునే? బంగారపుంబొమ్మలన్. 38

గీ. జ్ఞానియైతన్నెఱింగినసజ్జనునకు, విగ్రహారాధనాదిక విధులవేల?
కులమువర్ణాశ్రమాచారములును నేల?, యనఁగఁ బాపరాజునకిట్టులనియెనుమతి.

— కలికాలజ్ఞానివిషయము. —

గీ. ఎంతఁజెప్పిననీవన్నదెంతొయంతె, గానియెదుటివారలమాట లోనిసార
మునుగ్రహింపవునీవింక మొదటివాద, మువదలి నాపలుకుసారమునుగ్రహింపు.

క. పరమతసృష్టియుజ్ఞానే, తరధర్మస్థితియు వేదధర్మలయంబుం
జరిపెడునిన్నపరబ్రహ్మరూపుఁడవనుచు నిఁకఁ గొనియాడఁగవచ్చున్. 41

గీ. సూర్యచంద్రాదిసకలవస్తువులవాజ్ఞ
చేసినడపఁగలవె? యొక్కజీవునివధి
యించిబ్రతికింపఁగలవె? నీవింక బ్రహ్మ
మేనెయని చెప్పుకొనుటను మానుకొనుము. 41

గీ. జ్ఞానినని చెప్పుకొనఁబోకు సకలశక్తు, లైనవ్యాసాదులకెయసాధ్యముగఁదోఁచె
నద్ది; క్రోధకామాలలో నణఁగినమన, కింగితజ్ఞానశూన్యులకెట్లుదొరకు? 43

గీ. నరుఁడెబ్రహ్మమౌ తెలివియే జ్ఞానమంచు, నుపనిషత్తులలోనేల యున్నదందు
వేసి, నదిసత్యమేగాని యిప్పుడొంద, సాముదాయకస్థితిపై నసాధ్యమద్ది.

గీ. సులభమని పలుకుదువేని సుఖముబాధ, మానమవమానమొకరీతిగానెరెంచి
గిల్లినను దిట్టినను సంతసిల్లునట్టి, వానిఁజూపింపవే! యీప్రపంచమందు. 45

గీ. అట్టిమంచిజ్ఞానమ్ము బ్రహ్మత్వమొందఁ, జాలుఘనులు శ్రీశంకరాచార్యముఖులు
నూటికొకరుందురీకలిన్ మాటలాడ, వచ్చు మహిమఁజూపుటదుర్లభంబుగాని.

—భక్తియోగము—

మ. కలినద్వైతపుసిద్ధి; దానిఁగొను సుజ్ఞానంబునొందంగ మ
ర్త్యులకున్ దుర్లభమంచు వ్యాసుఁడతికారుణ్యాత్ముఁడై భక్తియే
సులభోపాయము ముక్తినొందుటకటంచుం దెల్పెనెన్నో కథల్
గలయష్టాదశసత్పురాణములుగాఁ గావించె వేదార్థమున్. 47

వ. అట్లని యద్వైతవిద్య దెల్పలేదనుటయు నది యనాదరణీయ మనుటయుం గాదు. దేశకాలపాత్రబలము విమర్శించి యిప్పటికిదియే తగినదని ప్రత్యుపాఖ్యానమందును ద్వైతభావమునే సూచించినాఁడనుట. 48

గీ. అట్టిసూక్ష్మరీతివదలిపెట్టి మంద
మతులు మేము జ్ఞానులమని యతులగర్వ
పడుచుఁజేయఁగూడని యన్నిపాడుపనులుఁ
జేయుచు నుభయభ్రష్టులై చెడుదురకట. 49

శ్లో. సర్వే బ్రహ్మవదిష్యంతి। సంప్రాప్తేతు కలౌయుగే।
నానుతిష్ఠంతి మైత్రేయ। శిశ్నోదరపరాయణాః } విష్ణుపురాణము.

వ. ఈయర్థసారస్యమే శ్రీభాగవతంబున వ్యాసుండును జెప్పె నది యెట్లంటేని వినుము. బ్రహ్మచారి యతిగృహస్థులందెవ్వఁడైనం జిత్తంబు పరిపక్వంబు గాక యద్వైతానుసంధానంబు సేసెనేని వాఁడు మూఢుండయి చెడును. ఎందాఁక జీవుండు స్వతంత్రుండైన యీశ్వరుండు గాకుండునందాఁక నంగన యిది పురుషుండనేనను బుద్ధిమానుట కర్తవ్యంబుగాదు. దేహికి దేహావసాన పర్యంతము శ్రీమన్నారాయణ చరణకమలసేవనంబు కర్తవ్యంబు. ఇట్లు వచించె. ఒకరికి మహాత్మ్యాదులు సూపింపనాఁకుంబని లేదు. శంకరాదులవలె నేనుం జిత్తపరిపక్వత గలవాఁడనందువేని సాధారణ ప్రపంచోపకారార్థమాశ్రమాంతరమును (సన్యాసమును) స్వీకరింపుము. లేనియెడల సాధకక్రమముచే జ్ఞానులుగాఁదగిన యల్పబుద్ధులు నిన్నుఁజూచి యుభయభ్రష్టులగుదురు. నీవుజ్ఞానివిగాన శీఘ్రముగా సకలవిధలోకమునకు మార్గదర్శకుఁడవుగమ్ము. ఈనామాటలనైనం జక్కఁగా విమర్శింపుము. 50

—విగ్రహారాధనము.—

గీ. ఒక్కవస్తువు పైలక్ష్య ముంచిచేయు। భక్తినిశ్చలమై పూర్ణఫలదమునయియుండునని విగ్రహార్చనాద్యుచితకర్మములను నిర్ణయించిరి వ్యాసముఖ్యమునులు

గీ. ఎదుటివస్తువు పైకుణమేని గురిని, నిలుపలేనట్టి చిత్తచంచలులెచటనో గలపదార్థముపైనిల్పఁగలరె ? యట్టి, కెగురలేనమ్మ స్వర్గాన కెగురఁగలదె?

సీ. బ్రహ్మ రఘురామముఖులు శ్రీరంగనాథుఁ, బూజఁజేసి దారినిఁజూపిరిజనులకు వారుసుజ్ఞానమునుగల వారుగారె? యెట్లుగొల్చినదేవునికేమిలోటు.

క. కావున స్వావిరతావన, భావన సేవింపుమీవు పావనభావున్
శ్రీవరు నావిభుఁ డీవను, భావశ జీవాళిఁ బ్రోవ దైవము దేవా ?

క. అని భార్య యిడినయుత్తర,మును విని సిగ్గునవెలవెలఁబోయి యునతఁడి
ట్లనియెంగలి పురుషాజ్ఞం, దనదు మహామందబుద్ధి ధైర్యమునీయన్

—నరమాత్రునకుఁ గర్మముచే జన్మము తప్పదనుట—

చ. కలికిరో! నీవుచెప్పినటు కాలతలాదిక వైపరీత్యముల్
గలిగినచోఁ ద్రిశుద్ధిగను గర్మము సేయఁగలేని మర్త్యుఁడా
ఫలముభుజింప నీధరణిపైని జనించుఁగదా జనింపఁగం
దలఁపక ముక్తి గోరుకొను జ్ఞానికి నాకిఁక నేల? కర్మముల్.

గీ. కర్మములె జన్మమెత్తఁగఁ గారణంబు, లనిమన శ్రుతుల శాస్త్రంబు లందు లేదె?
తెలిసియునుగూడ నన్నింత కలత పెట్టనేల?, యనఁగ నవ్వుచు సామె యిట్టులనియె.

గీ. దేశకాలపాత్రలు భేదించినంత, మాత్రమున నే మహాజ్ఞాని మనసుతొట్రు
పడునె? నీవింతవాఁడవా! బ్రహ్మమే నేయనుచుఁ జెప్పుకొంటివి గాదె యహహ నాథ

—జ్ఞాని కర్మములు చేయుక్రమము.—

గీ. కర్మములె జన్మమెత్తఁగఁ గారణంబు, లని మన శ్రుతుల శాస్త్రంబులందునుంట
నిజమెయగునైన మన సెట్టులనిలుచునట్టి, ఫలము చేకూఱుననిమున్నె పలికితిగద.

మ. ధనపుత్రాదులు గల్గియాతనువు సార్థత్వంబుపొందంగనిం
కనుజన్మింపకయుండఁ, బూర్వకృతమౌ కర్మంబుపోవంగ, వి
ష్ణునకుం బ్రీతిజనింపఁజేయునలయూ నుజ్ఞానికర్మంబులం
గనునీసర్వపదార్థముల్ చలనముల్ గాఁజిత్తముం దెంచుచున్.

గీ. ఇట్లు ఫలముగోరక పరమేశ్వరార్ప, ణంబు సేయుకర్మంబు మోక్షంబునొంద
సాధనంబై యుగును జుమీ! నాథ! యనఁగ, నామెకిట్టులనియె నామహాసుబుద్ధి.

—జ్ఞానికర్మములు చేయనక్కఱలేదనుట.—

గీ. ఫలముగోరని యప్పుడా పనినిఁ జేయ, నేల? యీశ్వరార్పణ సేయ నేల? యావృ
థాశ్రమం బేల? ఫలమందు తలఁపులేని, వాఁడు నన్యంబులను నాటిపాటు పశునె.

గీ. సాధన చతుష్టయములో నిశమదమాదు, లైన యాఱింటిలోఁ దృతీయంబయినయు
పరతియనఁ జ్ఞాననిష్ఠను భంగపెట్టు, నాశ్రమాచారముల పరిత్యాగమెగద,

వ. అదియునుంగాక శ్రీకృష్ణభగవంతుండు "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణిభస్మసాత్కురుతే తథా" యనివచించెను దానిచే నతీతవర్తమానాగత కర్మంబులెల్ల నశించుచుండఁగా మఱలంగర్మారంభమేల యన నతనికామె యిట్లనియె. 64

—కర్మప్రభావము—

క. కర్మమునఁబుట్టుఁ బ్రాణులు, కర్మంబున వృద్ధినొందుఁ గడతేఱుదుద
త్కర్మంబుననే గావునఁ, గర్మమె దైవమనికలదు కను వేదములన్. 65

ఆ. స్త్రీనిజూచి మనను చెఱుదుకొనినవాఁడు, స్త్రీనెగూడి శాంతిఁ జెందినట్లు
కర్మమున జననము గాంచిన మనుజుండు, కర్మముననె ముక్తి గానవలయు 66

క. కర్మంబె దైవంబన, ధర్మంబే యనఁగవలదు తగినట్లుగనే
కర్మంబును జేసిననది, నిర్మలఫలమిచ్చుచుండి నెగడుట లేదే? 67

శా. అజ్ఞానంబునఁగర్మముల్ సలుపువాఁడత్యంత బాధంగనున్
సుజ్ఞానంబునఁ జేయువాఁడు సుఖియై శోభిల్లు నేరీతిక
ర్మజ్ఞానంబును లేక మూర్ఖుఁడగుఁ గర్మత్యాగియౌవాఁడు, ది
వ్యజ్ఞానంబునఁ జర్చసేయు నెడ సర్వాధార మాకర్మమే. 68

ఉ. సారపుఁగర్మమే పడవ సంసరణాంబుధిదాఁట, దానినిన్
నేరుపుమీఱఁగా నడప నేర్చినవాఁడు విముక్తిఁగాంచెడున్
నేరనివాఁడు తజ్జలధినే తిరుగాడుచునుండు, నావనే
చేరనివాఁడు రెండిటినిఁ జెందక స్థావరరూపుఁడై చెడున్. 69

ఉ. జ్ఞానము మోక్షమొందఁదగు సాధనమైతగుఁ; గర్మకాండమా
జ్ఞానము సంగ్రహింపఁదగు సాధకమైతగు; వీనిఁ దెల్పుటన్
మానవజాతి వేదముల మన్ననఁ జేసిరి; మాయ చేజడం
బైనజగంబు ముక్తిగతి నందునె? సాధకహీనమైనచోన్. 70

—ఋణత్రయము—

గీ. ఫలముగోరనియప్పుడా పనినిఁ జేయ, నేల? యంటివి కర్మముల్ చేలుఁ జెట్లు
గావు, నీనాఁడు నానాఁడుఁ గలుగ లేదు, వానిసత్త్వంబు దెలిపెద బాగుగవిను

గీ. దేవతలఋణంబును బితృదేవతలఋణ, మృషులఋణమనునుఋణత్రయంబు
భూమియందుఁబుట్టిన ప్రతిపురుషునకును, దోడఁబుట్టులై విడువక కూడనుండు.

గీ. తనకులాచారుఁడై దేవతల ఋణంబు, తనయులంగని పితృదేవతలఋణంబు
పరసతీవర్జనాదిక బ్రహ్మచర్య, దీక్షచే ఋషులఋణము దీర్పవలయు. 73

గీ. దీనిఁదీర్పనివాఁడు ముక్తిఁగనలేఁడు, శంకరాచార్యులవిధాన సకలశక్తు
లైపరబ్రహ్మతుల్యులై యఖిలదేవ, పూజ్యులగువారి మాత్రంబు పొందదద్ది.

క. ఏమందువేనివారిమ; హామాహాత్మ్య దికములె యాఋషిపితృదే
వామరులకు మోదంబిడ, సామర్థ్యముగలవియాను సకలవిధములన్

క. కావున నేఁజెప్పిన యీ, పావనరీతులు గృహస్థవరధర్మంబుల్
నీవిప్పుడట్టివాఁడవె, కావున గృహిమార్గధర్మ కర్తవ్యముఁగనుమా.

గీ. ఇట్టికర్మస్వరూపంబు నెఱిఁగి యేవ,సిష్ఠజనకాంబరీషాది శిష్టులుఫల
మనుభవింపఁగోరక యీశ్వరార్పణంబు, సేయుచు సకలకర్మముల్ సేసిమనిరి

—త్రివిధకర్మస్వరూపము.—

గీ. ఆఋణత్రయరూపకమైనయట్టి, వాని నిత్యనైమిత్తికపారమార్థి
కంబులనుమూఁడు విధములుగానొనర్చి, వాదుదురునరుల్ చెప్పెద వానివినుము.

గీ. సంధ్యలందు వార్చుట, యుపాసనము, వైశ్వ
దేవమును జేయుట, యుక్తదినములందు
నిష్టియజ్ఞముల్ సేయుట యిట్టిప్రతిది
నాఘహరణ కర్మములు నిత్యములనఁబడు. 79

గీ. ప్రతిదినంబునస్నానంబుఁ బదిదినంబు, లకఁదలంటుఁజేయనివానిలాగు సంజ,
వార్చుటయుయజ్ఞములుమానువాఁడువిపుల, కల్మషానుభవవ్యాధిగలిగియుండు

క. మృతులకు శ్రాద్ధక్రియలును, చితవేళలఁదర్పణములు చేయుటభార్యా
సుతముఖులపోషణమునా, గతాఘహరములునిమిత్తకర్మంబులగున్. 81

ఉ. వానలకారువచ్చినను వానగృహంబునునేయఁ జేయుటన్
మానుగృహస్థుచందమున మత్తతచేత నిమిత్తకర్మముల్
మానుగఁ జేయమానుకొను మానవుఁడాత్మ జనావమానమున్
మానసదేహబాధల సమానముగాఁగని వెన్కఁజింతిలున్. 82

క. వ్రతయాత్రాచరణంబులు, నతిధినపర్యేశచింతనాదులుహతదు
ష్కృతములు విశేషపుణ్యా, గతహేతులు పారమార్థికపుఁ గర్మంబుల్. 83

మ. సుకవిత్వంబును నేర్చి లోకహితమై శోభిల్లు కావ్యంబు సే
యుకవిశ్రేష్ఠుని యట్లు భక్తియుతుఁడై యుపాంశుచుం బారమా
ర్థికకర్మంబులు సేయువాఁడు విబుధశ్రేణీసమారాధ్యుఁడై
యకలంకంబయి కీర్తి పూర్వమగు నాత్మానందముం బొందెడున్. 84

గీ. దేశకాలపాత్రములు భేదించెనేని,
నిత్యనైమిత్తికంబులు నిలిచిపోవు
నపుడు తగిన ప్రాయశ్చిత్త మరసి చేసి
కొనుచు నా దోషము హరించుకొనఁగవలయు. 85

ఉ. వీనినిఁ జేయుపద్ధతులు వేదములోపలనున్న వైనస్వ
స్థానజనానుగుణ్యముగ ధన్యులు కొందఱు మార్చియుంటచే
వానికి భేదముల్ గలిగె స్వల్పములైనవి, యేదెటుండినన్
మానవుఁడాత్మదేశకుల మార్గము ద్రొక్కుట యుత్తమంబగున్. 86

—శమాదిషట్సంపత్తిలోని యుపరతి—

గీ. ఉపరతికిమును ముందుగా నుండఁదగిన
యంతరింద్రియనిగ్రహ మనెడి శమము
నఖిల బాహ్యేంద్రియవిజయ మనెడిదమము,
గలవె! నీకింక నెపుడైనఁ గలుగఁగలవె? 87

చ. "వనదళవాతముల్ మెసవువారు పరాశర కౌశికాదులా
ఘనులును సుందరీజనులఁ గన్గొని మోహితచిత్తులైరి హె
చ్చిన ఘృతపాయసాన్నము భుజించెడువారలకున్ మనోజయం
బునెగడునేని వింధ్యము సముద్రజలంబులఁ దేలియాడదే." 88

ఉ. అనువిబుధోక్తిఁ జూచి మతి నందుము తచ్ఛమముందమంబు నొం
దిన మహనీయులీ యుపరతిన్ విషనాడకయున్న భంగముం
గ సరదిరయే సుమార్గమని గట్టిగ నమ్మితివే! సుబుద్ధిగ
ల్గినమగఁడా! జగంబునకు క్షేమముగల్గునె? నీవిటాడినన్. 89

చ. శమదమశూన్యుఁ డెట్లుగను సాధనసంపదకి? నద్దిలేక యే
క్రమమున శాస్త్రచర్చ కధికారము చేకుఱు? నద్దిలేక జ్ఞా
నములభియించు టేగతిని? జ్ఞానము లేక కెటులొందవచ్చు మో
క్షము? నివి యన్నియున్ సులభసాధ్యములే గద! ప్రాణనాయకా. 90

చ. శుకభృగుముఖ్యమౌనులతిశుద్ధమనోబలు లెంతకాల మో
ప్రకటతపంబుచేసియును బ్రహ్మము మేమె యటంచుఁ జెప్పఁజా
లకహరిభక్తిఁబూని సకలంబు రమాపతికిచ్చి వానిసే
వకులయి పోనిరెల్లభవబంధములంగనవే! పురాణముల్. 91

గీ. సృష్టియును స్థితియులయంబుఁ జేయుశక్తి,
గలుగుదాఁకను బ్రహ్మము గాఁడు నరుఁడు
గనుక నందాఁక మానుషకర్మములను
మానిన నుభయభ్రష్టుఁడై మలినుఁడగును. 92

—కర్మనాశకరజ్ఞానము—

గీ. జ్ఞానవహ్ని సకలకర్మ నాశనంబు, సేయుననుదానిసారము చెప్పెదవిను
కర్మములనఁగానిచ్చటఁ గర్మఫలము, లనితెలిసికొనవలయు ననిరిమునులు.

గీ. పూర్వజన్మ పాతకపుణ్యములఫలంబు, కష్టసుఖరూపముగనున్న కారణమున
మొలచియున్న చెట్టులను గొడ్డలివిధాన, జ్ఞానమనునిప్పువాని భస్మంబుసేయు.

గీ. నరుఁడు దేహాంతమగుదాఁక నజపవిహిత
ములగు వర్ణాశ్రమాచారములు బుణంబు
దీర్చుసాధనములపుడు తెలివిగలిగి
చేయవలెఁగాని తప్పునే చేయకున్న? 95

గీ. దేహమనుదీర్ఘరోగమే తెంచినప్పు,
డాశ్రమంపుఁగర్మములగు నాశ్రమంపుఁ
గర్మములు జ్ఞానమనుమందు క్రమముగఁదిని
యాశ్రమపుఁ గర్మములముక్తి నందవలయు. 96

క. అనఁగా నాసరసోక్తులు, విని యామంత్రివరుఁడెంతొ విస్మయమును సి
గ్గును బొంది వెక్కిరింపం, గనలవిగామిని జతురతగా నిట్లనియెన్. 97

చ. కలికిరో! నీదుమాట సరిగాదనఁగూడదుగాని నీవు నా
పలుకులకున్ విరోధముగఁ బల్కుచునుందువు; జ్ఞానమేది? మ
ర్త్యులకెటులబ్బు ముక్తి? యెటులుండును జ్ఞానముగల్గువాఁడు? నీ
తెలివియుఁదేటయుం దెలియఁ దెల్పుము లోకహితంబు గోరుచున్. 98

క. అననాయమ నవ్వుచుని, ట్లనియెం బసలేని ప్రశ్నలడుగుచు స్త్రీనిన్
ననుశ్రమపెట్టితివీగతి, ననుపమసందేహమాది నడుగఁగవలదే. 99

ఉ. ఈయుగమానవాధముత నెంచిదయాళుఁడు వ్యాససూని యా
మ్నాయవిభాగపండితుఁ డొనర్చినయుత్తమ ధర్మబోధముం
జేయుచునున్న నాపల్కుకు చెడ్డదటంచెవఁడైన ధర్మముం
బాయుమనుష్యుఁడన్న; భగవంతుఁడులేఁడె? సమస్తసాక్షిగా. 100

గీ. అఖిలలోక గమ్యస్థానమైన ముక్తి,
నందుమార్గము దెలిపిన యనఘమునుల
మతము బోధసేయుటకంటె మానవునకుఁ
బుణ్యమనియొకటి గలదె? భూమియందు. 101

వ. తెలిసికొనునెడల నీప్రశ్నల కుత్తరము,లింతవఱకు నేను జేసినయుపన్యాసములందేగలవు. అయినను లోకహితంబు కోరి కుబుద్ధివిగాని యట్లడిగితివి గావుననీయర్థంబును దెలుపునట్టి యొక్క చక్కని యితిహాసంబును జెప్పెదను. సావధానుండవై వినుము. 102

—బ్రహ్మజ్ఞానసత్యస్వరూపము—

క. తననాభియందుబ్రహ్మను, గనిహరికనరాకపోవఁగాదిననవ్వృ
ద్ధినిగనియాబాలుండొక, దినమునసిరీతిఁదనమదివిచారించెన్. 103

—బ్రహ్మవిచారము—

ఉ. నేనెటుపుట్టితిన్? ననుజనింపఁగఁజేసినదేవుఁడెవ్వఁడో?
యేనిఁకనేమిసేయవలె? నెక్కడికేగుదుఁ? గంటికేమియుం
గానఁగరాదటంచుఁదనుఁ గన్నపదార్థముఁ జూచుకోర్కతో
ధ్యానముసేయనాత్మునమె యాహరియుంగడు సంతసించుచున్. 104

—శ్రీమహావిష్ణు సాక్షాత్కారము—

సీ. మెఱుపుతీఁగవిధాన మెఱయుబంగరుబట్ట ఘనశరీరతనెఱుఁ గంగఁజేయఁ
కరతలశంఖచక్రముఖ చిహ్నంబులు ప్రథితప్రభుత్వంబు ప్రచురపఱుప
శ్రీవత్సకౌస్తుభ శ్రీదీప్తవక్షంబు పురుషోత్తమత్వంబు పూనితెల్ప
నఖిలాంగసూచిత మగుశాంతభావంబు సాత్వికమూర్తిత్వ సరణిఁదెల్ప

గీ. భాస్వదబ్జాక్షియుగళంబు భాసురకమ, లాధిపత్యకువలయాధి నాథతలను
దెల్పఁ,గవినాయకాత్మసుస్థిరత మెఱయ, నట్టెబ్రహ్మదగ్గఱనిల్చి యిట్టులనియె

—విష్ణుకృతబ్రహ్మోపదేశము—

మ. బుధుఁడా! నేనినుఁ గన్నవాఁడ; సుమతిన్ బోధింపఁగా నీవు ని
ష్ఠను నీధ్యానమువల్ల వచ్చితి; జగంబుల్ నేనె సృష్టింతు; నె
వ్వనిచే సర్వస్థలులందు నుత్తమవిభాపూర్ణుండనై యుందు; నె
వ్వఁడు లేఁడన్యుఁడు; సర్వనాయకుఁడనై భాసిల్లుచుందుం జుమీ. 106

గీ. కర్మసూత్రము నెమ్ము నాకగు ధర్మశాస్త్ర, మును రచించి దానిని గ్రమముగ నడపయ
మాదుల విధించి తత్ప్రయోపినై తటస్థుఁ, డనయి సాక్షినై యానందుఁడనయి యుందు.

గీ. బీజమందు నిలిచి కర్మ విధినిఁ బట్టి, సకలతంత్రములను నడుపుదు; వికటమాన
సుండు గాక నరుఁడు కర్మసూత్రసార, మెఱిఁగెనేని నన్నెఱిఁగినట్లెంచవలయు.

గీ. యోగయానిమునులు కర్మయోగసిద్ధి, యనెడి జ్ఞానయోగముచేత నతిసులభము
గా నను గలసికొందురు గాన గర్మ, మును విడిచినవాఁడన్నింట మూఢుఁడగును.

క. కావున స్వానుభవంబునఁ, బావనులగు ఋషులచేత వ్రాయఁబడిన శ్రీ
కైవల్యామృతరససా, రావహ కర్మములొనర్పు మతినిష్ఠనుతా. 110

క. ధరలోన నాదినుండియుఁ, బురాణపురుషుఁడనగుట నపుంసకలింగం
బిర వొందఁ నాకుఁ బేరుం, జిరబ్రహ్మంబనుచు ఋషులు చిరతర చర్చన్. 111

క. సకలముఁ గన్నది యనునాక, ప్రకటనచే లేనిదగుచుఁ బరఁగిన శ్రీవా
చకసంజ్ఞం బ్రకటించిరి, ప్రకృతి మహామాయ యనుచు బహువిధచర్చన్. 112

గీ. అట్టిమాయల మాలిది యధికశక్తు, నైన నన్నంట దెప్పుడు; నంటుచుండు
నన్నరమియుండు రమియింతు నన్నలోక, సంతతి జనించుట యబద్ధమింత నిజము.

క. కానఁ బురాణబ్రహ్మము, లేని ప్రకృతియందు జగము లీలార్థముగా
నైనఁగనెననుట భ్రాంతియె, యానని ఋషివర్యులనిరి స్వానుభవమునన్.

సీ. నాకుఁదక్క నితర నరమాత్రులకు నవాఙ్మనసగోచరమైన యీయ
థార్థము నాపరిసాదరానమునఁ గాంచి నాతోసమానులై నన్నుఁ గల్సి
బహుకల్పములు చూచి బహుసృష్టులను జేసి యిపుడును నాలోన నెనసియున్న
గర్గవసిష్ఠమార్కండేయులైలవి శ్యామిత్రభృగ్వాది పరమహర్షు

గీ. లాదిలోఁ దాము వ్రాసిన శాస్త్రయుండ, నప్పటప్పట భూలోకమందుఁ బుట్టు
చుండు రహితలోకానుగ్రహేచ్ఛ జ్ఞాన, భక్తినీతి వైరాగ్యముల్ వలుకుచుండ్రు.

గీ, తన్మహిమనిచ్చు నా ప్రసాదముగడించు, సాధనము నాదు భక్తియా; శాస్త్రవిహిత కర్మనిష్ఠఁ గుదురు భక్తి; కామకాంక్ష, భక్తి విడిచిన నుపశాంతిఁ బడయుటరుదు.

చం. పరిపరిరీతులం జదుఁడు భాసుర యౌవన కామినీకుచో
పరిపరిరంభ, ముగ్ధమృదు వాక్సతచుంబన పూర్వకంధరో
పరిపరిరంభ వాంఛఁ దెలవారి సదా భజియించు; బుద్ధిపెం
పరిపరితృప్తి నొందును గృపాకలనుల్ ననుఁ గొల్చిముక్తుఁడై. 117

క. కావున నీవును కావన, భావనఁ బూజింపుమనుచు స్వమహోద్యుతికిం
దావగు రంగవిమానము, శ్రీవేదములన్ జగము సృజించుటని చెప్పెన్. 118

వ. ఇట్లు సంసారి సన్న్యాసి ప్రధానధర్మక్రమంబుగా జగత్స్వరూపుఁడయిన తన ప్రభావమును స్పష్టపఱచి తనంత వానిం జేసి నూఱుమహాయుగంబులు జీవింపు మనిదీవించి యా మహావిష్ణుం డంతర్హితుండయ్యె. నంత నా బ్రహ్మదేవుండు తన తండ్రి మహామహిమంబునకాశ్చర్యంబు నొందుచు నది మొదలు చేసికొని. 119

కం. నిత్యము శ్రీరంగేశ్వరు, నత్యధిక ప్రభక్తిఁ గొల్చి యా పుణ్యమునన్
సత్యజగన్నాయకుఁడై, శ్రుత్యనుగుణ సృష్టి సేయుచును బాలించెన్. 120

క. వెనుక మనువాధర్మం, బునెపూని సకలపతియయి మోదముగొని దా
నినిశాస్త్రరూపముగ వ్రా, సెను జగదుపకార బద్ధ చిత్తుండగుచున్. 121

చ. జనక జనాధిప ప్రముఖ సజ్జనులా మనుమార్గ మూని యా
జనులకు దారిఁ జూపిరిటు సర్వముఁ బూర్వమునుండి వచ్చుచుం
డె; నిదియె బ్రహ్మమార్గమని డెందములో వలనమ్మి పూని చే
సిన మనుజుండు బ్రహ్మతను జెందును వింటివె ప్రాణనాయకా. 122

గీ. దీనిసారంబు నిసుమంత దెలిసికొన్న, వారుతరియింతు రనఁగ నా వరమగతులు వినియతఁ డుకలిపురుషప్రేరణంబు, చేతమఱలవంకరచర్చ సేయఁదొడఁగె.

—వేదశాస్త్రపురాణనింద—

మ. తరుణీ! గ్రంథములోని నీతులను గాథల్ గట్టిగా నమ్మి యా
వరుసన్ వాదము సేయుచుంటివహహా! పాపయ్యారత్న ప్రభా
చరితం జెప్పినయట్లె పూర్వకవులీ శాస్త్రంబులున్ నీతులుం
జరితల్ గల్పన చేసిర ప్పటిజనుల్ సంతోషముం బొందఁగన్. 124

గీ. వేదములు వానిలోఁ జాలఁ బెద్దవగుట
చేనితరములు వానితోఁ జేరియుండె
వీనిపూర్వమం దెటువంటి వేదశాస్త్ర
ములుగలిగియుండెనో మనకుఁ దెలియదుగద. 125

గీ. అట్లుగాక దైవము చేసినవె యయినచో, మాదిరి సేతుమధ్యస్థలమందె యుండి
యితరదేశములన్నింట నేలలేక యుండె? నీవేదశాస్త్రంబు లోలతాంగి

గీ. రామపాదధూళిని రాయి రమణియయ్యె
నాకమునలికోఁతి జలధిఁ దేలికగ దాఁటె
నని ప్రథమకావ్యమైన రామాయణంబు
నందుఁగలదివి సత్యవాక్యంబు లెగద ? 127

గీ. బాలుఁడైనకృష్ణుఁడు పాము పడగమీఁద, నాట్యమాడెను భూమికి నాథుఁడైన
కంసుని వధియించెనని భాగవతమందుఁ, గానఁబడునివి సత్యవాక్యంబు లెగద?

గీ. అర్జుననకు మీనము లాది యందుఁగలవు
నదుమునొకయేటలేవు ; వెనక్కను మొలిచెను
పిండముతఱిగి వండఁగాఁ బిల్లలయ్యె
ననెడి భారతకథలు సత్యంబు లెగద ? 129

గీ. ఇంక నిట్లుప్రేలినకథ లెన్నియేనిఁ
గలవు వానినమ్మినఁజెడఁగలఁడు నరుఁడు
వానిలో దైవమొక్కఁడే జ్ఞానిసర్వ
సముఁడనునదే సకలమత సమ్మతమ్ము. 130

గీ. వానిఖండించినూతన పద్ధతులు ర, చించిచక్కఁగా వ్యాపింపఁ జేయువారు
మఱల లేమి చేనిపుడు నామార్గములనె, నడుచుచుంటిరి ముప్పాళ్ళు, నరులు కాంత.

గీ. ఇపుడుబుద్ధిశాలులుగొంద ఱెంతొ పాటు, పడుచుఁ బూర్వపద్ధతిగొట్టివైచి జ్ఞాన
శాస్త్రరీతి ధర్మంబులు సలుపుచుండి, రేల ? నీవాదమననామె యిట్టులనియె.

క. పావనవేదాళిస్మృతి, భావము మాతండ్రివలనఁ బడసితి, బుధసం
భావితుఁడవైననీకడ, జీవించితిఁదోఁచినట్లు చెప్పెదవినుమా. 133

చ. మునుపటివారిమార్గములు పూనియెవృద్ధినిఁబొంది ; బట్టగ
ట్టనెఱిఁగి, ఇంటెమూని, ప్రకటంబుగవిద్యనునేర్చి, భార్యగా

గీ. వీనిఁబోలినశాస్త్రాల వేనినైనఁ, జేయలేకుండుటట్లుండఁ జెప్పినట్టి
వానియర్థమైనను గ్రహింపఁగలమె? మన, మింక నాశక్తిఁ గలుగునే? యొన్నడైన

వ. అనేక లక్షలప్పటంగని పెట్టి వ్రాసి యుంచిన జ్ఞానినొకచోటికిఁ జేర్చికొందము శాస్త్రములుగా వ్రాసినారన్నను భగవత్సృష్టివిశేషమును గనుఁగొన్న యదియు నిరుపమాన నాగరికతయే గదా.

— వేదములు. —

గీ. ఇట్టిశాస్త్రసంఘాతములెల్ల నంగ, ములుగఁ గలవేదములు పలుకఁ-బలుకు నమ్మ
నట్టి మానవ మాత్రునే మనఁగ వచ్చు, నతని వినుతించు వానినేమనఁగవచ్చు?

క. అనుభవమున వాదంబున, జను లెవ్వరు దాఁటిచనన సాధ్యతరంబై
దనరు తరిపూర్ణాద్వైతం, బును దెల్పెడు వేదములిల మొదటివి గావే? 145

క. మతిశక్తి లేకయుంటను, శ్రుతిమార్గము మనమనమును జొరకుండెను ది
-వ్యతపోబలు లప్పాయ దీ, క్షితముఖ్యులు వేదనింద సేయఁగడఁగిరే? 136

— వేదవ్యాప్తి —

క. మానుపీనుకలాతనియును, మనువేలినయట్లు గలదు మనగాధల వా
నినిఁబట్టి శ్రుతులు సకలా, వనిఁగలవని నిశ్చయింత వచ్చునుగాదే? 147

వ. గ్రంథస్థములైన యిట్టి పూర్వకాల ప్రమాణములెన్నింటినిఁ జూపినను నిప్పటి వ్యాప్తిలేకుండుటచే నీ బుద్ధిప్రకారము దేవునందుఁ బక్షపాతమే కల్గును. సృష్టిలోని యన్ని విషయములును భగవన్నిర్మాణములే గదా. అట్లయినప్పుడు కొన్ని దేశముల దౌర్భాగ్యమునకును గొన్ని దేశముల మహాభాగ్యమునకును గారణమేది. ఎక్కడనో దేశములదాఁక నెందుకు? ఏయాచారములు పరిశుద్ధములనియు నేమతము సత్యముగా భగవన్నిర్మితమనియు నీవు దలంచుచుంటివో యవియే నీయర్ధశరీరమైన నాకేరుచింపకుండుటకు హేతువేది? ఇది వారివారి పూర్వప్రారబ్ధఫలమే గదా. కావున దైవనిర్మితములందఱికి సరిగానుండుననుటగాని యంతటనునుండుననుటగాని కేవలము సిగ్గును బుట్టించు నూహగానున్నది. ఇంక వేదములు దైవనిర్మితములనుటకును, నట్లైన నందఱును నంగీకరించుటకు హేతువు చెప్పెదను వినుము. వేదవ్యాఖ్యానకర్తలే యర్థవాదములని వ్రాసిన కొన్ని చిత్రగాధల యథార్థమీకాలమున మనవాండ్లబుద్ధికి గోచరించినను గోచరింపకున్నను మనుష్యప్రకృతి

కెని, లోకవ్యవహారమునకును, ఆత్మజ్ఞానమునకును దాఁటిపోనియనేక ముఖ్యాంశములు వేదములలోఁ గలవు. వేదములు పరిపూర్ణముగాఁ జూచినఁ గాని యాయంశములు స్పష్టముగాఁ దెలియవు. ఇతర మతవేదములలో నిన్ని యంశములు లేవనుట బుద్ధిమంతులకు స్పష్టమే గదా. కొన్ని వేదసమానాంశములున్నను మనదేశముయొక్క శీతోష్ణాదిస్థితులకు సరిపడిన న్యాయధర్మములుగల మనవేదములను విడిచి యన్యుల వేదముల నవలంబించుట మనకెట్టి న్యాయమును గాదు. కొన్ని ఘనాంశములున్నయెడల వానినే గ్రహింపవలయును. ఇట్లుత్తమాంశములుగల వేదములు దేవుఁడు దయచేసినాఁడనిన నది బూతుమాటయైనదా? కాలక్రమమున నుపయోగజ్ఞానశూన్యులై, మూఢభక్తులై, డాంబికులై వర్తించు నిప్పటి ఛాందసులంగొందఱింజూచి "యథార్థమును స్పష్టముగాఁ దెలుపనియర్థవాదగాథలవల్లనే యీమతమిట్లుపాడైన"దని కొందఱు మహావిద్వాంసులుగూడ వేదమతవిరోధులైనను, "పరలోకసౌఖ్యప్రదమనియుం బుల్లయ్య చేసినాఁడనియును మాటుగాఁ జెప్పుటయే యిహలోకసౌఖ్యమున కతిప్రోత్సాహకరమగుటచే జ్ఞానకాండార్థవాదగాథలే వేదములలో ముఖ్యముగా నుండవలసిన భాగము" అని వేదములను గౌరవించుచుఁ గొందఱు సూక్ష్మబుద్ధిమంతులు హితోపదేశాదికేతిహాసములను రచియించుచు వచ్చిరి. వేదమతయథార్థమెఱిఁగిన పూర్వులును నిప్పటి వారును నిహపరలోకనాగరికతలలో నతిప్రౌఢులై యున్నారనియు నితరమతములవారికీ రెండును దక్కవగానే యున్నవనియు నిప్పటి గొప్ప నాగరికులు లొప్పుకొనుచునే యున్నారుగదా. ఇతరమత వేదములను మనవేదములను బరిపూర్ణముగాఁ బరీక్షించి చూడక కొందఱు పాక్షికుల బోధలవలన బ్రాహ్మణోత్తములు కొందఱు వేదమతమును నాశముచేసికొనుచుండఁగా సమస్తమతరహస్యవేత్తలైన పాతాళలోక వాస్తవ్యహూణాది మహానాగరికులందఱును నీవేదమతము నవలంబించి తిరిగి మనకే బోధకులగుచున్నారు. మఱియును కేవలమిహలోకనాగరికతనే బోధించుననే కాల్పనికమతధారులై, దయాసత్యశౌచబాహ్యులైన బ్రాహ్మణులయందు నిల్వలేక న్యాయప్రవర్తకులగుచున్న కోమట్లు, కమసాలులు, శూద్రులును నగు ప్రస్తుతబ్రాహ్మణేతరులైన యష్టాదశవర్ణములవారిని వేదమతాచారములాశ్రయించుచున్నవి, మొత్తముమీఁ

దఁగొందఱు విప్రులును, గొందఱు పాక్షికులగు నాగరికులును వేదమత శత్రువులు. తక్కిన నాగరికలోకమంతయు వేదమత మిత్రులైయున్నారు. మొదటినుండియు శత్రుభాగము తక్కువగుటచేతనే యనేకకష్టములను దాఁటి యీవేదమతము మతమాతయైనిలుచుటకు హేతువుగానగుపడుచున్నది. అట్టియల్పశత్రులుగూడఁగొన్నదినములకు మంచినాగరికతగడించి వేదమిత్రులగుట పలుచోట్ల జరుగుచునేయున్నది. మిగిలిన యల్పసంఖ్యగతియు నిట్టిదే. కాకన్నను ననేకనాగరికపుత్రులం గాంచిన మతమాతకు నీయల్పసంఖ్యాకులవలని భయము లేశమైనను గల్గదు. ఇట్లనేక మహానాగరికుల మానసముల నాకర్షించుచున్న యుత్తమమతమునకు జన్మభూమియైన వేదములును, సోదరులైన శాస్త్రములును, దాదులైన పురాణములును దేవుఁడు దయచేసిన వసితమదైవభక్తినిఁ బ్రకటించుకొన్న మహర్షిపుంగవుల సాధువాక్యముల పరమార్థమును గ్రహింపఁజాలని నిన్నుఁగూర్చి నేను మిక్కిలి విచారించుచున్నాను.

—పురాణములు—

గీ. బాలరామాయణంబులోఁ బలికినట్టి, రామగుణరూపములు విద్య సాము నెవ్వ
డైనఁ జదివితివే! యతం డద్భుతంపు, బనులు చేసినాఁడనశంకపడితె! నీవు.

గీ. చెప్పినట్లు సాధకమును జేసి యిపుడు
గానమును జేయుట శతావధానము మొద
లగు పనులు సేయుదురు కొందఱు ప్రయోజ
కులకదియు నిదియును గూడఁ దెలియదా గద. 150

గీ. వ్యాసరామకృష్ణాది మహాత్ములిట్లు, సాధకముచేత నద్భుతశక్తులైరి
నీకుఁ దెలియని వాసినినింద సేయఁదగునె? కొంచెమాలోచింపఁదగదె? మగఁడ.

గీ. కాలగతినిఁబట్టి క్రమముగా నిప్పుడు, సాధకంబులేక జనులు హీన
బుద్ధిశక్తులగుటఁ బూర్వపద్ధతులకు, వింతనొందినమ్మ రింతయైన. 151

వ. కొందఱెంత చదివినను జదువురానివారైయున్నారు. కొందఱొకసారి చదివినమే గ్రహించుచున్నారు. కొందఱు నిరీరయే విద్వాంసులగుచున్నారు. ఇది భూతస్వభావమనుకొన్నను బూర్వకర్మమనుకొన్నను బ్రత్యక్షాంశమేగదా. రామకృష్ణుల బాల్యామానుష చర్యలిట్టివనుకొనరాదా? ఎట్టివియును గాకున్న హరిశ్చంద్రాంబరీషాద్యనేకపుణ్యపురుషులుండఁగా మహర్షులందఱును రామకృష్ణులే దైవములని యేలవ్రాయుదురు? మనకివిచిత్ర గా

థలని తోఁచినయెడల నింకలినీతియే గ్రహింపవలెను. చిరకాలచరిత్రలుండు టకిదియే గదా ఫలము. ఇట్లు మంచినీతి యిప్పట చేతనే నాగరికులచేత గౌరవింపఁబడక యిది చిరకాలమునుండి నిలిచియున్నది. నీతినిగ్రహింపనేరక దీనిని నాశము చేయనెంచిన బౌద్ధచార్వాకాదులు తామే నశించిరి. బాలబోధయన్నట్లు స్త్రీ శూద్రులకొఱకుఁ బుట్టిన పురాణములందలి నీతినే గ్రహింపలేక వెక్కిరించుచు, నుపనిషత్తుల యర్థము నుసాధింతుమని చెప్పుకొను నీకాలమందలి పురుషశబ్దవాచ్యుల బుద్ధిచాతుర్యము నాకు మిక్కిలి యాశ్చర్యమును బుట్టించుచున్నది. 153

గీ. వేదశాస్త్రపురాణాది భిన్నగతులు, జ్ఞానశాస్త్రధర్మంబులు గాఁగ నాథ
యట్టులూహించి మానవుఁ డాచరించు, పనులు రెండింటి భ్రష్టత్వమున కెనుమ్ము

చ. ఘనవనసంఘ భంగకరణ కర్తలకుంబలెఁ బక్షపాతముం
గినుకయు లేదు నాకెచటఁ గేశవసాక్షిగ నీవు నేవచిం
చిన పలుకుల్ విచారణను జేసి మహాలఘు బుద్ధితోడఁ దోఁ
చిన యటులాడ కీ జగము క్షేమము గోరి నిజంబుఁ గాంచుమీ. 155

క. అననతఁ డానద్వాక్కులు, వినిపాశ్చాత్యజనులవల్ల విన్నపలుకు లిం
కనులేమి నాగతివిడిచి, ఘననీతి దెలిసినరీతి గానిట్లనియెన్. 156

—యుక్తి సంవాదము.—

గీ. మగువ! యిన్ని యేటులుఁగుడువు మగనిమాట
కెదురు చెప్పునె? కులకాంత యింతపలుకు
వాదమాడితి నాతోడ నీదు తెలివి
యెచటనున్నది? యనఁగా నామె యిట్టులనియె.

క. "పతిపావనుఁ డని చెప్పిన, ఖతిమాలి మరల్పవలయుఁ బతి వినకున్నన్
హితమును దా వరిథవుము, మతిలోనన్ సంశయంబు మానితుమారీ."

క. అని పెద్దలు చెప్పినచో, వ్వనలే నేనవు మధుంటి బుద్ధినిఁ జలనం
బును బొందింపక నా వదఁ తమదప్పును బట్టి చెప్పితిగినవి దానన్. 159

సీ. బ్రాహ్మణకృత్యమై తనరఁగు సంధ్యావందనంబును నిత్యమును విడువఁ
గాశ్రైనఁగ నుగవ్, కాఫువాండ్రను ముట్టుకొని వస్త్రంబుతోఁ గూడుగుడువ
నంద్రదిశల్దినము యథావిధిగాఁ జెట్ట శాస్త్రములనర్థము నుపా నుపత
యట్టుకు గత్తిరించుకొని స్వదేశాభిమానులై యుండుట మానినదువ

గీ. వేవిధాలఁదగదనిచె ప్పితినిగాని, యెన్న డైననీతోఁ గల హించితినె ? మ
నస్సునైనవిరోధము నంగలంచి, యుంటినే ? నామదినెఱుంగ కుంటెనాథ. 160
కం. ఇప్పుడైనను లోకంబుల, కపకారముసేయుమాట లాడుకుచేనా
విపరీతము పోనాడితి, నెపుడే దెటులైననాకు నేమిలభించుక్. 161
కం. అననానిపుణోక్తులువిని, తనభార్యచతురతకతిము దంపడియతఁడా
మెనుగాఁగిటిలోఁజేరిచి, ఘనలౌకికయుక్తి మెఱయఁ గానిట్లనియెన్. 162
కం. కలనాయమువీడననీ, కలనాణెఱుసేయనయి, శ్రమ, కలనాదులనాఁ
గలనానుకులోర్వము! మనఁ, గలనా? నిన్నలఁచి; భక్తి గలనాలలనా!. 163
క. అననామెయు నాసచివుని, మనమునఁగలయూహ యెఱిఁగి, మర్యాదదొలం
గనిమార్గంబునఁ మొకుసుచు, ఘనమంజూక్త్యనుగుణంబు గానిట్లనియెన్. 164
కం. పతివనియతిపరిచితిచే, మతిచెడిప్రతివాదమాడి మదిభారముఁజే
సితిసికదియోరుచుకొని, వ్రతమునంజేయంబ్రయత్న పడుమికనాథా. 165

—ఆశ్వాసాంతము.—

వ. అననాతఁడు నీయిష్టప్రకారముగానే చేసెదనని యామెను ముద్దువెట్టుకొని సంతోష పెట్టెను. తరువాత నాదంపతులు తులయందుఁమాఁచిన చందంబున సమానానురాగులై యప్పటప్పటికెందగిన కార్యములు నెఱవేర్చుకొనుచు హాయిగానుండిరి. 166

నిరోష్ఠ్యనిర్బిందుతులాబంధము.

కం. సారసనేత్రా! జలద, శ్రీరాజచ్ఛిత్రగాత్ర! శ్రేష్ఠచరిత్రా!
ధీరజనాసారతగే, యా! రణ్దైతేయచయజయ ; సదయహృదయా. 167

—గద్యము.—

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, మత్యసంతానక్షీరపారావారా
త్రిపుత్రవేంకయ్యార్య ద్వితీయపుత్ర, బాపన్నార్యపౌత్ర, చినసర్వయ్యా
ర్యైకాదశాబ్దపోషితపుత్ర, సీతయ్యార్యస్వీకృతపుత్ర సకలజన
కారుణ్యకటాక్షపాత్ర, సీతారామచంద్ర పరబ్రహ్మార్పిత
సకలకర్మ, సూర్యనారాయణమూర్తి శర్మ ప్రణీ
తంబై, యపూర్వాద్భుత చరిత్రయగు
సకలానందనామక
నవీన ప్రబంధమునందు
ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

సూర్యనారాయణమూర్తీయము.

# సకలానందము.

## తృతీయాశ్వాసము.

కం. శ్రీమహితనయాయియుతగిన, శ్రీమహితనయానేకతెసెవ కించితనంతం
బ్రేమించిన శూర్పణఖను, గామింపని మార్గదర్శకా! శ్రీరామా. 1

వ. దేవా! దివ్యచిత్తంబున నవధరింపుము. అట్లు చెప్పఁగావిని యవ్వలికథ చెప్పుమని
యడిగిన శౌనకాదులకు సూతుఁడిట్లనియె. 2

గీ. అట్టులాదంపతులతిసౌఖ్యంబుగలిగి, పుత్రగోపాలదేవుని పూజఁగూర్చి
దినదినంబును జర్పించు కొనుచునుండి, రంతవర్షర్తువుసమీప మయ్యెనపుడు. 3

—గ్రీష్మాంతవర్ణనము.—

దండకము.

గ్రీష్మనఁబైవేఁడికిందాళఁగాలేక పల్మాఱుతానాలు సేయక్, సదా నీటిలోనాను వస్త్రంబులంగట్ట నాయాసమంబొంది త్రాగంగ నాచల్వ, యుష్ణావకాయంచుఁ బండ్లందు నైశ్న్నిమార్గాల భక్షించు భాస్వద్రసాలంపుఁ గాయల్ ప్రసాదించు నుష్ణంబుచే నేమియుంజేయఁగాలేక బల్ దొంగ చందంబునందాఁగి (A) మేఘంబులాకాశసంచారముంజేయఁగానే యహోరాత్రముల్ గోర్కె వర్ధిల్లఁగాఁ గామమార్గంబునం బోవుటల్ మర్మమార్గంబునంగల్గు శీతంబు (B) జిహ్వాచాపల్యముంబట్టి యాఁగాఁ కరిం బచ్చలిం దోఁటకూరఁ దివక్ నోటిమార్గంబునంబోవు. శీతంబుఁ (C) బిల్లలంబాసి యాహారసంపాదనార్థంబు నానాప్రదేశంబులందెల్ల సంచారముంజేసి యాయాసముం జెంది తాపంబుచే నీటిపై వెండియుంజాల సంచారముంజేయుచాత్మస్థమా స్వద్రసంబాత్మభాస్వత్కరశ్రేణిఁ గారుణ్యచిత్తంబుతోఁ బెట్టు భూశక్తికిన్ సూర్యుఁడత్యంతభక్తింబలిన్ వేఁయుచందంబునం దప్పితాపంబుచేఁ బ్రాణముల్ బాసి యీభూమిపై ప్రాలు వ్యాఘ్రాదులౌ జంతుజేహాలపై జాలి తన్మాంసముల్ ముక్కలందిసి భక్షించుచుం

బ్రీతితోఁ గూయుచుం గంతులన్ వైచు గృధ్రాదిశకుంతులం జాలఁ జిత్రంబుగా మ్రింగి నానావిధస్థానముల్ ద్రొక్కి బల్ కల్మషంబొందు వాయువుల్ సంబంధమా నీటిపై నాలి శక్తిన్ నివారించు చాకాలుగుహ్యాయులున్ లేమిచే రోమకూపంబులన్ శ్రోత్రమార్గంబునం బోవు శీతంబు (D) గ్రొత్త కాలంబుగానం బనిం బట్టి ఛత్రంబులుం జెప్పులున్ లేకయే వానలో రొంపిలో సంచరింపన్ శిరఃపాద మార్గంబులన్ మెల్లగా నెక్కు శీతంబు (E) దేశాధికారుల్ ప్రజాసౌఖ్యముం జేయఁగా మంచి చట్టంబులం జేసి యెంతేని విత్తంబు నేర్పాటు చేయించినన్ లంచముల్ బట్టు దుర్బుద్ధి నేవేవిధా నేరముల్ బన్నుచుం బన్నులం బెంచుచుం బీదలన్ సాదలం జాల బాధించుచున్ మోసముల్ దువ్వుచున్ మంచి పెద్దల్ స్వదేశాభిమానంబు నొక్కింతయున్ లేని యాయానియన్ వారి యశ్రద్ధచే వ్యాధులం గ్రుళ్ళియున్నట్టి బల్ తుక్కునం బుట్టు దుర్వాయువుల్ ముక్కు దూరిన్ సహాయంబు సేయన్ శిరం బెత్తి నల్దిక్కులుం జూచుచున్ శ్లేష్మవాతాదిధాతుప్రకోపంబు గావించి గర్భాగ్నినిం జుట్టి మంచాలపైఁ ద్రోయుటన్ (౪) వేఁడికిం జంకుచుం బుట్టనేయుండి పైనుండు వృక్షంబులూఁగన్ ధ్వనిం బట్టి యేతెంచి యావేడి గాడ్పాఁకటం బీల్చి నీగుజ్జుపుం దాత్రిళ్ళమా మమ్మనీ వేఁడికిం బాలు సేయంగ ధర్మంబుగాదింక రక్షింపవేయుంచు నానూర్ప్య ధ్యానించుచున్నట్లుగాఁ గన్నులన్ మూయుచున్ వ్రాలి సూర్యస్వరూపంబు చేకొన్న చందంబునం గొన్ని ప్రాణంబులం బాయ శేషంబులై యొప్పుచుందమ్ము భక్షింపఁగాఁ జూచు నాపక్షిజాతానకింతేనియుం జంకకస్తైనియుం జావఁగాఁ దప్పదం జెంచుచున్ మెల్లఁగా గడ్డిచేఁ బచ్చనా దొడ్లలోఁ జేరి తాపంబు దీరంగఁ బొర్లాడుచుం జిన్న వౌపుర్వులందించు సంతోషముం బొందుచున్నట్టి యాపాములం ద్రొక్కియుం బాదులంగల్లు చీఁకట్లచేఁ ద్రొండ ఖండించెరా పొట్లకాయంచుఁ బైకెత్తి ( ) యాకొట్లచే నింక నెన్నెని మార్గంబులన్ నైజకర్మానుసారంబుగా (1) మానవుల్ పుర్వ లేపొంది భక్షింప (2) వృక్షంబులున్ రోగజాతంబుచే (3) జంతుపక్ష్యాదులున్ మృత్యుబాధంగనం బూరుషశ్రేష్ఠుఁడా తాను తద్దుర్దినంబుల్ గనన్ లేకయో, శుక్రవారంబునన్ సోమవారంబునన్ స్త్రీలపూజల్ గ్రహింపంగ శ్రీలక్ష్మి పోవంగఁ గృష్ణాష్టమిం బాపనాశంబు మోక్షంబు నొందంగఁ గన్యాఖ్యమాసంబునన్ హవ్యకవ్యాదినం రేతుణార్థంబు భక్తుల్ నుతుల్ పూజలం జేయ, నారాయణత్వంబు నొల్లొందఁగా నీటిలో నిల్చి సర్వౌషధుల్ మార్చి వృక్షాదులన్ వృక్షిసేయంగ, దేహంబుమాత్రింబు

వైకుంఠమందుండి పూర్ణప్రభావంబుతో వచ్చి భూలోక వాసంబు సేయంగనో పాలసం
ద్రంబులో శేషశయ్యాస్థలిన్ భాస్వదంభోజనేత్రుండు కన్మూసెఁ గాఁబట్టియే సూర్య
చంద్రుల్ ఘనచ్ఛన్నులై రబ్జముల్ హీనకాంతింగనెన్. 4

—వర్షర్తు వర్ణనము—

గీ. అంత వర్షర్తువును వచ్చె నప్పుడు పుణ్య, పాపములను బట్టి యొకచో బాగుగ నొక
చోట నోగుగా వర్షముల్ చుఱుకుమంద, మునుఁగలిగి కురియుటకును మొదలుపెట్టె

—రైతుల విచారము.—

గీ. అపుడు పాపరాజు ప్రభు మాన్యములు దున్న
వారిఁ బిల్చి యింటికొక రూపాయ మాకు
నిం డొకవ్రతంబు సేయుట కెంచియుంటి
మనఁగ వారిట్లు చింతించి రాత్మలందు. 6

చం. గడచిన యేటి పన్నిఁక సగంబుది నాణము వారికీపలెఁ;
గుడువఁగ, విత్తనాలకును, గూలికి, దాఁచిన యన్ని ధాన్యమి
ప్పుడె సరిపోయె; నప్పుచటఁ బుట్టక యుండె; భరించుచుంటిమి
ట్లిడుమలు; వీనిలంచముల కెక్కుడఁ దేఁగలమయ్యొ దేవుఁడా. 7

గీ. కాలవశముచేఁ జేలు సగం బపండ, చుండెఁ; బండిన దానిలో నొక్క పాలు
వీనిదే; తెచ్చుజీతము వేయి; యేమి, సేయునది? యిట్లు మనల హింసించువీఁడు. 8

గీ. వచ్చు లాభమంతయు వీని పాలఁ బోసి, యప్పుపాలై బ్రతుకుచుంటి మనుచు వగచి
యీయకున్న దుష్టుండని యెట్లొ తెచ్చి, యిచ్చిరాఱువందలరూక లేడ్చుచును. 9

గీ. వానిఁ జేకొని యాతండు భార్య చెప్పి, నట్లు గోపాలపూజకు సర్వములను
వస్తువులు ప్రోగుచేసెను భక్తునివలె, నంత శరదృతువును వచ్చె నట్టివేళ. 10

—శరదృతువర్ణనము.—

సీ. కాయంగ సిద్ధంబు గాఁ బెరిఁగిన వరి పైరులను వఱద పాలు చేసి
పంటముఖమునకు వచ్చియుండిన కొన్ని మెట్టసస్యములను మట్టిఁ గలిపి
కూలినాలియుఁ జేసి కొని జీవనము సేయు వాండ్రను మిక్కిలి బాధపెట్టి
పరమసాధువులైన పశుసమూహములను గట్టురాటలయందుఁ గట్టివైచి
గీ. తనకు నీదరగాలి విస్తారముగను
హేయమును జేయ నతివృష్టి యధికమైయె

సంగో ; బాహాత్ములువసించు స్థలములందుఁ
గాలధర్మంబులుసరిగాఁ గలిగియున్నె ?. 11

వ. అట్టియాశ్వయుజంబున ఘనవైద్యులదగ్గఱ మందులు పూటుటకుం గుదిరి కొంతభే షజము సంపాదించి భావరోగియైనను నప్పయొద్దఁ గానుక నిర్ణయించుకొను స్వభావము గలిగి రోగి చేయిపట్టుకొని పెండేలనంకఁ జూచుచు "నింతకుముందిట్లెందు బచ్చలికూర దినెనా ? తోటకూరదినెనా ?" యని యడుగు ప్రతి నరునియందు నాశ్వినేయత్వము నిలిచియున్నట్లు జనులు దలంచుచుండిరింతఁ దన్మాసాంతముగా వచ్చుటయును. 12

గీ. వానచేఁగలిగినవిష వాయువులుహరించిపోవ, జనములుహర్షించిగంధ.
కముసురేకారమురగిల్చి యమితదీప, ములనుబెట్టుచుండిగఖిల భూతలముల. 13

వ. అంతఁ గార్తికమాసము వచ్చుటయును నఖిలజనులు నమితసంతోషాయత్తచిత్తులై యంతర్బాహ్యపారిశుద్ధ్యముగలిగియుండుటే నరకవిముక్తియని నిశ్చయించి మనస్సును భగవదధీనమును ధనమును బ్రాహ్మణాదిభూతసంతర్పణ వినియోగమును జేయుచు నక్తవ్రతకార్తిక దామోదర పూజాదులను జేయుచు నంతకుముందు సూర్యుఁడు మందప్రకాశుండగుటవల్ల వర్షాతివర్షములచే నాకాశమందును దిక్కులయందును బుట్టియున్న జడత్వము పోయి వాయువు పరిశుద్ధమగుటకును, గడచిన వానలచేతను నప్పుడంకురించుచున్న చలిచేతను గలుగఁబోవు సంధికాలదోషము పోయి యారోగ్యము లభించుటకును, నాకాశదీపములును, నావునేతిదీపములును గుగ్గిలపుఁబొడిచేతఁ బ్రకాశించునట్లు మైనపువత్తులను వెలిఁగించుచుండిరి. 14

గీ. ఘనతరాయువుశక్తియుఁ గలిగివిబుధ, లోకములకగ్రభాగగుఁ ...కుమారుఁ
గన్న శరకాంతయామోద కరములయివి, నిర్మలములైతగురుచుల నెగడెనపుడు.

క. చనెదుర్దినంబులు, జగం, బును దేటొందె, నిఁకనిద్ర పోననిహరితా
గముఁదెలిపెననఁగభాస్వ, ద్వనజవనజకాంతులొప్పె స్వచ్ఛతమెఱయన్. 16

ఉ. అప్పటిపండువెన్నెలలు నచ్ఛజలంబులుఁ జూచిస్త్రీలయం
దెప్పుడురక్తులౌ జనులు హెచ్చుగఁదాపము నొందిరాహరిం
దప్పక కొల్చువారలు ముదంబునుభక్తియు వృద్ధినొందఁగాఁ
జెప్పనశక్యమౌసుఖముఁ జెందిరి వింటిరె ! వస్తుతత్వమున్. 17

గీ. చలియు నుక్కయు నెండ వానలుఁ దలఁచఁగ
లేని సమకాలమగుటచే మానసముల
నధికసంతోషమును బొంది రఖిల జనులుఁ
గన శరత్కాలమునఁ గార్తికం బెసుంగు. 18

గీ. అన్నియును మేలగువస్త్రముం దెచ్చుండెఁ
గాని చేలుమాత్రంబు దొంగలకు మిగుల
తలకువశములై యతిహీన దశకువచ్చె
నెంత పాపాత్ములో ? యచటి యెల్లజనులు. 19

—పుత్రగోపాలవ్రతమహోత్సవము.—

గీ, అట్టికార్తికమాసమునందుఁ బావ, రాజు పుత్రగోపాలుని పూజతన పు
రోహితు వసుమతి నెఱవేర్చుటకు మొదలు, పెట్టియూరివారలఁ బిలిపించె నపుడు. 20

ఉ. పిల్లికినైన బిచ్చమును బెట్టని లుబ్ధుఁడు భార్యపోరుచేఁ
బిల్లలకై వ్రతంబొకటి వేడుకగా నొనరించుచుఁ జనం
బెల్లరకు న్ధనాదికము నిచ్చును దండుకొంచు వచ్చి తా
మెల్లెడ గౌరవంబుగొని యిండ్లకుఁ బోయిరి తత్పురప్రజల్. 21

—హేమంతర్తువర్ణనము.—

కం. అంతేయథావిధిగా వ్రత, మంతయు సాంతంబుగాఁగ నతికాంతము హే
మంతము జృంభితశరరతి, కాంతముక్కాంతపరిరంభ కాంతమువచ్చెన్. 22

కం. మృగశీర్షాధీనుండై, మృగచిహ్నుఁడు పరమహిమము మెఱయించుచు బల్
పగవాఁడయ్యె విడిన యా, ల్మగలకు నామార్గశీర్షమాసమునందున్. 23

గీ. మంచువైరి సూర్యుఁడె దాని మహిమకోడి
బాడబాగ్ని యొద్దకు వేగఁ బాఱుచుండె
నిఁక మనుష్యులు కుంపట్ల నెపుడు మెడకుఁ
గట్టుకొనియుండిరని చెప్పఁ గావలయునె. 24

గీ. ఎవరికెట్లున్న నాచలి యెల్లపుడును, శీఁటపైఁ బెట్టి పిల్లిపైఁ బెట్టితిట్టు
లాడుకోడలు కొఱవుల కర్తగారు, బొమ్మలకుసాయమాయె సంపూర్ణముగను.

గీ. లౌకికులఁ జూచి నిందించి లోకకుండ, శుద్ధవైదికశ్రేష్ఠులు చుట్టకుదుటిఁ
బోలుపాగాలు ప్రాతచొక్కాలు దాల్చి, పరమహాస్వరసముగాఁ బాత్రులైరి. 26

ఆ. యామురాత్రియుండ స్నానమాడు ద్విజులు, తనకరములబాధఁ గనుటనుద్విజ
రాజు పరమపాపరాజయ్యెఁ బాపరా, జయ్యెడను మహామదాత్ముఁడగుచు. 27

—పాపరాజుభార్యంగూర్చుట.—

కం. అతులసువృత్తులసుమతుల, సుతులను గనుకోరికల సుమతినిభార్యన్
రతులను దేలిచెనిస్తుల, గతుల ; ద్యుతులతతులనుతులఁగను సౌధమునన్. 28

—సుమతి గర్భముదాల్చుట.—

గీ. అంతనామె శ్రీకృష్ణపూజాతిమహిమ, వలన గర్భముదాలిచెఁ; దెసిలికొన్నిత్రి
కరణశుద్ధిగాఁజేసిన కార్యముమరి, తంబునడఁచిసద్యఃఫలితంబుగాదె ? 29

గీ. పాపరాజాంశమున నుద్భవమయినట్టి, పిండమామె మన్నును దినిపించి తిన్న
యన్నమెల్లఁ గక్కించి యాయాసపెట్టెఁ, బిల్లయైయెట్టిబాధలు పెట్టునొక్కొ !

—సూడిదెలు.—

గీ. మనసుమతి గర్భముధరించె ననుచుఁజూడ, వచ్చి యిష్టబంధుజనంబు లిచ్చినట్టి
మినుపసున్ని మున్నగునవి మేటులయ్యెఁ, గలిగియున్న వారికిఁ గానుకలకులోటె ?

మ. బలవంశస్థిరహృత్సుఖప్రసవ సంపన్మూల సోమంబులన్
నిలుపంగర్భిణికొప్పుగా మినుపసున్నిం బెట్టుటాచారమై
వెలయందాని నెఱుంగకిష్టులిడినన్ వేరొపదార్థంబుచా
పలముంబూనిభుజింపదామె సుమతీప్రావీణ్యముంజూడుఁడీ ! 32

—సుమతీసంతానప్రాప్తి.—

క. తొమ్మిదినెలలును నిండఁగ, నెమ్మదియగురీతిసుమతి నిరుపమసౌంద
ర్యమ్మునఁదగునొక సుతుఁగనె, నమ్మంత్రియు జరుగఁదగిన యప్పటిపనులన్. 33

క. ఒనరిచి సుతునకునందఱు, వినుచుండ "మహామతి" యని పేరును బెట్టెన్
బనులఁబడిదాదికీయక, పెనుమక్కువ సుమతిదానె పెంచుచునుండెన్. 34

వ. ఇట్లుండఁగాఁ గాలక్రమంబున నింకొక్కకుమారుఁడును గూఁతును బుట్టఁగా వా
రికిఁ గ్రమంబున "మన్మథుఁడనియు, మోహినియనియుం" బేరులుపెట్టి పెంచుచుం
డి రిట్లు వారికైదాదిండ్ల ప్రియంబువచ్చుటయును. 35

—పాపరాజసంతానలాలనక్రమము.—

సీ. ముచ్చటదీరఁగా వచ్చి తనతొడపైఁ గూర్చుండియావియివి కోరువేళ
బంధుజనంబులు వచ్చిచూచిముదంబునంది యెత్తుకొని ముద్దాడువేళ

సరియీడుగల హీన జాతులపిల్లలఁ గూడివేడుకతోడ నాడువేళ
రాజసభకుఁబోయి రణగుణధ్వనిచేయు, చచటివారినిఁజూచు నట్టివేళఁ
గీ. దనకుమారులుప్రలేఁకుడు తప్పులెల్ల, ముద్దుమాటలనిముదంబుఁ బొందుఁగాని
ముద్దుమాటలనియొకింత దిద్దడాఁతఁ, డాశిశువులకు సద్వృత్తి యబ్బుటెట్లు? 36
గీ. ఏమియుపయోగమని నిశ్చయించినాఁడొ, కోడిజుట్టుపిడేల్వంపు గొప్పసిగలొచ్చు
పాపిడిమొదలగురకాలఁ బరఁగుజుట్టు, బాలకులకునుంపించునా పాపరాజు. 37
కం. ఈచిన్నితనంబున స్త్రీ, స్త్రీచిహ్నంబులను దాల్పఁ జెల్లదనియతం
డాచిన్నికొమారునైన మే, లౌచూడాకార్యులు మొదలగునవి వొడిగించుట్. 38
వ. ఇట్లుజరుగుచుండఁగా నొకనాఁడు సుమతి పాపరాజుంజూచి యిట్లనియె. సన్మా
ర్గహానికరములైన యీ చెప్పరానివేషములు పిల్లలకుండఁగూడదు. పెద్దవారైనను నీ
యలవాటు దగ్గదు మంచివేదోక్తవేషము వేయింపుమన నతండిట్లనియె. 39

—వైదికవేషనిరసనము.—

సీ. వంకాయతొడిమిక వలెనుండు జుట్టును, జలిమిడిముద్ద యట్లలరుతలయు
గడ్డము మీసాలు గలుగని మూతియు, బూడిదమెత్తిన పాడుమొగము
మేకపేగులవలె మెఱయు జందెంబులు, మడతఁబెట్టినబట్ట నడరుబుజము
నాల్గుకొంగులును గనఁబడకుండెడి కట్టు, నట్టిభూషలు లేని యట్టిమేను
గీ. గలిగి జగమెల్లనంటుదిగాఁ దలఁచుచు, నైకమత్యము చెడఁదీయు నట్టిపూర్వ
కాలవైదికవేషము గౌరవించు, వారెవరును లేరిప్పుడు నీరజాక్షి. 40
గీ. కనుకఁ గాలానుసారము గానడుచుట, మంచిదగనుండు నిప్పటి మనుజులందు
మూఁడుపాళ్ళిట్టివేషమే పూనుచుండి: రీవులోకమునుజూచిన నెన్నంచుమపుడు.

—వైదికవేషప్రాశస్త్యము—

వ. అననాసుమతియిట్లనియె. తాను బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడనను పవిత్రత్వమును వెల్ల
డించునదియు, స్త్రీలకు రుచింపనిదగుటవలన జ్ఞానభంగకరుఁడైన మన్మథునకు
దూరమైనదియునైన వైదికవేషమును జ్ఞానులైన బుద్ధిమంతులు నిందింపరు.
సొగసుకొఱకు లేనిపోని పిచ్చివేషములువేయుట జారులలక్షణము. నీవన్న
యిప్పటిజనులు జ్ఞానమనసెట్టిదో యెఱుంగక, తమ్ముఁజూచి పరజలు మెచ్చవ
లెను, స్త్రీలు మోహింపవలెననుకొని తిరుగు కామమే మోక్షమనుకొను మూ

యాజీవనులు, పసపుమాని కనుభామలలో బొట్టుంచు స్త్రీలు నీభాగములోని వారే. అదియట్లుండఁ దురకలు మొదలైనవారెప్పుడును స్వదేశభాషలను విడువరు. కనుక నట్టివారినైనను జూచి స్వశబ్దాభిమానముంచి పిల్లలను సరిగా నడిపించు మనవశంబు తరమీయక సంతానమును జెడుమార్గముల లాలించి యానందించుచు వారివారి పైదవరయోండ్లలో వారిని రాజకీయపాఠశాలలఁ జదువవైచెను. వారును దేశదేశాధిపతిభాషలందును, సంగీతసాహిత్యములందును వృద్ధినొందుచుండి రిట్లుండ నొక్కనాఁడు సుమతి పాపరాజున కిట్లనియె. 42

క. తనయకుఁబదియేఁడులు మిం, చినవిప్రుడిఁక మనము పెండ్లిసేయఁగవలెనం
చనఁగా నాసద్వాక్యములు, వినియాసౌఖ్యకరధర్మ విముఖుండనియెన్. 43

—అతిబాల్యవివాహనిషేధము.—

క. రమణీ! విస్తారాగ, మములుగలుగఁ జేసి హీనదశనిచ్చుటచే
రమణులకతి బాల్యవివా, హములే నిషేధించిరిప్పు డందఱుపెద్దల్. 44

గీ. ముక్కుపసిదైననాఁటి ముద్దుకూఁతు, పెండ్లిసేసి దైవగతిచే విధవయయ్యె
నేని దానినిఁజూచుచు నెంతోదుఃఖ, పడుచుఁదలిదండ్రులుండఁగావలెనుగాదె.

గీ. అదియుఁగాక ది పెద్దదిదైనయపుడు, మగఁడు గుణధనహీనుఁడై మసలెనేని
దానివల్లజన్మించెడు తప్పువార్త, ఫలముసర్వము తల్లిదండ్రులదెగాదె?

గీ. పుస్తిగట్టినమఱునాఁడు మొదలుచేసి, పిచ్చినోములుపట్టించి విద్యనంట
నీకయింట్లుతోమించుచు నికొమాతెఱ, హీనపఱుపంగ నీకిష్ట మౌనెభార్య. 47

వ. అననాసుమతి యిట్లనియె. 48

—స్త్రీబాల్యవివాహప్రాశస్త్యము.—

క. స్త్రీలురజస్వలలయ్యెడు, కాలముదాఁక నెటువంటి కాఁపురమునులే
దీలోపున నభివృద్ధికిఁ, జాలదె? పిదపఁబతికడకుఁ జనవలెనుగదా. 49

గీ. స్త్రీకి వైధవ్యమెవఁడైనఁ దీసివేయఁ
గలఁడె? యిఁకనట్టి నష్టవాక్యములుపలుక
వచ్చునే? నవాచారాతిబలులకిద్ది
సహజగుణముగాఁబోలును మహితలమున. 50

గీ. పతిసహాయపు భాగ్యముఁ బడయుటకును
దైవముగ వానిఁ గనుటకుఁ దగిననోము
నెఱుఁగనినరులు నిందింతు; రిట్టినీతి
సాధకంబు దుర్వ్యాప్తికి బాధకంబు. 51

క. చిన్నతనంబున వ్రతముఖ, సన్నుతగతులొందకున్న సతినే చదువుం
దిన్నఁగఁ ద్రిప్పదు గావున, నెన్నఁడు మసతి విద్యయర్థమే పూనవలెన్. 52

గీ. పతియె దైవమని వచించు వ్రతము పట్టు
స్త్రీయతఁ డెటుల నున్నను జెడ్డదారి
ద్రోకుఁ నే? యావ్రతము దారి ద్రోకనట్టి
స్త్రీయె దేనికైనను సాహసించుఁ గాని. 53

వ. అబలా పుష్పకోమల్యాది నామములకుం దగి గృహిణీశబ్దవాచ్యలైనందున గృహపశు శిశుసంరక్షణాది కార్యములచే స్త్రీలు వ్యవహరింపవలయుననుటే భగవదుద్దేశ్యమైనట్లు కనఁబడుచున్నది, గాని కృషివాణిజ్యాదులు చేసి కొంపలను నట్టేటఁ గలుపవలయునను నట్లు తోఁచుటలేదు. కనుక నట్టి యుచిత కార్యములం దెల్పు నారోగ్యనీతిశాస్త్రాదులగు నియమితవిద్యలే గ్రహించి చిన్నప్పటినుండియు నట్టి పనులు సాధకము చేయుచుండుట స్త్రీలకుచితము. అట్టి విద్యలు 16 యేండ్లలోపున నంజడి వినంజాలును. ఆపైని భర్తయొద్ద నెన్నియైనం గ్రహింపవచ్చును. పతిభక్త్యాద్యుత్తమ నీతిమార్గసాధకము బాల్యవివాహమువలనం గల్గును. మఱియుంగానీ నాదిదుస్సంతతి కలుగుటకు దీనవవకాశము లేదు, అజ్ఞానపూర్ణమైన యతిబాల్య వివాహము మంచిదిగాదు. "దశవర్షా భవేత్కన్యా" యను నట్టి బాల్యవివాహము స్త్రీలకు మిక్కిలి శ్రేయోదాయకము. పురుషులకీ బాల్యవివాహములు హానిం గలుగఁజేయును. చక్కఁగా విమర్శింపక మన నవనాగరాతిబలులు కాలికిఁ బెట్టుకడియము కంఠమునకుఁ దగుల్చుచుందురు. అది యెట్లంటేని వినుము. 54

—పురుషధర్మప్రకారము.—

క. చదువుటకయిదవయేఁటను, మొదలిడి రెనిమిదవయేఁటి వెంటకా పదునై
చదువఁగవలెగురునొద్దం, బదునెనిమిదియేండ్లదాఁక బ్రహ్మవ్రతుఁడై. 55

క. కనుక నెనిమిదేఁడుల క, న్యలఁ బెండ్లాడి యతిపెద్ద దయ్యెడివారిక్
ఘనగృహిగ నిష్ఠఁ బాఁజది, విన విద్యార్థులు సుమకడ వినఁగావలయున్.

క. ఇట్టులు బాలికయేఁడులు, గట్టిగ గడపి వరనియుక్త కాలరతుండై
బొట్టెలఁగని గార్హస్థ్యము, బిట్టు యుతమువచ్చునట్లు వెడలింపవలెన్. 57

గీ. ఇట్లుగడపి యాఱేఁబది యేండ్లవెనుక
సుతుల కధికారమిడి కాననుఁ జొచ్చి నిష్ఠ
నింద్రియమ్ములను జయించి యీశ్వరునియు
పాసనము సేయవలెను సుభక్తి మెఱయు. 58

ఉ. అర్వదియేండ్లిటుల్ చనఁగ నూతటవల్కలదండధారియై
సర్వజగంబు బ్రహ్మమని సంతతముక్ మదిలోనఁగాంచు చీ
యుర్విఁవసించు మానవుల కొప్పుగ బ్రహ్మము బోధసేయుచుం
గర్వముదాదిసంగతుఁడు గాకటులాయువుఁ బుచ్చఁగావలెన్. 59

వ. ఈకలియుగమానవు లల్పాయుర్బుద్ధిబలంబులుగలవారు గాన దుష్కరనియమంబులుగల వానప్రస్థసన్యాసాశ్రమంబులు వీరికసాధ్యములు. కానగృహస్థాశ్రమమందుండియే హరిస్మరణపూజాదులు సేయుచుండవలెనని మహర్షులు నియమించిరి. సృష్టికాలము మొదలు నేఁటివఱకును సూర్యచంద్రాదిమండలములు మహర్షులు వ్రాసినశాస్త్రముల ప్రకారము గ్రహణాదుల నొందుచున్నవి. ఆయుర్వేదాదులట్లే యున్నవి, గాన మానవులకు నీమహర్షిధర్మంబులు యుగముపొడుగునను శ్రేయోదాయకంబులగుచుండును, గాని మనుష్యకృత్యంబులవలెనూఱుటయును నశించుటయును నెన్నటికిని గలిగియుండవు.

—పురుషబాల్యవివాహనిషేధము.—

గీ. అట్టిముప్పదియేండ్లలో నతివపొత్తుఁ, గలిగినయెడ విద్యయుబుద్ధి బలముఁజెడును
గాన బాల్యవివాహముల్ మానవలెను, బురుషులు స్త్రీలకవి మేలెపొసఁగఁజేయు

వ. అనన తండ్రిట్లనియె. రమణీ! కొమార్తెకు వివాహము సేయుటయందుఁ దల్లి దండ్రులకు మిక్కిలి చిక్కులుగలవు. ఎట్టివనిన వినుము. 62

—వివాహనీతినిరసనము.—

ఆ. "వారిజాక్షులందు వైవాహికములందుఁ, బ్రాణవిత్తమాన భంగములను
చకితగోకులాగ్రజన్మరక్షణములఁ, బొంకవచ్చునఘము పొందదధిప," 63

గీ. ఇట్టిదుష్టసిద్ధాంతము లెన్నొ కూర్చి, స్త్రీలకొంపదీసిన పూర్వకాలధర్మ
శాస్త్రకర్తలపద్ధతుల్ జరుపుటకుర, వంతయైననిష్టము లేదు కాంత! నాకు.

గీ. మారిపుల్లయ్య గారిపుత్రునకు మాకు, మారిసీయఁదలఁచితిమి వారిస్థితియు
గతియు నెట్టివనినవారు కలతెలుఁగు, చెప్పరుగదా? యదినతుల చేటుగాదె.

—స్వయంవరప్రాశస్త్యము.—

వ. కావునదమయంతీ సీతాప్రముఖ పూర్వకాలస్త్రీలకువలె వయస్సు వచ్చినత
రువాత స్వయంవర వివాహములు సేయుటే స్త్రీలకుత్తమ మార్గమని నాసు
మతి యిట్లనియె. 66

గీ. పూర్వులను వెక్కిరింపఁగఁబోదుగాని, యెట్లు వెక్కిరింపవలెనో యెఱుఁగవీవు
మనసుకసిదీరఁదిట్టిన మాత్రముననె, వసుగుణవేదులానంద పడరునాథ. 67

వ. పూర్వకాల వివాహనీతినీకు మంచిదిగాను గాని పూర్వకాల స్వయంవరములు
మంచివని తోఁచినదా. కన్న తల్లిదండ్రులకుఁ బెండ్లిసేయుట యొకకష్ట
మా? మూర్ఖనకు, దరిద్రునకును గట్టిపెట్టుమని యేశాస్త్రమునందును జెప్పి
యుండలేదు. 68

—వరాన్వేషణక్రమము.—

క. ధనమును విద్యయు వంశం, బును రూపము దానశీల మును గలవరునిం
గనుఁగొని కన్నియనీవలె, నని శాస్త్రములందు లేదె? యరయుము బుద్ధిన్. 69

గీ. అదియుఁగాక నపుంసకత్వాదులును బ, రీక్ష సేయుమనిరి మునిశ్రేష్ఠులింక
వారిజాక్షులందుననిన పరమనీతి, యర్థమును జెప్పెద సుబుద్ధి నాలకింపు. 70

—గృహస్థాశ్రమగుణము—

సీ. "కెలఁకులనున్న తంగేటిజున్ను గృహమేధి, యజమానుఁడంకస్థితార్థపేటి,
పండినపెరటికల్పకము వాస్తవ్యుండు, దొడ్డిఁబెట్టిన వేల్పుగిడ్డి కాఁపు,
కడలేనియమృతంపునడబావి సంసారి, సవిధమేరునగంబు భవనభర్త,
మరుదేశపదమధ్యమప్రపకులపతి యాఁకటికొదవు సస్యము కుటుంబి,

గీ. బధిరపంగ్వంధభిక్షుక బ్రహ్మచారి, జటిపరివ్రాజకాతిథి క్షపణకావ
ధూతకాపాలికాద్యనాథులకుఁ గాన, భూసురోత్తమ! గార్హస్థ్యమునకు సరిరా.

— వివాహఫలము —

గీ. అనినుతింపఁబడిన గృహస్థాశ్రమమును,
గల్పనయొనర్పుటయు, నింకఁగలుగఁబోవు
వారలేరీతిలోకోపకారులగుదు
రో! యనుటయను బెండిలియురుఫలములు. 72

గీ. అట్లుగానఁ బెండిలియగు నపుడువచ్చు
నర్థములనాఁపుమని రార్యులదియటుండ
నాదనివరుని వృత్తాంతమరయకుండఁ
బిల్లనిత్తుమని వచింప నొల్లరెవరు. 73

గీ. అదియటుండఁ బెండ్లికిఁ బూర్వమందుజరుగు
పనులు వైవాహికములని పలుకుటెట్లు?
లిట్టియుత్తమార్థంబు గ్రహింపలేక
తోఁచినటులుకల్పించి దూఱెదగునె? 74

— ప్రస్తుతస్త్రీలకు స్వయంవరములుకూడవనుట —

క. దమయంతీముఖపూర్వపు, రమణులుశాస్త్రములునమ్మి వ్రతమతిస్వాతం
త్ర్యమునువహింపక సన్మా, ర్గముగనుటస్వయంపరము సుగతివారికిడెఁ. 75

వ. వారు చదువుకొనుటకు బడికైననుబోయి నల్లెకఁడను గానరాదు. లోకాప వాదకు జంకక బోగమువేషములువేసి గుజ్జుపుబండ్లెక్కి యిష్టస్థలములకేగు నంతటి స్వాతంత్ర్యమును వహించి యర్ధశరీరమని శ్రీరంగనీతులు చెప్పుచుఁ దమ మగలనుగాలిబంటులవలెఁ జూచుచు, శాస్త్రాదరము లేక తిరుగు నిప్పటి స్త్రీలకు స్వయంవరము లధికపాపగతికి హేతువులగుసు. అందఱును సౌంద ర్యవంతులనే వరింపఁ గోరుదురు గావున రూపములేని పురుషులు వివాహములు లేనివారు గావలసివచ్చును. ఈస్వాతంత్ర్య ప్రాబల్యముమీఁద సౌందర్యవం తుఁడు స్వకులములో లేనియెడల నట్టిచండాలుని వరింపసాహసింతురు. తా మిష్టముతో వరించిరి గనుక నిష్టములేనప్పుడు విడియాకులు పుచ్చుకొందురు. పూర్వకాలమందైనను గొన్నిహేతువులచే సీత మొదలైన కొంతమందికేస్వ యంవరములు జరిగినట్లున్నదిగాని యది స్త్రీధర్మమై నల్లెకఁడను గనఁబడ

డు. బ్రాహ్మణుల కడియుంగన్నవాఁడు. ఒక్క దేవయానకైనను హేతువు లేకపో
లేదు. అని యిట్లింతయుక్తియుక్తముగాఁ జెప్పినను గలిపురుషుండు నెత్తి
కెక్కి తొక్కుచుండుటచేఁ బాపరాజాసుమతివాక్యంబులు చెవినిఁబెట్టక యి
ప్పుడు పిల్లదాని వివాహమునుగూర్చి మాట్లాడవలదని దివాణమునకుఁ బోయె
ను. అట్లాబాలికా బాలురు విద్యాభ్యాసము సేయుచుండిరట్లుండఁగా నొ
కనాఁడు. 76

—సుమతికథ—

కం. ఆపురినుండు సుమతియను
కాపాఁకఁ డాబాలసొగసు గనిమన్మథ స్థం
తాపుండై తత్స్నేహ
వ్యాపారేచ్ఛనిటుపలికె నాబాలికతోన్ 77

గీ. బడికినీవు పోవునపుడు వచ్చునపుడుఁ, బ్రతిదినమునుమాయింటికి వచ్చిపోవు
చుండు మేను నీపాఠములొప్పగించు, కొందునీవిద్య యభివృద్ధినొందుఁబిల్ల.

కం. అనవిని యాబాలిక చదు, వునుగోరినదాటనెట్టి పున్నెముఁబాపం
బును దెలియకవచ్చెదనని, యనుదినమును వానియింటి కరుగుచునుండెన్. 79

—సుమతి మోహినికి దుర్బోధ సేయుట—

చ. ఇటులొకకొన్నినాళ్ళు చననెంతయు స్నేహము హెచ్చువారికం
తటనతఁడావధూమణికిఁ దండ్రిస్వయంవరరీతిఁ బెండ్లిసే
యుటయొక మిత్రువల్లవిని యొక్కదినంబున బాలఁజూచినన్
బటుమతిఁ బెండ్లియాడుమని బాగుగబోధయొనర్చె దుర్మతిన్. 80

వ. ఆబాలయు నంతకుముందె వాని శరీరస్పర్శనాది సుఖంబులచేత వాని
యందువిశేష స్నేహము గలదైయుండుట చేత నీకంటె మిత్రులెవరు? ని
న్నే వరించెదనని గట్టిబాసచేసెను. అప్పటికాబాలికకుఁ బండ్రెండవయేఁడు
నగంబుగడచె, నంతనొకనాఁడు సుమతి పాపరాజుంజూచి యిట్లనియె. 81

—స్త్రీలను బడికిఁబంపరాదనుట—

కం. మనయమ్మాయికిపుడు యౌ, వనముదయించెనిఁక బడికిఁ బంపకుఁడేనిం
టనెచెప్పెదనవ బడిజది, వినమేలెక్కువరి యతఁడు వినుఁగుచుఁబలెక్కెన్.

గీ. అట్లువలకుఁగ వినియామె యతని కేమి, దురాగ్రహము వచ్చునో యని యాత్మ నేది
యెట్లుగా వలెనో యట్టులే యగు నని, యూరకుండె వెనుక నాతఁ డొక్క నాఁడు 83

—మోహినీస్వయంవర విధానము—

మ. తన కూఁతుం దొడమీఁద నుంచుకొని చేతన్ ముంగురుల్ దువ్వుచున్
మనసుప్పొంగఁగ ముద్దుపెట్టుకొని యమ్మాయీ! వివాహంబు నీ
కొనరం జేసెద నిప్పుడాడుదువె! నా నాయ్యార మొప్పార నా
ఘన బాలామణి యిప్పుడేమియు నెఱుంగన్నే ను నాన్నా! యనెన్ 84

మ. అంతం దత్సచివుండొకానొకరు విద్యావంతు, సద్రూపు, ధీ
మంతుం దోడ్కొనివచ్చి "యీవరుని భీమారావుఁ బెండ్లాడుదే
యెంతో యిష్టము వీనికిన్ వన" నన న్హేలాగతిన్ నవ్వి యా
కాంతారత్నము "పేరిమనాకితనిపై గవ్వంతయున్ లే" దనెన్. 85

గీ. అట్లనుట కెంతొ చింతించి యతఁడు మఱియుఁ
జెక్కు మందినటులనె చూపించె యట్లె
యుత్తరముఁ బొంది విసిగి నీయాహ రేది
యనియడుగఁ దక్కు బాలిక యనిరొనిట్లు. 86

గీ. నాకుఁ గాఁపువారి సుమతి నచ్చినాఁడ
నంగ నతఁడు కోపమున నిట్లనియె నపుడు
వాఁడు కాఁపువాఁడు మనము బ్రాహ్మణులము
పలుకఁదగదట్టులన నద్దిపలికె నిట్లు. 87

క. వాఁ డెవఁడైనను నచ్చిన, వాఁడుగమిక నామనసటు వ్రాసెననతం
డాఁడుది పెత్తనమిచ్చినఁ, బాడుదిగా నుండదనుచు భయవిహ్వలుఁడై. 88

—పాపరాజు పూర్వాచారపరాయణుండగుట—

వ. ఓహో! వివాహస్వాతంత్ర్యమునకే యిట్టి యసంగతము పుట్టినది. నా భార్య మాటలన్నియు వేదాక్షరములైనవి. స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చిన హానిగాదు ల సంఘస్థితి నెఱింగియు నవ్యయోజకుల మాటలు విని కీర్తి నపేక్షించి యీనవనాగరికతా దురభిమానము దెచ్చిపెట్టుకొంటిని. స్వానుభవమునకు వచ్చిన వృషుగాని దేనిగుణమైనను బాగుగాఁ దెలియదు. నా భార్య చెప్పినట్లు దైవ

సమానులై సకలపదార్థతత్త్వములను గనిపెట్టిన పూర్వమహర్షులదే నాగరికత గాని, తానెవఁడో? తన ప్రాణముల రాకపోకలెట్లు జరుగుచున్నవో? నిద్ర యెట్టిదో? యాకలెట్టిరూపము గలవో? రవంతైనను దెలియని యాత్మజ్ఞానశూన్యులది గాదు. ఆఁడుదానిపాటి తెలివియు లేకపోయెను గదా? ఛీ! ఛీ! నా నాగరికత యని పలుమాఱు తన్నుఁదా నిందించుకొనుచు "న స్త్రీస్వాతంత్ర్యమర్హతి" యని యట్లనేకశాసనములు చేసి లోకమందు నీతి నిలువఁబెట్టిన యనుభవజ్ఞులైన మహర్షిశ్రేష్ఠులకును, వారివాక్యములకును బునః పునః ప్రణామములు సేసి యంతటినుండి పూర్వాచారపరాయణుఁడై యుండె. అట్లుండి యొక్కనాడంతఃపురమున శయనించి ప్రక్కనున్న భార్యం జూచి యిట్లనియె. 89

—మోహినీవివాహప్రశంస—

మ. వనితా! పిల్లకుఁ బెండ్లిచేయవలెనాఁ పంబాడిగాదంకనీ
మనసేమౌనన నామె యిట్లనియె ధీమంతుండు, సద్వృత్తి, మా
చిః యన్నయ్య సుతుండు వానికిడినన్ శ్రేష్ఠంబుగానుండు నం
చన నాతండు నిజాగ్రజాసుతునకీయంగోరితి న్నెననెన్. 90

గీ. అట్లనఁగ నామె యిట్లను నన్నియు నెఱుఁగ, గుదురు మీరు నేనేమందుఁ గోరికెట్లు
లున్నదో యట్లు చేయుం డుపుడొప్పగనన, నామహాలౌకికమణి యిట్లనియె మఱియు

వ. కాంతా! నీయన్నకుమారునకీయుటకు నీకిచ్ఛయుండుటయు, మాయప్పకుమారునకీయుటకు నాకిచ్ఛయుండుటయు సహజగుణములు. మాయప్పకొడుకుకంటె మీయన్నకుమారుఁడు విద్యాబుద్ధిరూపములలో నధికుఁడేగాని ధనవంతుఁడుగాఁడు. ముందుగా నన్నింటికినిఁ జూడవలసినది ధనముగదా. విద్యలన్నియు ధనమునకేగదా: అదృష్టము బాగుగానున్నయెడల నన్నియుం గలుగును. నేనీయకపోయిననింక మాయప్పనాయిల్లుతొక్కఁడు. నగలెన్ని కోరవలెనో చెప్పుము. అనఁగా నామె యిట్లనియె. 92

—భూషణవివాహవ్యయప్రశంస.—

గీ. నగలను మనము పెట్టి కన్యకను దార
వోయుటే శాస్త్రవిధి; సిగ్గుపోయియడుగు

మనిరొచటను లేదు గనుక నట్లైసేయ
వలయు మనమన నాతఁడిట్లులవచించె.

వ. కాంతా! వేదశాస్త్రములు సాలంకృత కన్యాదానమని ఘోషించుచుండఁగా నిప్పుడెక్కుడఁ జూచినను నగలను గోరుచుందురిది యేమి హేతువనఁగా సుమతి యిట్లనియె. ఇప్పుడు నగలను గోరుటయే గాదు. కన్యకలను రెండేసి వేలకుఁ దెగనమ్ముచున్నారు. కాలము పోను పోను తగిన రాజగురుశిక్షలులేక ప్రజలనేక పాపకార్యములు చేయుచున్నారు. దైవయోగముచే భర్త చనిపోయినయెడల స్త్రీయొక్క జీవనము వానివల్లగడదునను నూహతో సాధారణముగా నగలనుగోరుట వాడుక చేసిరి. మనదేశము మహా భాగ్యవంతమైయున్నప్పుడు ధనము చెల్లక వివాహాదులందు విశేషవ్యయము సేయుటయుఁ బురుషులలంకారములుంచుటయు నేర్పడినవి. క్రమముగా నవి యాచారములేయయినవి. కావుననే భాగ్యవంతులుగూడ నగలనే కోరుచుందురు. కాని యిప్పుడవి ప్రజలను దరిద్రులను జేయుచున్నవి. తమ యాదాయమును బట్టి వ్యయము చేసినయెడల బాగుగానుండును. ఈవ్యయములు చేయకున్నఁ గులహానిగాదు. జరుగుఁబాటున్నప్పటి ముచ్చటలు. ఇప్పటి మనయుభయపక్షములును భాగ్యవంతములే గనుక నగలను గోరవలదని చెప్పఁగా విని లగ్ననిశ్చయము చేసికొనివచ్చెదనని సుమతినొప్పించి తనపురోహితుం బిలిపించి యింతండిట్లనియె. 94

క. మనపిల్లను మామేన, ల్లునకీయఁదలంచితిమి బలుశుభదినమునన్
మనమేగి చెప్పవలయును, ఘనసుముహూర్తమొక దానిఁ గావింపుఁడనన్.

— మోహినీ వివాహనిశ్చయము. —

వ. మంచిదని యావిప్రుండుంచిన యొకసుముహూర్తమున బయలుదేఱి మేనల్లుని పురమునకేగి తన యప్పతోను బావతోను చిరంజీవియగు మీకుమారుఁడు పుల్లయ్యకు సౌభాగ్యవతియగు నాకొమార్తెను మోహినినిచ్చి వివాహము సేసెదనని చెప్పి తాంబూలములిచ్చి బహుమానములందుకొని లగ్ననిశ్చయము చేసి తిరిగి తనపురమునకు వచ్చెనని విని శౌనకాదులు సూతునకిట్లనిరి. 96

క. మునివర! మోహినిచరితం, బును వింటిమి తత్పతియగు పుల్లయ్యకథన్
వినుపింపుమనంగ నతఁడు, ఘనతరమంజూక్తులమరఁ గా నిట్లనియెన్. 97

—పుల్లయ్యకథ—

క. పుల్లయ్యతండ్రి యెమ్మన, తల్లి శివాలమ్మ చదువు త్రాగునరులతోఁ
చెల్లుగఁ దిరుగుట వాసము, బళ్ళారిపురమువయసు పదియాఱేఁడుల్. 98

చ. అతఁడొకఁడే సుతుండగుట నాతనితల్లియుఁ దండ్రియున్ సదా
తగనగు ప్రేమనిష్టముగు దారిని లాలనసేయుచుంటనే
వితమగు విద్యయున్ విడిచి పెట్టెను బుల్లయయైనఁ బాపరా
జతులితకాంక్ష నప్పకొడు కౌటనొసంగఁ దలంచెఁ బుత్రికన్. 99

క. పుల్లయ్య శుంఠయైనను, మొల్లముగ ధనముగలుగుటఁ బురిజనములు దా
ముల్లములన్ లఘుమార్గము, నొల్లకకడు గౌరవించుచుందురు వారిన్. 100

వ. అంత శిశిరర్తువు వచ్చెను. 101

—శిశిరర్తువర్ణనము.—

సీ. బాటసారులకడ్డు పడి భీతిగలిగించు, నేర్పు చెడిపోవ నింకుచుండె
బకట్రవాండ్రనుమూలఁబడఁద్రోసివేఁచెడు, మంచుప్రభావంబు మాయుచుండె
బ్రాణికోటులఁ జాల బాధించు మిడిమెంత, లేశమాత్రంబైన లేకయుండెఁ
బ్రీతికార్యమునకును భంగంబుచేసెడు, వానలు కలలోని వార్తలయ్యె

ఆ. నవని సకలయుక్తరై మహాభోగముల్, ప్రాణితతికొసఁగుచు స్వర్గమనఁగఁ
బొలిచియుండెనహహా! పొగడంగశక్యమే?, మనకు మాఘమాసమహితమహిమ.

గీ. ఎట్టియాతంకములును లే నట్టిమాఘ, సమయమగుటచేయాత్రి లా సక్తిఁజేయు
వారు శుభకార్యములు చేయువారునైరి, మనుజులందఱుఁగూడ నా మాసమందు

వ. అప్పుడు పాపరాజు రాజదత్తధనముచేత వివాహయోగ్యములగు వస్తువు
లన్నియు సిద్ధపఱిచి బంధువర్గమును బిలుచుటకు దూతలను బంపెనంత. 104

తే. అచటఁ బుల్లయ్యపెండ్లని యతనితండ్రి
బంధుమిత్రులఁ బిలిపించి ప్రమదమొప్ప
స్నాతకముచేసి వలసిన సకలవస్తు
తతులతో సంకరపురికిఁ దరలివచ్చె. 105

—మోహినీ వివాహమహోత్సవాభి వర్ణనము—

వ. అంత సాపావరాజును నెదుర్కొని యుచితమర్యాదలు గావించి పెండ్లివారి కిఁ దగిన విడుదులు నియోగించెను. తరువాతఁ గొంత సేపునకు సమయమ్మై నదని పురోహితులు మోహినీ పుల్లయ్యలను మంగళస్నానములు చేయించి వధూవరులకు శాశ్వతబంధ మేర్పఱుచునట్టి యుత్తమ వేదోక్తమార్గమ్మున వివాహక్రియలు నెఱవేర్పుచుండిరప్పుడు. 106

సీ. ఉచ్చైస్స్వరంబుతో నుద్వాహ మంత్రముల్, విశదముగఁ జదువు ద్విజుల చేతఁ
బ్రత్యక్షయుక్తితోఁ బ్రత్యక్షరార్థంబు, వివరించు ఘనవేద విదులచేత
దంపతులకు శుభదంబు గోరి దీవించు పరమపావన పతివ్రతల చేత
నశుభ వాక్కులు విన నడ్డమై రేఁగి, హర్షమిచ్చు బహువాద్యముల చేత
గీ. సలఘు విషవాయుహరములౌ నత్తరులు మొ
దలగు బహుసుగంధ పదార్థ తతుల చేత
వస్తుజడతఁ బోఁగొట్టు దీపముల కాంతి
చేతఁ దత్కార్యమండప శ్రీ చెలంగె. 107

సీ. నాకును నీలాగు ననెయుణ్యోఁ బెండ్లని, తడికంటఁ బెట్టు విధవల చేత
వరుఁడు రూపసిగాఁడు వధువన్యమార్గము, ప్రేమించునని జారిణుల చేతఁ
బుల్లయ్యధనికుఁడు పోనీక చేపట్ట, వలెనను భోగము వాండ్ర చేతఁ
దొందరచేమంచి త్రోవదప్పియుపర, మంత్రముల్ జదువు బ్రాహ్మణుల చేత
గీ. జనగణశ్వాసదీపోష్ణజనితమైన, బొగ్గుపులుసుగాలివలనఁ బూర్వనీతిఁ
దిట్టుకత్తిరింపుసిగల ధీరవరుల, చేతఁ దత్కార్యమంటప శ్రీ తొలంగె. 108

—వరశుల్క నిషేధము—

వ. అట్టి మండపమునందుఁ బాపరాజు కన్యాదానము సేయుచు వరునకు వేయి నూట పదియాఱులు కట్నమీయఁబోఁగా నుమ్మన్న యడ్డుపెట్టి యతనికిట్లనె. వాఁడొకఁడే కొడుకు, వానినమ్ముకొనుటకు నేనంత జరుగుఁబాటు లేనివాఁడను. గాను. మీసొమ్ము మీయొద్దనే యుంచుకొనుఁడనఁగా సభవారాశ్చర్యపడిరి పిమ్మటఁ బాణిగ్రహణ మహోత్సవము యథావిధిగా నెఱవేరెనిట్లు మొదటి దినము గడచె. 109

—పెండ్లివారి చేష్టలు—

సీ. పెండ్లివారికిఁబంక్తి విడువలేదొకపూఁటఁ బసచూపుమనిమిట్టిపడునొకండు
కాఫీనష్టయిచేయఁగాలేమ రవ్వానర్తునటంచు మీసాలు దువ్వునొకఁడు
ననుఁబిల్వలేదు పేరనుభోజనానకు నేనురానని తెగనీల్గునొకఁడు
ముచ్చటలెఱుఁగరు మూర్ఖులు మీరింకఁ జాలుననుచుఁదెగ సాఁగునొకఁడు
గీ. నన్నుఁజూచినయెడల వినయము నేల
విడుతురని పాపరాజుదా విడిదికేగి
విందునకుఁ బిల్వ నప్పటివేళఁ బెండ్లి
పెద్దలందఱు విస్తార విరసులగుచు. 110
సీ. వియ్యపురాలికి వేడుకల్ జరుప లేదిదియేమిపెండ్లని యొగురునొకతె
అప్పడాల్ మధ్యాహ్నమడుగంటె నిదియేమి భాగ్యమోయనిపడవాగునొకతె
నిన్నరాతిరినాకు నేయిసున్నయిదేమి పెత్తనంబని మూతివిఱుచునొకతె
నన్నుఁజూచియొకఁడు నవ్వెనిదేమిమర్యాద చూడుమనిసి వాడునొకతె
గీ. ఆఁడుబిడ్డనుగనుటయే యధికపాప, మని సుమతివిడుదులకేగి యమితవినయ
మమరఁ దిండికిఁబిల్చిన యపుడు పెండ్లి,వారిలోఁగొడ్డురాండ్రైన వారలెల్ల.
వ. ఎట్టివారైనను మనుష్యమాత్రునకు లోపములుండక మానవు. రేపు మనము
ను గార్యములు చేయువారమే యను జ్ఞానములేక, మాటమాటకును దప్పులెం
చుచుఁ దామే తెలివిగలవారమని తెగసాఁగుచు, వేళకన్నములకుఁ బోక, క
య్యములు పెంచి వేఁపుకొనితిను పశుప్రాయులైన మగపెండ్లి వారేమియన్నను
బ్రత్యుత్తరములు చెప్పక కార్యము జరుగుటయే ప్రధానమనియెంచి యాఁడు
పెండ్లివారు పరమశాంతులై వర్తించుచుండిరి. ఇట్లు రెండవ దినంబుగడచె
నంతమూఁడవదినంబు వచ్చుటయు నప్పుడు. 112

—మహదాశీర్వచన మహోత్సవము.—

క. ఉమ్మన మహదాశీర్వచ, నమ్మని విప్రులఁబిలిచి వినయమునవారిన్
సొమ్ముల సంభావించెద య, శ్శ్రమును బుణ్యముఁదనకు సంఘటనముగాన్.

—సంభావనలీయఁగూడదనుట.—

క. దండగనక బ్రాహ్మణులక, ఖండముగా విత్తమిడుట గనియాసభలో
నుండునవాచాలాదిబ, లుండొకఁడిట్లనియె లేచి లోహితముఖుఁడై. 114

గీ. బ్రాహ్మణులకిట్లు సొమ్ముసంభావనలుగ
నిడుటకంటె దరిద్రుల కిడుట స్త్రీలుఁ
బురుషులుఁ జదువుటకిడుట, పరమపుణ్య
మనఁగ నచటిపండితుఁడొక్కఁ డనియెనిట్లు. 115

—సంభావనలిచ్చుట ముఖ్యమనుట.—

వ. వాదముచేతఁగాని యనుభముచేతఁగాని యెంతగొప్పవారికైనను దాఁటిపోవ శక్యముగాని పరిపూర్ణాద్వైతమును బోధించునవి వేదములు. ఇహపరలోక వ్యవహారములకు భంగమురాకుండ వర్తనక్రమముఁజెప్పునవి శాస్త్రములు. ఈరెండును బ్రాహ్మణులవలన రక్షింపఁబడుచున్నవి. మమ్ము సంభావించుట లోకోపకారకములైన వేదశాస్త్రముల యభివృద్ధికేఁగాని దంభమునకుఁ గాదు. ఇతరులుగూడ వీనింజదువుచున్నారందురేమో! జాతిధర్మముగా నేర్పడిన వృత్తివన్నెలు దేరుచుఁ జిరకాలము నిలుచును. మీరన్న సంస్కారణములు జరిగెడుచోట్ల జరుగుచనే యుండును. జ్ఞానబోధకములగు వేదశాస్త్రాభివృద్ధి నశింపఁజేసి సాధారణలోకోపకారవృత్తి వృద్ధిపఱుపఁదలంచుట యేటినాగరికత? అన్నియుపయోగములును గనిపెట్టుట నాగరికత. అనఁగా వానికింక నోరాడకపోయెను. అనంతరము మహదాశీర్వచన మహోత్సవము చక్కఁగా నెఱవేరె, నప్పుడు కొందఱు వేదాధ్యయన సంపన్నులు వచ్చి పాపరాజుంజూచి మేమాహితాగ్నులము. మాకు బియ్యము మొదలైన విప్పించినయెడల స్వహస్తపాకముచేసికొని భోజనముచేసి పోదుమన నా మంత్రిశేఖరుండు మండిపడి యిట్లనియె. 116

గీ. మేము బ్రాహ్మణులముగామ యేమి? మాగృ
హమున మీరేల? తినరట్లైనఁ బొండ
నంగ నతనిబంధువు శివన్నయనునతఁడు
వైదికాచారపరుఁడెట్లు పలికెనపుడు. 117

—లౌకికవృత్తి.—

సీ. దేవభూదేవవృత్తివిఘాతములు సేయు, పుణ్యమెఱుంగని బుద్ధిచేత
లంచాలకై బీద లనుబాధపెట్టెడు, భూతదయాశూన్య బుద్ధిచేత

రాజులతోఁగూడి రచ్చలలో నీచజనులనెల్లను ముట్టుకొనుటచేత
ముంగలివాండ్రను మంచాలకెక్కించుకొని కాళ్ళు పిసికించుకొనుటచేతఁ

గీ. బ్రాహ్మణులలో ననంతర్బాహ్య పారిశుద్ధ్య
హీనులమని మనమిలఁ జే రెక్కినాము
గాన సద్వర్తన వ్రతులైన బ్రాహ్మ
ణోత్తములు మనవంటక మొల్లరెపుడు. 118

— పరిశుద్ధాహితాగ్నులు —

గీ. మరియుదుర్వృత్తిగల తమ మాతచేత, నైనను యథావిధిగఁజేయలేని భార్య
చేతనైనభక్షింపరు శిష్టులకిది, పరమపావన ధర్మంబు పాపరాజ. 119
వ. అన నా పాపరాజు శివన్నకిట్లనియె. 120

— వైదికవృత్తి —

సీ. గేదెదానంబులు గోదానతిలదాన హయదానముఖ్యంబు లందువారు
గ్రామపౌరోహిత్య కర్మలై కడజాతి యిండ్లఁ గార్యాలు చేయించువారుఁ
బర్యగ్నికరణాలు బందిరిమైథునంబులు షోడశాశనాల్ సలుపువారు
నపరకర్మంబులు నాగమతంత్రముల్ నానాథమక్రియల్ నడుపువారు
గీ. నతిరతిమతినాదచంద్రేశ్వ రాభిషేక
మందు ఘనసురాభాండేశ్వరాభిషేక
మందు నముక చమక తంత్ర మాచరించు
వారునగు వీరి గౌరవపరచనేల? 121

వ. అనఁగా శివన్నయిట్లనియె. సకల కర్మాధికారియగుటచేఁ బ్రజలపావము
డందుదురన్న దుర్దానములను బ్రాహ్మణుఁడే గ్రహింపవలెను. గ్రహించిన
ను విధివిహిత ప్రాయశ్చిత్తములచేఁ దత్పాపముం బోఁగొట్టుకొనును. కావుననే
"చ. శమముదమంబు శౌచమును సత్యము శ్రౌతముస్మార్తముక్ మృదుత్వ
ము నరసత్వమార్యజన వందనతృప్తి వినిహితక్రియా విముఖత, యప్రమా
దము, వివేకము నీశ్వరభక్తి నిశ్చలత్వము నిరపాయజీవనము వైదికవృత్తిని
మించనున్నదే?" అని పెద్దలనిరి. కాని ప్రాయశ్చిత్తరహితులగుటచే బంక్తిబా
హ్యులైన కొందఱివలన వైదికమునకుఁ గొంతయపకీర్తి యిటీవలవచ్చినది

అయినను బ్రిజలను బాధించి తన్నుఁ బాపాత్మునిజేయుట లౌక్యవృత్తి. కం
టెఁ బ్రిజలను శుద్ధిఁజేసి తన్నుఁ బాపునిఁజేయు వైదికవృత్తియే పవిత్రము
గదా. ఏదియెట్లున్నను నీవిప్రోత్తములట్టి పనులకంబోనివారనవిని పాపరా
జుగారి దృఢవ్రతంబును మెచ్చుచుఁ గావలసినవానినిప్పించి వారినంపె, ని
ట్లు మూఁడవదినఁబు గడచె. అంత నాలవదినఁబు వచ్చుటయు నయ్యది ము
గపెండ్లివారిలోని యొక గృహస్థుతండ్రి యాబ్దికదినమగుటచే నతండందుల
కై యొక పరగృహంబున సన్నాహము చేసికొనుచుండఁగా నొక నవాచా
రాతిబలుఁడా ప్రియత్నమెఱింగి యతనిని సమీపించి యిట్లనియె. 122

—తద్దినములు పెట్టఁగూడదనుట—

చ. వచ్చినవారియందుఁగల సారముభూతములందుఁజేరు, మీ
రిచ్చను బెట్టుపిండముల నెవ్వరు మెక్కుఁడు ? రట్టులెవ్వరేన్
వచ్చినఁగానరారె ? యిది బాగుగ[illegible]డదింక మీరలీ
పిచ్చితలంపు మానుఁడని బింకముగా ననఁ నాతఁడిట్లనెన్. 123

—తద్దినములు ముఖ్యముగాఁ బెట్టవలెననుట.—

గీ. తనువునకె చావుగాని యాత్మకది లేదు
గాననిహలోకసంబంధ కల్మషంబు
లాత్మవిడుచుటకు వారియందు మనము
చూపుగొప్పకున్ శ్రాద్ధముల్ సుగతులయ్యె. 124

గీ. లెమ్ము లెమ్మనఁగా బల్లి లేచినట్లు
కుదురుకుదురుమనఁగ జబ్బు కుదురునట్లు
మోక్షమొందుము మోక్షముపొందుమనిన
నాత్మబలముచే మోక్షమునందు నాత్మ. 125

గీ. అట్టియాత్మబలము వృద్ధి నందఁజేయు
శ్రాద్ధముల్ మంత్రములు వాక్కరణము ధ్యాన
మా మనఃకరణము, తిలలన్నము మొద
లైనవి శరీరకరణము నయ్యెనందు. 126

గీ. అన్నమున భూతసంతుష్టి యయ్యెనేని
భూతములయందుఁ గలమృతుల్ మోదమంద

కుందురే? సారము విడిచి మందమతిని
గట్టిగాఁ బలుకు నీనుడుల్ గట్టిపెట్టు. 127

—తృణజలూకన్యాయ పరిశంస—

వ. అనఁగా నతఁడు కొంతసేపేమియుందోఁచక కొట్టుమిట్టాడి చివరకిట్లనియె. తృణజలూకన్యాయముచేత జీవుఁడు శరీరము విడిచి వెంటనే మఱియొక శరీరము దాల్చునని తెలుచున్నది. అట్లుజరుగుచుండఁగా నీలోపున వానికిఁబితృత్వ మేది? వానికిఁ దద్దినములు పెట్టనేల ? యన నాయజమానుం డిట్లనియెను. ఈ న్న న్యాయములన్నింటికిని మీరన్యాయముగా నిర్ణయఫలములు చెప్పుటచేతనే యాత్మజ్ఞానశూన్యమతములు ప్రబలినవి. ఏన్యాయమెక్కడ నెట్లువర్తించునో దానింగనిపెట్టవలెను. ఈన్యాయము మోక్షముపొందువానియం దెట్లు వర్తింపఁజేసెదరో, చెప్పుడు చనిపోయినవారు కొందఱు పిశాచశరీరమును గొందఱు యాతనాశరీరమును, గొందఱు వెంటనే మఱల స్థూలశరీరమును గర్మానుసారముగాఁ దాల్తురు. కొందఱు సూక్ష్మశరీరముతో స్వర్గమునకుఁ బోవుదురు. కొందఱు శరీర రహితులై మోక్షమొందుదురు. ఇఁదు యాతనా పిశాచస్థూల శరీరములను దాల్చువారియందే యీన్యాయము వర్తించును. ఇట్లు చెప్పుటకు నీయిష్టమాయందురేని పితృత్వమును నీన్యాయమునుగూడ నంగీకరించిన మహర్షుల మతమేదియో విమర్శించి మీరుచెప్పినచో నేనొప్పుకొందును. అప్పుడే చనిపోయినవారేశరీరము దాల్తురో దానింగనిపెట్టి పితృక్రియలు నిర్ణయింపఁగూడదు. ఏమనఁగా వారేమైనను మనమిచ్చు తిలోదకాదులు పితృలోకవాసులైన వంశమువారి కందఱికిని దృప్తినిచ్చును. కావుననే నిజమైనసన్న్యాసికిఁగూడఁ బితృక్రియ లేర్పడినవి వంశమువారందఱును బితృలోకవాస్తవ్యులు గాకపోయిన రాఁగల పదితరముల వారివఱకు సీక్రియలు పనికివచ్చును. ఎవరేమైపోయినను సీక్రియలు లోకమునకు మార్గదర్శకములైన నగును. పితఱులందరును బాపశరీర ధారులైన సీక్రియలు పాపవిముక్తిఁజేసి, పితృలోక బ్రహ్మలోకాదిస్థలనివాసార్హులనుగాఁ జేయును. కావున నెట్లయినను మృతులకు శ్రాద్ధములుపెట్టక తప్పదని నిశ్చయించిరి మునులు " దేవపితృకార్యాభ్యాంనప్రమదితవ్యం " అని

శాసించినారు. స్థూలశరీరము కర్మశరీరమును, దక్కినవి భోగశరీరములు న
గుటచేఁ గర్మకర్తృత్వము నజీవులయందే నిలిచినది. కావున దేని నెక్కడ నెట్లు
వర్తింపఁజేయవలెనో తెలియక శాస్త్రమునకును, యుక్తికిని, లోకానుభవము
నకు సంబంధింపని బండవాదములు సేయు మీవంటి లఘుబుద్ధిమంతులు, పరమత
ముల నాక్షేపించుటకుఁగాని, స్వమతమును విమర్శించి సమర్థించుటకుఁగాని త
గరు. ఇంక శాంతమును వహింపుఁడు. అనఁగా నాతం డూరకుండె. వెనుక నాయ
జమానుఁడు యథావిధిగా శ్రాద్ధక్రియలు నిర్వర్తించి భోక్తలకుఁ దాంబూల
దానము సేయు నప్పు డచ్చట నున్న యొక శుద్ధచ్ఛాందసుం డిట్లనియె. 128

—భోక్తలకుఁ దాంబూలమీయఁగూడదనుట—

గీ. నేఁడు భోక్తలు మిక్కిలి నియమమూన, వలయుఁ దాంబూలమద్దానిఁ బాసి సేయుఁ
గాన నీయఁగూడదని వాక్పటుత మెఱయ, నడ్డుపెట్టఁగా యజమానుఁ డనియె నిట్లు.

—భోక్తృతాంబూలదాన ప్రాముఖ్యము—

సీ. ఈమహనీయగోఘృతము నీవరియన్నముఁ బిండివంటలుం
గామగుణంబు పెంచుటకుఁ గాని పదార్థములౌనె? భోక్తలా
నేమము గల్గియుండవలె; నేను విడెంబునొసంగకున్నఁ బూ
జామహితక్రియాళి నుపచారమదొక్కటి తగ్గిపోవదే? 130

గీ. అనఁగ నాతఁడు నోరాడకట్టెయూర, కుండె; నాయజమానుఁడఖండభక్తిఁ
జైత్యకముదీర్చె; నా పెండ్లివారు నాఁటి, రాత్రి నూరేగ వెడలిరి రంగుగాను. 131

—ఊరేగింపుమహోత్సవము—

గీ. పల్లకీముందు వెనుకల నుల్లసిల్లు, భోగభామలు సంసారిభోగభామి
నులును మోహినీపుల్లయ్యలలరు భోగ, భాగ్యసంపదుల నిస్పష్టపఱచిరపుడు.

సీ. వీథులందున మీపవిలసితవనముల, జీబుగాఁ బెరిఁగిన చెట్లవలన
సూర్యప్రకాశమ్ము సోఁకకుండుటచే జ, డమ్మునైన బహుపదార్థములవలనఁ
బెండ్లివేడుకలఁ జూడ వెడలివచ్చుచునున్న. బహుసహస్రప్రాణిపటలివలన
బహుతైలముల చేత బహువిధంబులు గాను, వెలిఁగెడు దీపాలవేఁడివలనఁ

గీ. గలుగు విషవాయుసంఘమ్ము వలనఁ బెండ్లి, వారలారోగ్యభంగము వడయకుండఁ
జాలఁగా పాడె నప్పుడు పంతసమున, వారు కాలిపించిన మంచిబాణసంచు. 133

సీ. రముడోళ్లు, డోళ్ళు, వీరణములు, తాషాలు, బాకాలు, కొమ్ములు, ధ్వనులు సేయఁ
బిల్లముగోళ్ళు, పిడేళ్ళు, సన్నాయిలు వాక భాజుజుజు, బాటఁబాడ
నగరువత్తులు, గంధ, మత్తరుల్, పన్నీరు, కర్పూరమును, బూలు, గమ్మునఁగఁ
గాఁగ డాల్, లాంతర్లు, కర్పూరమును, గొవ్వువత్తు, లిలాయులు, పరిభలనొప్ప
గీ. బాలురును, వృద్ధులును, స్త్రీలు, వయసుకాండ్రు
పండితులు, వేషధారులు, భటులు, బట్లు,
తేనుఁగులు, గుఱ్ఱములు, గూడ సేగుదెంచ
నావధూవరులూరేగి రట్టియెడను. 134

—భోగము వాండ్రను గౌరవింపఁగూడదనుట—

గీ. భాస్వరస్వర స్వరచనా వారయోషి, దమృతగీతాళివినిరాన భాసురాత్తి
భాస్వరస్వర స్వరభసా వార్యకంఠ, మలరనాకన చాచారాతిబలుఁడిటులనె. 135
గీ. పరిజలనీతి బాహ్యులఁ జేయువారసత్ఫుల, గౌరవించుచు వారల గానమువిను
చిల్లుదిప్పుట మర్యాదకెంతొహాని, యనఁగ నచటి పండితుఁడొక్కఁడతనికనియె

—భోగము వాండ్రను గౌరవించు హేతువు—

గీ. భరతశాస్త్రాభినయశాస్త్రభరము వార, భామలవలన మోవంగఁబడుచునుండెఁ
గాన నాశాస్త్రవృద్ధికేగణికలకిటు, గౌరవమనంతఁడనియెఘనసుబుద్ధి. 137

—వారస్త్రీవివాహ ప్రశంస—

ఉ. కూరపువృత్తిఁబూని, జనకోటులబుద్ధిఁగలంచి, వారిసం
సారము లెల్లఁగూల్చి, వరసత్కుల కాంతల నేడిపించునీ
వారవధూగణాలకు వివాహములొప్పఁగఁజేసి తత్కళా
భారము వేషధారులకుఁ బాల్పడఁజేసి జగంబుగావరే. 138

—నీతికిభోగమువాండ్రడ్డురాలేదనుట—

క. అననా పండితుఁడిట్లని, యెను వారస్త్రీల యొద్ద నైతికమార్గం
బును లేదు ; మంచిమార్గము, మనకుండిన వారు దానిమాన్పంగలరే. 139

—భోగము వాండ్రయెడల నడువవలసినపద్ధతి—

చ. "విడుఎక పుట్టుగుడ్డునకు వృద్ధశరీరికిఁ గుష్ఠరోగికిం
జడునకు జాతిహీనునకుఁ జారునిజాంగములొక్కరూకకై

కడువడినిచ్చువారి, గుణకల్పలతల్ విదళించుకత్తులం
బడుప్రుకడంతులందనదు భావముఁజేర్చున ? రెువ్వఁడేనియుఁ". 140

క. "జారభటచోరచేటక, చారనటపరిభృతినీచ జననిష్ఠీవా
ధారశరావమువార, స్త్రీరమ్యాధరమునంస్పృశింతురె ? కులజుల్".

—ప్రస్తుతకాలజనులనీతి—

గీ. ఇట్టిమనశాస్త్రనీతులం దెట్టిగార, వమ్ముసుంచనిదుష్టులుప్రబలియుంట
వలనఁదగురాజశాసనంబిలనులేక, యుండుటనుజనుల్ నీతిబాహ్యులయిరిపుడు

—సంఘసంస్కరణవిధానము—

క. ఘనపూర్వకాలనీతిని, మనముగిలువఁబెట్టుకొనుచు మనునెడ నేఖా
తినిమార్పనక్కఱయె లే, దనయముజనులనుసుగతుల నదియేచేయుఁ. 143

క. మునులిట్లే సంస్కరణం, బునుజేసిరి ; పూర్వగతులుమొదటనుబోఁ గొ
ట్టినవీనగతులనిల్పుట, కనుఁగొననదియొక ప్రయోజ కత్వంబగునే ? 144

గీ. భోగకాంతలకు వివాహములను జేసి, వారుచేయువ్యాపారముపరులకిడిన
జాతిధర్మముగామి చేసతతకృతము, గాకకొన్నివాళ్ళకదివిగతముగాదె! 145

గీ. అనఁగ నామహామతియిట్టులనియెనెదుట, నగ్నినిరగిల్చిమిడుతలనాఁపనెవని
తరము ? సంఘమంతయునిట్లెతిరుగుచుండె, ప్పుడనఁగ నావండితుఁడిట్టులనియె.

క. ఘనసుకరాధారమున, గ్నినిసకలజనోపకారనిధి, దుశ్చిత్తం
బునమిడుతల నాఁపఁగలే, కనాశపఱుచుట ప్రయోజకత్వంబగునే ? 147

గీ. శిశువు మన్నుదించుచున్న నాశిశువునడ్డ,
పఱుచుట సులభమా ? మన్నుపాలుగాఁగఁ
జేయుటసులభమా ? యనఁజెప్పలేక
వాదమునుమానుకొనిరెుఁ దత్పండితులఁడు. 148

—పెండ్లివారికి వైరముప్రబలుట—

గీ. పిదపఁ బెండ్లివారూరేగి పెద్దవీధి, నిలిచిరెుదురునన్నాహముసలుపనాఁడు
పెండ్లివారికివార్తనంపిరటులంప, వారుమాకదిలేదనియూరుకొనిరి. 149

గీ. అంతనచటఁదటస్థించినట్టివారు, వీరునతులతల్ జల్లుకొంచూరుచుట్టుఁ
దిరిగివచ్చివైరముచాలఁబెరుఁగఁ జేసి, హోమమునకుఁ బామనిచెప్పి యూరుకొనిరి.

—ఆశ్వాసాంతము—

వ. అంతఁ బురోహితులనేర్పుచేత శేషహోమము నెఱవేర్చెను. పిదపనొకదానితో నొకదానినల్లి వారును వీరును గొట్లాడుకొనిరి. అట్లాడుకొని నాకబల్యాది మహోత్సవంబులు మాని పెండ్లికుమారు నాందోళికయందుంచుకొని పెండ్లివారుత్తరాభిముఖులయి తమబళ్ళారిపురమునకుఁ బోయిరి.

—ఆందోళికాబంధము—

క. పరమారా! నరవర! శ్రీ, కర! పారదదరసుమల్లికాహీరనిశా
కరతారకశరతారక, హరవరయశ! ముత్యసూరనావన! రామా. 152

—గద్యము.—

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, ముత్యసంతానక్షీరపారావారా
త్రిపుత్రవేంకయ్యార్య ద్వితీయపుత్ర, బాపన్నార్యపౌత్ర, చినసర్వయ్యా
ర్యైకాదశాబ్దపోషితపుత్ర, సీతయ్యార్యస్వీకృతపుత్ర, సకలజన
కారుణ్యకటాక్షపాత్ర, సీతారామచంద్ర పరబ్రహ్మార్పిత
సకలకర్మ, సూర్యనారాయణమూర్తి శర్మ ప్రణీ
తంబై, యపూర్వాద్భుత చరిత్రయగు
సకలానందనామక
నవీన ప్రబంధమునందుఁ
తృతీయాశ్వాసము.

శ్రీరస్తు.

సూర్యనారాయణమూర్తీయము.

# సకలానందము.

## చతుర్థాశ్వాసము.

క. శ్రీరుక్మిణ్యాచరిత్రను, భూమిజలోకాపవాదపొందకయుండన్
భీమాగ్నిఁదింపిలోక, స్తోమమునకునీతిరీతిఁజూపినరామా. 1

వ. దేవా! దివ్యచిత్తంబునవధరింపు మట్లుచెప్పఁగావిని యవ్వలికథచెప్పుమని
యడిగినశౌనకాదులకు సూతుండిట్లనియె. 2

గీ. అట్లుపెండ్లివారింటికినరిగినంత
వారిచేష్టలనుగుణించి ప్రజలునింద
సేయఁదొడఁగిరిటుల లోవిమూయఁగలరు
గానిలోకముమూయంగఁ గలరె? జనులు. 3

—జనులు పెండ్లివారినినిందించుట—

గీ. ఊరుదొఱకెక్కినప్పటినుండియొక్క గడియ
యైనఁగట్లాటమానలేదహహా! యెచట
నేనినిట్లుండునే? యిదియేమిపెండ్లి
గాని; వీరిపౌరుషములు కాలిపోను. 4

సీ. నాగవలికుత్తికంటును నాతిదాల్ప, లేదుగనుకదీక్షకువృత్తి లేదుచూడు
నాపలుకనుచునిటుతోఁచినయటులాడి, పోనీరితమపుట్టెమునిఁగిపోయినట్లు. 5

—మహామతిమన్మథోపనయనప్రశంస—

గీ. అంతఁ బాపరాజొక్కనాఁడాత్మజులను
పిలిచి మీకువడుగుసేయఁదలఁచుచుంటి
నేమి చెప్పుదురన వారనేకవిమత
గతులయందుఁ బ్రాజ్ఞానశక్తిగలిగియుంట. 6

వమేమిప్పుడు దానికంగీకరింపమని చెప్పఁగా నేమియుననలేక యతండూరకుం
డె. అప్పటికాబాలురు సంగీతసాహిత్య దేశదేశాధీశ్వర భాషలయందు విస్తా
రపాండిత్యమును సంపాదించి యింకను బడియందుఁ జదువుచుండిరంతనొ
కనాఁడు. 7

— మోహినిరజస్స్వలయగుట —

క. జననియు జనకుఁడు బంధులు, ఘనతరసంతోషమందఁగా శోభనశా
రను బడెనే యహహా యని, జనులన మోహిని ప్రథమరజస్స్వలయయ్యెన్. 8
గీ. పిదప మంచి పేరంటాండ్రఁ బిలిచి సుమతి, యుక్తకృత్యముల్ నెఱవేర్చెనంతఁ బాప
రాజు కార్యంబు దీర్పంగ రండు త్వరగ, ననుచు శుభలేఖనం పెవియ్యంకునకును.
ఆ. ముందువచ్చునట్టి ముప్పెఱుంగక వార, లిపుడు రాను మాకు నేమితీరి
కయును లేదంటు దుర్గర్వాంధకారులై, తిరిగి లేఖ వ్రాసిరరులభంగి. 10
వ. దానిం జూచిన పిమ్మట జనులాడుకొను గుసగుసలు విన్న బంధుమిత్రులు చెప్ప
రహస్యమును విని సుమతి తనతో విశదపఱుపఁగా విమర్శించి పాపరాజు మా
నిపించుటచేఁ దన్మోహిని బడిచదువుతోడి బాలుర పాలు సేసి చిలుకలకుఁ బద్య
ములు సెప్పుటకు విఘ్నేశ్వరపూజ సేసెను. 11

— అపూర్వసౌందర్యము —

సీ. పరిమళించుచున్న బంగారు దేహంబు, శిలఁ బోలు పూలబంతులు కుచంబు
లతిమృదువైతీయనగు మానికంబోష్ఠ, మకలంకుఁడగు చంద్రుఁ డాననంబు
ఘనవృష్టి వికసించు కంజముల్ నేత్రముల్, కలరవమైన శంఖంబు గళము
చంద్రసూర్యులఁ జూచి చనని చీఁకటి కొప్పు, ముదురని పల్లవంబులు పదంబు
గీ. లహహా! దాని నెవఁడు భూమియందు సృష్టి
చేసెనో కొ! యీ బ్రహ్మ చేసృష్టి చేయఁ
బడిన యాదిశేషాదులు బహుముఖులును
దానిసొగసును వర్ణింపఁదగరునుండి. 12

— పూర్వభూషణవిసర్జనము —

సీ. ఎట్టిమున్నుండదలాగి విడియేలయని యెంచి, పగడాలనొకవైపు పాఱవైచి
బుట్టలదొంతరలట్టివేలయటుంచుఁ, గర్ణపుష్పములొకకడను విసరి

యాకుఁ జేఁదలవలె నార్చుచుండె మనవి, యేలని పావడాల్ మూలఁ బెట్టి
బూరెల మూకటిఁ బోలియున్నది దేల, యని రాగిడీని దిట్టి యవలఁ బెట్టి
గీ. తేలికగ నుండును, ముఖానఁ దేటగలుగు
గల్లుగల్లను, నెవరు నగరని యద్ది
ముత్యముల పట్టెడ, కమలములు, పసిండి
గజ్జెలును, నాగరము దాల్చుఁ గాంక్షతోడ. 13
గీ. కొప్పునిండఁ గమ్మంతను, గొల్లకావ, డియను మొగలిరేకుఁ, దలనొప్పియగు వేళ
వేయ పట్టనుఁ బాపటబిందెలనిటు, నును పటి నగలనింద సేయు నెపుడునది. 14

— మోహినీజన్మభూమివిహారము —

సీ. తలదువ్వి సిగ చుట్టి దానిపై మొగలిపూ, వుల రేకులను సొంపు లొలుకఁ జుట్టి
కనుఁ జిన్ని బొట్టుంచి కాటుక దీరిచి, కూర్మితో సన్నసికోకఁ గట్టి
పటుకాంతియుక్తమౌ పట్టు రైక దొడిగి, బిందె నొప్పగ బుజమందుఁ బెట్టి
గజ్జెలు మట్టెలు గలుగళ్ళుమని మ్రోగఁ, జేల చెఱంగును జేతఁ బట్టి
గీ. యోరచూపు లొయ్యారమొప్పారు మండ
రాజవీధినిఁ జను దానిరంగుఁ జూచి
గుటకలూరకే మ్రింగుచుఁ గుండె చెదరఁ
బరవశత్వము నొందని వాఁడు లేఁడు. 15
సీ. కుచ్చెళ్ళు గోఁచియుం గూర్చి సన్నని వెల్ల, కోక దీరిచి కట్టి రైక మంని
బొమలలోఁ గుంకుమ బొట్టుంచి బుజములకా, నడయాడు పాదుగ వేల్మ్రుడిని వైచి
అడ్డబాసను దీసి దొడ్డ కెంపుల వని, తరపు బంగారు టుంగరములూని
మురువులు ముంజేత మురువొప్పఁ జెవులందు, మగ తాలు దుద్దులదుగ సెలంగ
గీ. విసెనకఱ్ఱఁ జేత ధరించి విడెపు గార, పండ్లతోఁ జిఱునవ్వుతో బలుపెలయలుగ
మాటలాడు దాని తలంటు నాటి తీరుఁ, జూచినూరెండ్ల ముసలియు సోలు నాక!
వ. ఈవిధంబున సంపూర్ణయౌవన సౌందర్యయుయైన యా మోహిని సకలలో
క సమ్మోహినియయి తన జన్మభూమి యయిన సంకరపురియందు స్వేచ్ఛగా
సంచరించుచు బాల్యమిత్రుండయిన కుమతినిమిక్కిలి దయతోఁ జూచుచుండె.
ఇట్లాయు నెలలుగడచె. 17

—మహామతిమన్మథభ్రష్టత్వము—

క. గతమతిగురుబోధగత, వ్రతుఁడయి మాదిగమతముల పాలింటి మహా
మతియై మహామతిమహా, మతియనఁ బ్రాలాడెనో కటా మాదిగదానిన్. 18

క. వ్రతముగురువిధవిధుఁడు, ప్పథబోధలచే విధవలపాలింటికి మ
న్మథుఁడయి మన్మథుఁడును మ, న్మథపరముగ శత్రులు దిప్పి మఱగె విధవన్

—సుమతి పాపరాజ విచారము—

వ. ఆవార్తను విని సుమతి పాపరాజు లత్యంత చింతాక్రాంత స్వాంతులయి కొం
తవడకు విచారించి దైవగతి యిట్లుండెనని వైరాగ్యము ధరించియుండిరంత నొ
క్కనాఁడు. 20

క. తనకూఁతు నకట నెలఁ ద, ప్పెనను చు జనులాడుకొనుట విని చిహ్నంబుల్
గని సుమతి చింతనొందుచుఁ, దనప్రాణేశ్వరునిఁ జూచి తగ నిట్లనియెన్. 21

గీ. నేను జెప్పిన నీతులు నింద చేసి, పిల్లను బడికిఁ బంపితివి కనుమి పుడు
పుట్టెను నిఁగినదని చెప్పు ముప్పును విని, పాపరాజప్పు మూర్ఛచే ధాత్రి కేల 22

వ. అట్లుపడి కొంతసేపటికిఁ దెప్పిరిల్లి సుమతికి నమస్కరించుచుఁ బ్రాణేశ్వరీ! నే
నన్నియు నపరాధములనే చేసితిని. నాకిప్పుడు మతిపోయినది. క్షమించి యిం
క నేమి చేయవలెనో చెప్పుమనఁగా సుమతి యిట్లనియె. 23

క. ఇప్పుడు బళ్ళారికిఁ జని, యప్పకు బావకును మ్రొక్కి యతి వినయమునం
దప్పు కదయ సేయుండని, చెప్పి దయగడింతుకొనుము శీఘ్రముగ ననన్. 24

—మోహినీ పునస్సంధానము—

చ. అతఁ డటు లేగి బావకును నప్పకుఁ దప్పు క్షమించి నన్ గృతా
ర్థతఁ గనఁ జేయుఁడం డుఁబలు దండములుంచఁగ వారలుం దయా
మతులయి పొమ్ము వత్తుమని మంచిముహూర్తము నిశ్చయింపఁగా
నతిముదమంది వచ్చి యది యంతయు భార్యకుఁ జెప్పి కూర్మితోన్. 25

గీ. కావలసిన వస్తువులను గడన చేసె, నంతను మ్మన్న చెప్పిన యట్టి నాఁటి
కఖిల బంధువర్గంబుతో నరుగుదెంచెఁ, బుత్రి నాపాసనోత్సవము నెఱవేర్ప. 26

గీ. అంత నాపాసనోత్సవమలరెనపుడు, బీదవాండ్రును గుంటులు వెఱ్ఱివాండ్రు
గుడ్డివాండ్రును బ్రాహ్మణుల్ గోరెటెల్లఁ, దీర నన్న ధనములచేఁ దృప్తులైరి.

—చాతృత్వచర్చ—

సీ. పాపనాచారులైన వర్తించుచును సదా పరలోకచింతతోఁ బరఁగుచుండు
వేదవేదాంత విద్విజులకిచ్చినసొమ్ము సత్పాత్రదానమైనసఫలమయ్యె
నితరజాతులవారికిడినసొమ్ము కరుణబలున్నద్ది యాటకేపనికివచ్చె
నాసన్న బంధుమిత్రాళికిచ్చినసొమ్ము కోటి గుణఫలంబు గూడఁబెట్టఁ
గీ. గాని యాకుంతి గుణమెఱుఁగక యితరులు
మెచ్చుకొనఁగోరి మాత్రమే యిచ్చుటనిది
రయితులను వేఁచి తెచ్చిన పయికమునుఁ
గలఫలంబెల్ల గంగలోఁ గలసిపోయె. 28

వ. వెనుక నాఁటిరాత్రి సుముహూర్తకాలంబున నవదంపతుల శరీరంబులు స్పృశింపఁజేయు పురోహితులనుజూచి సర్వజ్ఞుండను గురభిమానముగలయొక శుద్ధచ్ఛాందసుండిట్లనియె. 29

-సుముహూర్తసంవాదము-

గీ. సిగ్గులేకసభలయందు స్త్రీపురుషుల, తనువులిటుతాఁకఁజేయుటదగునె? యట్టి
లైనమంత్రాలలోనున్న యర్థమెల్ల, జరిపినారె? యిదొక్కటి జరుపనేల?

వ. అనఁగా నందొకఁడు పురోహితుండిట్లనియె. 31

క. మునుపటివారగు ముహూర్తం, బునకుఁగలయువారిపుడిది పొసఁగదుగానం
దనువులు తాఁకఁగఁజేయుటె, ఘనతర సుముహూర్తమని రికాలజ్ఞబుధుల్. 32

గీ. సాధ్యములసాధ్యములనుసకలకర్మములను బహువిధములుగా నలరుచుండుఁ
గాననిలనీతిబాహ్యము గానియట్టి, పనియె సరసమై సాధ్యమై తనరుచుండె.

వ. ఇంతమాత్రపుఁగర్మంబును జరుగనియెడల మంత్రార్థఫలము లభింపదు దీనిం జరుపనప్పుడు మంత్రములుగూడ నక్కఱయేలేదు. చచ్చుటివాండ్రవలెఁ గలయవచ్చును. అనఁగా నాశుద్ధశ్రోత్రియశిఖామణికి నోరాడకపోయెను, అనంతరమందా దంపతులను శయనగృహంబునకుఁ బంపిరి. 34

—శయనగృహాలంకారము—

సీ. రామకృష్ణాది సద్రాజవిగ్రహములఁ దనరారుచుండు నద్దముల చేత
నగరువత్తులు పూవులత్తరుల్ మొదలైన సద్వస్తు సంఘవాసనల చేత

గాజుకుప్పెలయందు ఘనకాంతిని వెలుంగు బహువిధ దివ్యదీపముల చేతఁ
దీయఁదనంబుచే దీపించు బహుఫలాహారవస్తు సముదాయముల చేత

గీ. మంగళస్వరూపిణులైన మానవతుల, చేతఁ దాంబూలవస్తుల చేత సంత
సమును జెందు పాటల చేత సరసరక్త, వస్త్రముల చేత నాయిల్లు పరఁగుచుండె.

వ. ఆయద్దంబులు దంపతులదృష్టికి సమీపమందుండుట చేతను, సుగంధద్రవ్యము లసంఖ్యాకములుగా నుండుట చేతను, దీపములు మధ్యమకాంతిగా నుండుట చేతను, ఫలహారవస్తులారోజునం జేయంబడి చీమలకవశముగా నట్లుంచఁబడుట చేతను, స్త్రీలు జారిణులుగాక పిల్లకాసంత కుంకుమబొట్టు వెట్టుకొన్న సతుల సంభూతలగుట చేతను, తాంబూలవస్తువులు నూతనసారము గలవగుట చేతను, పాటలు స్త్రీలచేఁగాక మంగళనాద్యములచేఁ బాడఁబడుట చేతను, వస్త్రములు చాకలియింటికి తెచ్చినవగుట చేతను, నధిక శుభప్రదములై యుండె. 37

గీ. అట్టియింటఁ దద్దంపతులలరుచుండ, నామహోత్సవమును జూచి యచ్చటి యొక
దాంభికాచారవంతుఁ డాడంబరమునఁ, బాపరాజును వీక్షించి పలికెనిట్లు.

—గృహాలంకారచర్చ—

గీ. ఈగృహంబునకింత సొంపేల? యింత, ధనము వెచ్చించి యీలాగుఁ బనులు సేయ
నేల? యని వెక్కిరింపఁగా నింత యెఱుఁగ, కుంటివేయని పాపరాజొప్పఁ బలికె.

కం. మనుజుఁడు సతిఁ గూడునపుడు, మనసా విగ్రహములపయి మఱలించిన నా
ఘనులను బోలిన సంతతి, జనియించును గాన నుండఁ జను నద్దంబుల్. 40

చ. తమవతికల్మషాలయము దానజనించెడు చెడ్డవాయువుల్
ఘనతరదీపికోష్ణమునఁ గల్గుచునుండెడు చెడ్డవాయువుల్
చనుటకు మోదమబ్బుటకు సారసుగంధపు వస్తులుండఁగాఁ
జను శుభచిత్తలౌ సతులు సచ్ఛుభవృద్ధికి నుండఁగాఁ వలెన్. 41

గీ. సూర్యుఁడుండమి చేత వస్తువులయందుఁ,
గలిగెడు జడత్వముచని ప్రకాశమొదవ
దానిచేత సంతోషమదనముగాఁగఁ
గొలఁది దీపములుండఁగా వలయునింట. 42

వ. మధురవస్తువులు వీర్యవృద్ధికరములును, సంతోషప్రదంబులును, సాత్త్వికాహారములును గనుక సత్వగుణ సంతాన లాభమునకై యీ ఫలాహారవస్తువులుండవలెను. 43

గీ. వస్త్రములును, దాంబూలముల్, పాటలును, ము
గమును గామంబు వృద్ధినొందఁగ నొనర్చుఁ
గాన శయనగృహంబులలోన నెపుడుఁ
దప్పకుండవలసిన పదార్థములివి. 44

క. ధనమును వెచ్చించుటయే, లని పలికితి రతిసమృద్ధమైయున్నది నూ
ధనముగనుక నిట్లువ్యయం, బు నొనర్తుము ; లేనివారు పోరీరీతిన్. 45

గీ. ఉన్నవాఁడుఁ జేయఁదగదనుచితపుఁబని ; లేనివాఁడు యథాశక్తిగా నుచితము
సేయవలయు; ఋణముసేసి చేయుటయును, వైదికత్యాగముఁదగ వెవ్వారికైన

క. అననతఁడా సద్వాక్కులు, వినిదట్టపుసిగ్గున వెలవెలఁబోవుచు నిం
కను వెక్కిరింపలేకతి, వినయంబునఁ జిత్తమ్మంచుఁ బ్రీతివహించెన్. 47

——యువతీజనసంభాషణము——

వ. అప్పుడు గర్భాధానగృహంబునం బలువిధంబులయిన ముచ్చటలు జరుగుచుండఁగా నచ్చటనున్న సంపూర్ణయౌవనలయిన కొందఱు స్త్రీలిట్లు సంభాషించుకొనిరి. 48

గీ. సీతమా! చూడుమీ! పెండ్లికూఁతుచర్య
తలనువంపను; సిగ్గును దాల్పదహహా!
యెంతరగడుదీరినదైన నిద్దిలోక
మని రవంతయైనను జడియంగవలదె? 49

గీ. అనఁగ నామె యిట్లనెనోసి యక్క! చదువు
కొన్న దానికిఁ దలవంచుకొనుటయేల?
సిగ్గుపడ నేల? కాలము చెడఁగవచ్చె
నిప్పుడెక్కడఁ జూచిన నిదియెరీతి. 50

గీ. అట్లుమాట్లాడుకొనుచుండ నన్నికార్యములును దీరఁగా బయటికిఁబోయి రెల్ల
వారుఁబెండ్లికూఁతురు లేచిత్వరగఁ ద్వరగఁ, దల్లియొద్దకుఁబోయెను దగుననంగ.

—పుల్లయ్యబుద్ధివిశేషము—

వ. అట్లుపోయిన మోహిని తిరిగివచ్చునప్పటికి మోదుగపువ్వువలె నతిసుకుమారుఁడగుటచేతను, నంతకుముందె రెండుజాములరాత్రియగుటచేతను, బుల్లయ్య యామృదుమనోహరమయిన పాన్పునం బరుండి నిద్రపోయెను. 52

క. వెనుకను మోహినియు గృహంబునకరుదెంచి బలుసిగ్గుపొందినసతియు
ట్లనుపుగఁదకుఁ జూచుఁ జివరకుఁ, దనిమిటినిదురించు వెతఁగి ప్రీతిఁగోలంగన్.

వ. ఒకచోటఁజేలచెఱంగును బఱచుకొని తానును నిద్రించె. ఇట్లు మొదటిదినంబు గడచె. అంత రెండవదినంబున రాత్రియందు. 54

క. మనసునఁదలఁచినయంతనె, మనుజునిసౌఖ్యంబుమాన్ప మంజులవేషం
బునుగొని వచ్చినయామో, హినిఁగని పుల్లయ్యభీతహృదయుండయ్యెన్. 55

గీ. అట్లువచ్చి కొంతవఱకు నర్తనంబొసి
విసిగిపీఁటపైఁగూర్చుండి వీణదీసి
శ్రుతులుసరిచేసి సంగతుల్ శోభిల్లు పద్య
ములుగఁ గల్యాణిపాయిఁ పలికి యతఁడు. 56

గీ. ఘనభుజంగభీతిప్రీతి కరపిచిత్ర,
షడ్జసుశ్రుతి తద్గాన సరళిసాంగ
కించి, కుయికుయ్యమనిచెవుల్ గింగురెత్తఁ
జేయునవ్వి వేశ్యా! కీఁగెలా? యనవచ్చ. 57

గీ. చిన్నదగపూని మఱికొంత సేపటులనె
పాటఁబాడి దానినిమాని వ్యాకరణము
పుచ్చుకొని సూత్రములు చదువఁగఁ వినియుతఁ
డిద్దిఁగోయబాసాయనె హీనమతిని. 58

గీ. అట్టులనుటకుఁ దనచిత్తమందుపగచి, యాతనిశుంఠగానెఱిఁగి తనంతవచ్చి
మనసులేకున్నఁదనచర్యలు టుపడఁగ, నెట్టెపుల్లయ్యతోఁగూడె వివిధరతుల.

వ. అట్లాకార్యము చేసికొని పెండ్లివారు బళ్ళారికిఁ బోయిరి. అంత నవమాసములు నిండుటయు నొకనాఁడు. 60

— మోహినీపుత్రోత్పత్తి. —

చ. ఘనతరరూపసంపదఁ బ్రకాశమునొందెడు నాకుఁ బుత్రునిం
గనియెను మోహినీరమణి గాఢముదంబునఁ బాపరాజులే
ఖనులిఖియించి పంపనధిక ప్రమదంబున నుమ్మనాడలా
దినమునకుంబిరా ననరుదెంచి శుభంబును దీర్చిరొప్పగన్. 61

గీ. ఎనిమిదవ నెలలోఁ బుట్టె నని మనసును
సమ్మతిపఱచుకొని వారు చని వెనుకన్ను
మూఁడవనెలలో వచ్చి యామోహినినిఁ గు
మారుఁదోడ్కొని చనిరి బళ్ళారిపురికి. 62

— మోహినీ గృహాధికారము. —

చ. అటుచనిరంత నాకుఁ నెల కత్తయుమామయుఁ జచ్చిపోయిర
క్కటకట! మోహినీరమణి కాలిప్రభావము చెప్పనేల? యం
తటఁ గడునేర్చి పుల్లయ యథావిధివారికిఁ గర్మమంతయుం
బటుమతిఁజేసె వెల్తిపడెవారలి కప్పటినుండి సంపదల్. 63

గీ. బుద్ధిచే విద్యచేఁ జాలఁ బొలిచియున్న,
దన్ని మంచిసెడ్డ లెఱిఁగి యున్నదింకఁ
దప్పుపని చేయునాయని తలఁచి దాని
కింటి సర్వాధికారము నిచ్చె మగఁడు.

గీ. అత్త మొదలైన వారులేరధికధనము, గలదు, కాలముకలి, విద్య కావ్యరచన 64
మగఁడు మాటదాఁటఁడు, సొగసుగలదట్టి, స్త్రీనడవడిక నెనింగించి చెప్పవలెనె?

— బళ్ళారిపుర నవసంఘసంస్కారసభ —

ఉ. అమానీశులు దామువూని సకలైకానంద సంధానులై
శ్రీమచ్ఛక్తిలిఖింప నిల్చిన పరశ్రేయోంశ భావంబులం
దామే దానినెఱుంగమిన్ లఘుమతిం దభ్యాసనచ్ఛేదులై
కామక్రోధముఖక్షణేహాసుఖకాంక్షాపక్షదక్షాత్ములై. 66

సీ. కంటికి నదరుగాఁగనఁబడ్డ దానినింబొందునుత్సాహంబు పొంగిపొరల
మోఁపరుచిమఱఁగి మానసివ్యాధికి మాలమూదిగవిందు మందుగాఁగ

బరిపూర్ణయౌవన బాలరండలదండ నుండ మెండగు నిచ్చ నిండియుండ
వర్ణాశ్రమాచార పద్ధతుల్ నెఱవేర్ప మత్తతాపైశాచ వృత్తిహత్త
గీ. సతుల స్వైర వృత్తియు, వర్ణసంకరంబు
మాఱుమనువు గట్టుకొనెనుట మానవలయును
వేదశాస్త్ర పురాణోక్త విమలనీతి
బద్ధవైరముగ నిజముఖ్య పద్ధతులుగ. 68

గీ. గూటిలోనున్న చిలుకను గోరిపండు, చూపి పట్టి పంజరమునఁ జొనుపునట్లు
మిమ్ము బాగుసేసెదమను మిషను బన్ని, మంచియిల్లాండ్రవీధుల నమ్మఁగఁజేయ

వ. కంకణము గట్టుకొనియున్న నిరంకుశ ప్రతిజ్ఞాధురంధరుల యొక్క మత్యవిశేషంబునం జేసి యీబళ్ళారిపురంబునందొకనాఁడు మహాఘనరమణీయాజమాన్య నవగతి సృష్టిరచనాయత్త ప్రతివిషయంబును, బ్రతివిషయానంతర ప్రకటిత కరతలకరాగ్ర పుటాస్ఫాలన చటులపటు రవనిమేషమాత్ర బధిరీభూత సభాసత్కర్ణపుట గ్రామంబును, దద్రామనాయక కలియుగ రావణాసుర జ్యేష్ఠభ్రాతృ పిచ్చిరాజ నిరంతర దురంతానంత ప్రోత్సాహ ప్రవర్తితంబును బ్రవర్తిత మహామతి మన్మథగలిభిరాయ ఖజ్జాఖోరు పండితప్రముఖ దోషజ్ఞ సంఘముఖ నిర్గతానర్గళ వేగ విభ్రాజదభ్ర స్రవంతీధారాపార వాగ్ధోరణీ కలితాతులితాచలితాలలితాతిఫలితానేకోపన్యాస విన్యాసంబును. సన్యాసవిహిత బహిస్స్నాత్రత్యాగ గార్హస్థ్య నియమిత కాంతా సంభోగసంఘటిత సకలాశ్రమధర్మ ప్రవేశంబునగు నొకసమాజ సమావేశంబు నిరంతరాయాత యాత నిరంతరాయాది నివేశంబుగా జరుపంబడియె. అందు మహామతి మొదట లేచి యిట్లు సెప్పె. 69

— జాతిభేదోపన్యాసము —

ఉ. ఆదిని సృష్టికాలమున నంతయు నొక్కటె జాతి; వెనుక నీ
భేదము గొందఱప్పుడుగల పెద్దలు చేసిరి; గాని యిప్పుడీ
భేదము వైరహేతువయి వేఁచుచునున్నది గాన నింక నా
యాదివిధంబుగానె జనులందఱునుండుట మంచి మార్గమౌ. 70

గీ. పురుషసూక్తములో విరాట్పురుషునంగ, ములుగఁ జెప్పఁబడినవి జాతులటుగాన
నావిరాట్పురుషశరీరమైన జగము, నందుమన మంగములమయి యుండవలయు.

వ. స్త్రీపురుషులుతప్ప వేఱుజాతిభేదములేదు. అందఱును విద్యాధికులు నైకమత్యసంపన్నులును గావలెను. చాకలి మంగలి మొదలైనవృత్తులిష్టమున్నవారు చేసికొనవచ్చును. లేనివారుమానవచ్చును. జంధెమువేసికొనుట, ముక్కుమూసికొని కూర్చుండుట మొదలయిన నిష్ప్రయోజనకృత్యములుమాని యెవరికిఁ దోఁచినట్లువారుండవచ్చును. 72

—సాంఘిక ధర్మచాంచల్యము—

సీ. ఆదికాలమునందు వేదముల్ ప్రబలించి యెల్లలోకంబుల నేల లేదె?
యావెనక మన్వాదులప్పటికొప్పగా వానిశాస్త్రములుగా వ్రాయలేదె?
తరువాత వ్యాసుఁడు నరులశక్తిఁ బట్టి బహుపురాణములుగా వ్రాయలేదె?
తరువాతఁ గొందఱు తత్కాలగతి విలోకించి కొన్నిటినిఁ దగ్గింపలేదె?
గీ. వెనుక నందఱు నాయన్నిటిని వహింప
నంతఁ గలివృద్ధి నొందఁగా నప్రయోజ
కులు పెరిఁగి వానినిం జెడఁ గొట్టుచుండఁ
దెలిసి శంకరుఁడు మఱల నిలుపలేదె? 73

వ. చిరకాలము నిలిచియున్న సంస్కరణము దోషయుక్తముగాకమానదు. కావునఁ గాలానుసారముగా మార్పులు గలుగుచుండుట తప్పదు. నేను జెప్పినట్లు మార్చుకొని, సర్వము బ్రహ్మస్వరూపము, జాతిభేదములేదు, అనుశంకరునివాక్యము నమ్మి మనము సుఖముపొందవచ్చును. అనియిట్లు జనన్యాంశముచే మహామతియయి సత్యమైన దారికివచ్చియు, జనకాంశముచే మహామతియై యపార్థమార్గానుద్రోక్తి యెన్నిమార్పులున్నను మహర్షులమతమునందు గమ్యస్థానమెప్పుడునునొక్కటేయనియుఁ దమమార్పులట్లుగాక దానిమూలచ్ఛేదము చేయునవియనియుఁ బ్రతిష్ఠాపేక్షచేఁ దెలియనేరక యాడినమాటలొకదారియుఁ జేయఁదలంచిన మార్పులొకదారియు, మనస్సంకల్పమొకదారియుంబట్టి చెదరిపోవుచుండఁగా బాహ్యసుఖానురాగాల్పజనానందకరంబుగా నుపన్యసించి యతండు కూర్చుండఁగా మన్మథుండు లేచి యిట్లుపన్యాసమిచ్చెను. 74

— స్త్రీపురుషధర్మోపన్యాసము —

గీ. పురుషులును స్త్రీలును శరీరమునుధరించి,
పుట్టిరిగనుక సమసౌఖ్యములు స్వతంత్ర
తయునుగలిగియుండవలె విద్యలను స్త్రీలు
చదువుటకొరకు సకలశాలలవలయు. 75

గీ. స్త్రీకివైధవ్యము నరులు దెచ్చిపెట్టి, నాయగాని దేవునిశాసనంబుగాదు
గానవిధవావివాహముల్ కరుణతోడఁ, జేసివారికిసౌఖ్యంబు సేయవలయు. 76

వ. దేవునిచేసృష్టింపఁబడిన పశుపక్షికీటకాది సకలప్రాణికోటులును స్వేచ్ఛగాఁది
రుగుచుండఁగా నొకక్క మనుష్యులకు మాత్రము జారత్వమనునది ? నావివరుసలన
నెవ్వి? కావుననందఱును స్వేచ్ఛగాఁదిరుగుచునిష్టప్రకారముండవచ్చును. అనియి
ట్లు ప్రత్యక్షమన్మథుఁడై ప్రత్యక్షముగా ననేకవిధఘోరగుణంబులుగల స్త్రీపురుష
వస్తువులొకక్కరీతిగా నుండుట యెట్లు దేవుని సంకల్పమైయుండునని విచా
రింపక స్త్రీలోలుఁడై గ్రామ్యధర్మానురాగాల్పజనానందకరంబుగా నుప
న్యసించి యతండు గూర్చుండఁగా నొకబాలవిద్యార్థి లేచి యిట్లుపన్యాస
మిచ్చెను. 77

— దారిద్ర్యధ్వంసకోపన్యాసము —

గీ. స్త్రీపురుషులయంగములెల్లఁజిన్నతనము, నందునందఱుఁజూచెద రందువల్లఁ
బెద్దలైనంతసిగ్గేల? విత్తమువ్యయ, పెట్టిగుడ్డగట్టుకొనుట విడువవలయు. 78

వ. అనదేశమును మహాభాగ్యవంతముగాఁ జేయునాసంస్కరణ విధానమునం
దఱును మెచ్చుకొనిరి. పిమ్మటనగ్రాసనాధిపతిలేచి ముందునపట్టణమంత
యు నీసంస్కరణమునకు లోఁబడునట్లు చేయవలెను. మాగఁదర్శకులయి బో
ధింపవలెను. అని- 79

— పిచ్చిరాజు వితరణము —

సీ. విధవావివాహముల్ వృద్ధిఁబొందుటకొరకు లచ్చరూపాయల నిచ్చివేసె
స్త్రీపాఠశాలలు చాలరేగుటకును ముప్పదియాఱువేల రూపాయలిచ్చె
సకలజాతులుగూడి చదివెడుబడులకు నఱువదివేల రూప్యములనిచ్చె
సంస్కారభరమూను సత్పండితాళికిఁ బండ్రెడువేలరూప్యములనిచ్చె

గీ. నంతఁ గరతాళముల తోడ నద్దివరిస
మాప్తమయ్యె సంస్కరణము మహితరీతిఁ
దనర నాయుమానములలోఁ దత్పురమును
గొత్తమార్గంబునకుఁ దిప్పుకొనిరి వారు. 80

—నవసంస్కరణ మహిమ—

వ. ఉత్తమవిద్యావిహీనుండైన పుల్లయ్యయు దానిలో నేచేరెను. రెండేండ్ల నాఁటి కాసంస్కరణము సంపూర్ణమహిమ గలదయ్యె. 81

ఉ. అందఱు బ్రాఁతకోఁతలను సొంతముగాఁ గనుఁగొన్నవారలే
యందఱుఁ జేతికృత్యములు యంత్రములుఁ నడిపించువారలే
యందఱుఁ గూర్మితోఁ గలసి యందముగా భుజియించువారలే
యందఱుఁ స్వేచ్ఛగాఁ దిరిగి హర్షము నొందెడు వారెయచ్చటన్. 82

గీ. ఇచ్చవచ్చినట్లుండని యుంతి, చదువు కొననిసుందరి. యుద్యోగమునొనరింప లేనియబల, తత్పురమునలేదుసుండు, సంస్కరణమిటుసాగి యొసంగుచుండె.

వ. వేదశాస్త్రములను నాశనముచేయఁ దలంచినను ప్రత్యక్షశాస్త్రములైన వైద్యజ్యోతిష కేరళసాముద్రికంబులు వృద్ధినొందుచుండెను. ఆసంస్కరణ మాయూరనేగాని యితర గ్రామములలో నంతగా వ్యాపింపలేదు. ఇట్లు రెండేండ్లు గడచునప్పటికిఁ బ్రజలెంతటి విద్యాబుద్ధిచాతుర్యముగల నాగరికులైనను భగవత్సంకల్పమునకు విరోధులగుటచే నొకనూతనశక్తి బయలుదేఱి సంఘమునకు లెక్కలేని ముప్పులు దెచ్చిపెట్టె. 84

—నవసంఘసంభ్రమము—

గీ. అందఱికి నన్నివృత్తుల యందును నధి
కారముండుటచేత నొకండు చేయు
పని మఱొకఁడు చేయుట వలన మొదటి
వాఁడు నష్టమొందవలసి వచ్చుచుండె. 85

గీ. జాతిధర్మములేమిచే సకలవృత్తు, లిష్టమున్నఁజేయుటలేని యొడలమాను టయుఁగలుగుటవలనఁగొన్ని క్రియలువినుట, కైనఁ బేరుత్రేక నశించెనాపురమున

గీ. చాకలియును మంగలియును స్వకులవృత్తి
విడిచి యుద్యోగవర్తక వృత్తులూను
కొనుటచేత గుడ్డలుతుకుకొనుట బుఱ్ఱ
గొఱుగుకొనుట తామె యొనర్చుకొనఁగవలసె. 86

గీ. మగని దైవముగా నెంచు మతము నాశ, మయ్యెఁ బైపెచ్చు స్త్రీస్వేచ్ఛ నాఁపువారు
మంటలవలనఁ జావును బొందుచుండి, రతివ రెండవ పెండ్లాడ నాజ్ఞయుంట.

గీ. పెండ్లియాడిన విధవలు వీఁడుగాక, యున్న మతియొకఁడగునని తిన్నగాన
మువనితలు భర్తలనధములవలెఁ జూచు, చుండి స్వేచ్ఛగాఁ దిరుగుచు నుండిరౌర!

గీ. స్త్రీలు వర్తకోద్యోగముల్ సేయఁబోవ
వంట మగవారె చేయంగ వలసివచ్చెఁ
జంటిపిల్లలు పాలు లేకింటఁ జావ
వలసివచ్చె సంసారఘోర రూపంబు కనుఁడు. 88

గీ. అందఱును వర్తకాసక్తులగుటవలన
స్త్రీలు నట్టులే పోవుటచేత నిండ్లు
పాడుపడుచుండె నెంత ద్రవ్యంబు దెచ్చు
కొన్నను మగవారిసుఖము సున్నయయ్యె. 89

క. చెప్పెడిదేమియు లేదిఁక, నొప్పగ నొకయింటఁ గుదిరి యొకనాఁడైనం
దప్పక యుండిన సుందరి, చెప్పుటకైనఁ గనఁబడదు చేటిఁకఁ గలదే. 90

సీ. విద్యార్థమట్లుంచి వృత్తియే పుట్టుక ఫలమనుకొనుటచేఁ బగలు పెరిఁగె
విగ్రహారాధన విడుచుటచే భక్తి యడుగంటె ద్రోహకృత్యములు హెచ్చెఁ
గామమార్గంబె ముఖ్యముగుటచేఁ గాంతిపస చెడి దేహదుర్బలత వచ్చెఁ
బశురతియే నీతిపథమౌట జబ్బులు బలిసియిఱువదేండ్ల బ్రతుకులయ్యెఁ

గీ. పరమనిష్ఠాగరిష్ఠత వలనఁ జిత్త
బలమునొందుట కలలోని వార్తయగుట
వలనఁ బరలోకసుఖహాని ప్రాప్తమయ్యె
నయ్యయో! యెంతమాహాత్ములైరి ప్రజలు. 91

వ. ఇట్లు మహామతి మన్మథధర్మోపాసకులయి నిద్రాహారమైథునంబుల కడ్డులే కుండఁ దిరుగుటచేఁ గ్రమముగాఁ జీవరకు బాలవాక్యము బ్రహ్మవాక్యము య్యె; అట్లు పరిణమించిన యవస్థంజూచుకొని యెంతగా వ్యధర్మ ప్రధాన సంసారులయిననుఁ, జంత్వితర సహజజ్ఞానాంకురమగు మనుష్యజన్మమగుటచేనం, దుఁబెద్దలయిన కొందఱు బుద్ధిమంతులు పశ్చాత్తాపపడియు మాయాకల్పితా హంకర్తృత్వమజ్ఞానాంధకారములోఁ బడఁద్రోయఁగాఁ జేసినపని మానిన యెడలఁ బౌరుషభంగమగునని స్వప్రయత్నపూర్వకముగా నట్లే కష్టపడు చుండిరి. 92

ఉ. ఆదిఁ దపస్స్వశక్తి ఋషులన్నియుఁ జక్కనెఱింగి వ్రాసిరా
వేదము; పిమ్మటన్ మెఱుఁగు పెట్టిరి ధీరులు కొద్దిమార్పుగా
నాదిమ కాలమానవకథావిధినిన్ సుకృతంబు గల్గునం
చేదొ పఠించునంతజడు లీకలివార విమార్పనర్హులా? 93

చ. జనపూజ్యాత్మ తపఃకళాసముతుఁడై సర్వేశ్వరాకర్షణం
బున భాసిల్లు ఘనుండు గాక; స్మృతులే పూర్ణంబుగాఁ జూడకే
డను దుష్పాత్రుఁడై మహాయశముకై డంబంబులం జూచు దు
ర్జనపూజ్యుం డెటు? సంఘసంస్కరణముల్ సల్పంగఁ జాలుం గలిన్. 94

—కుమతిచర్య—

గీ. స్త్రీల బడియందుఁ జదువును జెప్పుటకయి, కుదిరె మోహినీసుందరి; కుమతి దానిఁ
దెలిసి బాలురకుఁ జదువు దెల్పుటకయి, కుదిరి బళ్ళోరి కేతెంచెఁ గోర్కె మీఱ.

క. ఆకరణినిఁ జని మోహిని, నేకరతింగలసికొంచు నింపుననుండెన్
శ్రీకాకర మైసాహస, మేకాకరతీశురూపు నెసఁగుట మఱియున్. 95

ఉ. ఎన్నికవన్నెకన్నెఁ గని యెన్నియొ చిన్నెలు పన్ని, యన్న! నే
నన్న యనన్న, నన్ననలు సన్నిధిఁ గొన్న య విన్నఁ గన్నవా
రన్నలు విన్నఁదన్నఁ గల రన్న, నెవన్న నవన్ని యెన్న కా
యన్ను మ పెన్ను దన్ని రతి నన్నరునన్ను చినన్న కన్నగున్. 96

చ. సురసుర వైరి యుద్ధఘనశూరత, రావణసాహసంబు, భా
సురసురరాజరాజ నము, సూర్యమహేశ్వర తాపకోపముల్

నరవరదీర్ఘదుర్మదము, నారదనుస్నహాయుద్ధసృష్టి, వా
నరవరదుర్భరాజ్ఞ యివి నైజములా కుమతీహకాంక్షికిన్. 97

ఉ, పల్లవగాత్రులందుఁ బరభార్యలపై బలుప్రేమ, సర్వదా
పల్లవరాశిమిత్రత, యపాత్రమతాంతరసంకరేచ్ఛ, సం
పల్లవగర్వదుర్నయము, బ్రాహ్మణజాతివిరోధబుద్ధి పెం,
పల్లవయోషికార మివి యార్జితముల్ కుమతీహకాంక్షికిన్. 98

క. అత్తెఱఁగున మత్తతఁగాని, బోత్తిగఁజెడియొకట నాఁడు మోహినిగృహమం
ద త్తెరుణినిఁజిత్తజుపని, కెత్తుటఁగని పుల్లయమది నీగతివగచెన్. 99

—పుల్లయ్యవిచారము—

గీ. దేవుఁడా! భార్య పరునితోఁ దిరుగుచుండఁ
గాంచివచ్చినయట్లుండఁ గలఁడె? మనుజుఁ
డెంత కర్మముపట్టెనో యీశ్వరా! న
వీనగతిచేఁ బురుషులింతహీనులైరి. 100

గీ. ముందు సంభవించెడుపెద్ద ముప్పెఱుంగ, లేక పెద్దలపద్ధతుల్ లేశమాత్ర
మైనఁజర్చసేయక కీర్తినందఁగోరి, తెచ్చిపెట్టితిమీరీతి వచ్చెఁజేటు. 101

వ. ఇట్లుపలువిధంబుల వగచి కుమతియావలికిఁబోయిన తరువాత భార్యంజూచి
దీనతతోనిట్లనియె. 102

—మోహినీపుల్లయ్యసంవాదము—

క. లలనా! ననుహీనునిఁగాఁ, దలఁచుచుఁబరుఁగూడి యుంటధర్మంబగునే
బలుధనముపోసి నినుఁబెం, డిలియాడితిఁ గరుణలేదఁటే! నామీఁదన్. 103

క. అనఁగా నామోహిని యి, ట్లనియెన్ నాయిష్టమున్న యట్లేడ్బదనీ
మనసటుగాకుండిన నా, కనిమిషమైన నిటనుండఁ గను నాపూనికన్ 104

క. అనఁగావిని యాపుల్లయ, ధనముండుట వల్లఁదిరిగి తానువివాహం
బును జేసికొనఁగలననెడి, ఘనబుద్ధినిఁబొమ్మటంచు గట్టిగఁగసరెన్. 105

—మోహినిలేచిపోవుట—

వ. ఉల్లేపోయెదనని యదిబుద్ధిగలదానివలెఁ గొన్నిరోజులుండి యింటఁగలసరు

స్త్రవస్తు రూపకధనంబును మెల్లగాఁ గుమతికి నప్పగించి యొకనాఁటి రాత్రి వానిందీసికొని పంచమహాపాతకపట్టణంబు ప్రవేశించి కాఁపురమును జేయుచుండె. 106

క. ఈపగిదివానినిఁగలసి, కాఁపురమొనరింపఁ గొంతకాలము గడచెన్
శ్రీపతిదయ యట్లుండఁగఁ, గాఁపురుసుమతి కుమతియై యొకదినమున ధృక్.

—కుమతిద్రోహము—

గీ. మోహిని తలంటుకొనుచుండ మోదమంద
యింటఁగల ధనమును సంగ్రహించి యొక్క
చింకికోక నక్కడనుంచి శీఘ్రముగను
దననివాసపుఁ బట్టణంబునకుఁ బోయె. 108

—మోహినీ దుఃఖము—

గీ. అంత మోహిని నీళ్ళాడి యయ్యవార్లు
గారి నట్టిల్లులాగున బారుమనుచు
నున్న యింటినిఁ గని నగలున్న పెట్టె
వెదకి కొనక దుఃఖానఁ జదికిలఁబడె. 109

గీ. అట్లుపడికొంత సేపేడ్చి యద్దుకుమతి, పనిరామయనియెంచి యాటనున్న పాడుకోక
గట్టుకొనితల్లితండ్రులం గట్టుకొన్న, మగనినిఁదలంచుకొనియిట్లుమిగులవగచె.

క. అమ్మా! మిముబాసితిదై, వమ్మాగఁజూడఁదగు మగనిఁబాసితి, నిటుగ
ష్టమ్ములపాలైపోతిని, నెమ్మదిలేదంత సుఖము నిప్పులఁబడియెన్. 111

గీ. అనుచు మిక్కిలి దుఃఖించి యంత నిట్లు
దలఁచె దైవము దిట్టుట తగునె నాకుఁ
బందువంటి కాఁపురమును వదలి లేచి
వచ్చినట్టి లంజవిధవ బాగుపడునె? 112

—స్త్రీస్వాతంత్ర్యచర్చ—

క. పూతగృహిణినైసకల, స్వాతంత్ర్యముతో సుఖపడఁజాలక యిదియే
స్వాతంత్ర్యంబనుకొనియీ, రీతింజెలరేఁగితినిఁక రెచ్చందగునే? 113

గీ. పైకిఁబోయి దాసుని వలెఁ బాటుపడి ధ
నమ్ముఁ దెచ్చుటే పురుషకర్మమ్ము గాని
తక్కినట్టి పెత్తనమెల్లఁ దరుణిదె, జగ
మంతయును నాఁడు దానిచే నణఁగి యుండె. 114

గీ. ఈ నిరంకుశస్వాతంత్ర్యమేమియగునో, యని మహాత్ములు కరుణతో "నాఁడుదింట నుండవలెఁ బరపురుషునియొద్ద కేగరా" దనుచు ధర్మశాస్త్రముల్ వ్రాసినారు.

వ. నరకాసురునితో యుద్ధముచేసిన సత్యభామ మొదలైనవారి చరిత్రలవల్లఁ బూర్వకాలంబున స్త్రీలకు గోషాలేదనియును, మహమ్మదీయులకు జడిసి మనవారిది యేర్పాటుచేసిరనియు, దీనివల్ల స్త్రీలభివృద్ధి లేకయున్నారనియు, నిదివఱలోఁ బోరాడితిమి. కాలి గోరైనను గనఁబడనీయని మహమ్మదీయ స్త్రీలెవరిభయముచే గోషా నేర్చుకొనిరో? మునివేషముతో వచ్చినప్పుడు పూజించి, తన్నొందఁ గోరినప్పుడు తృణముగాఁ జూచి సీత రావణుని దిరస్కరించినది. పరపురుషుఁడనఁగా మర్యాదకు శత్రుపురుషుఁడనుట. జ్ఞానప్రధానమయిన పూర్వమున నుత్తమస్త్రీలకు దేనివల్లను భయము లేకుండెడునది. కాముప్రధానలైన యిప్పటిస్త్రీలకీ శిక్ష లేనియెడల నిప్పుడే ప్రళయము వచ్చును. ధర్మశాస్త్ర నియమమెప్పుడు నొకటియే. శాస్త్రములు వస్తుతత్వమును బట్టి జ్ఞానభంగము గాకుండునట్లు వ్రాయఁబడినవి. కట్టుబాఁటు తగ్గిన మధ్యకాలమున శిక్షలధికమయినవి. ఇది మిక్కిలి క్షేమకరము. 116

గీ. ఎంత చదువుకొన్నను నాఁడుదింటఁ గుదిరి
యుండనియెడల మర్యాద యుంటసున్న
అకట! తుచ్ఛకామమె మోక్షమనుకొను నర
మాతృలిట్లు నామర్యాద మాసినారు. 117

— మోహినీమహాదశ —

వ. అని మిక్కిలి విచారించి స్వానుభవమువలనం బుట్టిన విరక్తి యతిశయింపఁగా నొక్కసారె సకలసంకల్ప సన్యాసము చేసి, కాషాయవస్త్రంబులు దాల్చి "అహింసా పరమోధర్మః" అను మహర్షిశాసనమును లెస్సగా విమర్శించి కొందఱు మునులు చేసినట్లు బీజములువిడిచి ఫలములుదినుచు జీవయాత్రగడ

పుటక నిశ్చయించుకొని మాంసాదులను విడిచి శాకములు దినుమనుట, క్రమముగా ఫలభక్షణమును, వాయుభక్షణమును, సదాయోగయుక్త నిరాహారత్వమును సిద్ధించుటకేయని యెఱిఁగి, తన్నజ్ఞానాంధకారములోఁ బడద్రోసిన వారినే కామక్రోధాదికములుగా నెంచి జయోచ్ఛ్రితో ధ్వజమెత్తి, యామోహిని పరిపూర్ణబ్రహ్మజ్ఞాన రసప్రవాహినియై, మనస్సులు కరంగునట్లుపన్యాసము లిచ్చి స్త్రీపురుషులను జ్ఞానప్రదమునిమతాభిలాషులనుజేయును నేఁటనంబు సేయుచుండె. నకక్రీడబట్టోరిపురంబునం బుల్లయ్యాయును 118

—పుల్లయ్యాదుర్దశ—

క. ఒకముండనుంచుకొని తన, సకలధనము దానికిచ్చి సంతతమును దానికిదానుండైయుండెను, అకటా! చెడు దానిఁ బెండ్లియాడందగునే ? 119

మ. గతధీమోహిని లేచిపోయినపయిన్ ఖద్యోతదీపప్రభా
తతఝుల్లీరవగానలోలదృఢలూతాతంతుడోలాసుఖ
స్థితమూషీకిచకిచిక్రిచోత్సరిపతద్భీమత్సరోష్ట్రీగణా
ద్భుతగంధైక్యచుచుందరీగతిగనెం బుల్లయ్యయి ల్లయ్యయో. 120

—నవసంఘసంస్కారపునస్సభ—

గీ. అంతనవసంఘసంస్కరణాధికారు, లెల్లజనులలోఁ బుట్టిన హీనదశను దీసివేయుటక్కై యొకదినమునందు, సభను గావించిరతిరహస్యంబుగాను.

గీ. అప్పుడామహామతిలేచి యనియెనిట్లు, మనముచేసినపద్ధతి మహిమయెఱుఁగలేకమానవులు నుబుద్ధిలేకపాడు, మార్గములుద్రొక్కిరిపుడవిమాన్పవలయు.

గీ. మంగలిపనిని నందఱుమానుకొన్న, యెడలవ్యవహారము జరుగుటెట్లు ? గాన దానినెఱవేర్పఁగొందఱుపూనవలయు, ననియతండుండ మన్మథుండనియెనిట్లు.

గీ. స్త్రీలు వంటసేయకయుంటచేఁ బురుషులు
కష్టపడుచుండి రింకనాకార్య మాఁడు
వారిఁ జేయింపనొకయధికారియుండి
చక్కఁగాలోటురాకుండ జరుపవలయు. 124

వ. తరువాతసభాపతియయిన పిచ్చిరాజు లేచి మొదటమీరే యీసంస్కరణము

చేసితిరిగనుక యీకార్యములును మీరేచేసి లోకమునకుఁ జూపవలెను, అనఁ గానత్యంతము పట్టుదలగల యామహామతిమన్మథులు నడుములు బిగించిబయ లుదేఱిరి.

—మహామతి మన్మథనీచదశ—

గీ. అటుబయలుదేఱి కొందఱి నట్లులంచుఁ, డని విధింపఁగవారు మేమట్లులుండ
మనఁగ విసిగి మహామతి యాలుఁదాను, బిల్లలును బుట్టగొంటె నెడువృత్తిగొనిరి

గీ. మన్మథుఁడునట్లు బోధించి మార్పలేక, భార్యయును దానుఁబిల్లలు వంటపనులు
చేయుచుండికొందఱికట్లు చేయుఁడంచుఁ, జెప్పుచునటులుండిర దెంత చేటొ గాని.

వ. ఇట్లువారు పూర్వప్రారబ్ధము చే నీచులయి వృత్తిచేజాతిభేదముపోఁగొట్టఁజాలక మహర్షిమతమునకు వన్నె దెచ్చుచుండిరి. భగవత్సంకల్పమయి లోకవ్యవహారోపయోగమయిన జాతిభేదమును మనుష్యమాత్రులెట్లు తగ్గింపఁగలరు ? ఎంతటి బుద్ధిశాలులకయినను దుర్వృత్తితగదు. లోకములో నన్నదమ్ములును, దండ్రికొడుకులు ననేకులు బద్ధవైరులయియుండఁగా బ్రాహ్మణులునుదురకలును మిత్రులైయుండగ నొకకుండలోని కూడునుదినినంగాని, జందెము త్రెంచుకొని మాలదానికూఁతును బెండ్లాడినంగాని యైకమత్యము కుదురదనుట యేటినాగరికత ? ద్రోహబుద్ధిలేక " పరోపకారార్థమిదంశరీర " మ్మను మహర్షివాక్యమును బరిపాలించుటయేగదా! యైకమత్యము. మందబుద్ధులయి కొండత్రవ్వియెలుకను బట్టుచున్నారుగదా! అయ్యయో ! కీర్తిపయియాశ యెంత పొరపెట్టుచున్నది ! పాపరజుసంతతియిట్లుపాడయ్యెను. 128

చ. వ్రతమును జేయునప్డుఁ, గల వారలసంతతసపెట్టునప్పుడుఁ
నతిరతిసేయునప్డు వరసంతతిపై మదిలేకపాపరా
జితరులమెప్పుఁగోరి యొకయిచ్చనె గల్గుటచేతనట్టి సం
తతిజనియించె ; భార్యగుఱిదప్పమినెట్టి యంశంబునొగనె. 129

క. "ధనమును, విద్యయు,వంశం, బును, దుర్మదులకుమదంబుపొనరించును ;స
జ్జనులైనవారికడఁకువ, యును వినయము నివియెతెచ్చు నుర్వీనాథా." 130

చ. అనువిభుధోక్తిచేమగలు నాండ్రెవరేనురువిద్యనేర్చినం
తనె దివి యేలరాదు; తలిదండ్రులు పిన్నటనాఁట నేర్పనే

ర్పును, సహవాసమున్ వికృతిఁ బొందిననింద్రుని యందహల్యయం
దనుపమమార్గదర్శకత నాఁపుదురింద్రియ దుర్భరాజ్ఞులై. 128

క. కనుకన్మోహిని చరితం, బును, దత్సోదరచరితను బుద్ధింగనియై
ననుదపుపిల్లలనయపథ, మునుగొనఁ జదివింత్రుగాత భువినిమ్మనుష్యుల్. 129

—సుమతీపాపరాజువిచారము—

క. ఈరీతిగఁ దనసంతతి, క్రూరాత్ములఁ గూడి బాగు గోల్పోవన్ వి
స్తారానర్థము లొందిన, వారగుటను నాలకించి బహుదుఃఖితుఁడై. 130

గీ. పాపరాజాచరిత్రము భార్యతోడఁ, జెప్పవినియామె తాఁగొంతసేపు కొయ్య
వలెనిలువఁబడి కొండపైఁ బడ్డయట్లు, క్రిందఁబడి దుఃఖసాగర మందుమునిఁగె.

గీ. ఇట్లుపెక్కొంతసేపటి కెట్లొతెలివి, దెచ్చుకొని మగనింజూచి తెంపులేని
దుఃఖమునుబొందుచుఁ బలుకు తొట్రుపడఁగ, పారదీనతతోనిట్లు పలికెనపుడు.

క. నాపలుకులాదరింపక, నాపుత్రీపుత్రకులను నడిపితివి మహా
పాపపుమార్గంబున నా, పాపమె యిటు పరిణమించి భంగముదెచ్చెన్. 133

క. అనఁగా వినియాతండి, ట్లని కడునేడ్వంగఁదొడఁగె నతివా! నేనా
దిని మిక్కిలియపరాధం, బును జేసితి దాన నింత పుట్టెమునింగెన్. 134

వ. నన్నేమియు నిందింపకుము. నేను మహాపాపాత్ముఁడను. అని యేడ్చుచుండఁగాఁ
గొంతశాంతించి సుమతియిట్లనియె. 135

గీ. కొఱవితోఁ నెత్తినిగోఁకు కొన్నయట్లు, మనము చేసికొన్నపనికి మనమె వగవఁ
వలదు చూచినచోఁ బెద్దవారుమనల, దూఱుదురు మానుకొనుమింక దుఃఖపడుట.

క. అనఁగా వినియాతండి, ట్లనియెన్ మనకర్మమిట్టులైయుండంగన్
మనమెయ్యది చేయఁగలము ?, మనుజునియత్నంబు విధిని మాన్పంగలదే. 137

గీ. అనఁగనామె యిట్టులనియె నాదియందె, యిట్టివేదాంతమునుబూని యేనుజెప్పి
నట్లుచేసినచో నింత యగునె ? యిప్డు, వచ్చెనే మెట్టవేదాంతపంథనాథ. 138

వ. ఇట్లు కొంతసేపు విచారించి యుత్తమవిద్యాబలముగలవారగుటచేతఁ గడచినదానికి
వగవంబనిలేదని మహావైరాగ్యము ధరించి యూరుకొనిరి. 139

—సుమతి ప్రాయోపవేశము.—

చ. ఇట్టులొక కొన్ని వాసరము లేగఁగనొక్కదినాన నామెమి
క్కుటపుగు చింతచిత్తమును గాఢతరంబుగ బాధవెట్ట నొ

కర్కటశయనించి భర్తృపదకంజములన్ మదినుంచి ముందుఁ బ్రా
కటముగ దైవసన్నిధిని గల్పనచేసి నుతించెఁ దానిటుల్. 140

—నారాయణస్మరణ.—

మ. హరి! నారాయణ! పాపసంహరణ! భక్తాధీన! లోకేశ్వరా
హరధాత్రీంద్రముఖామరాళిమకుట ప్రాంచద్బృహన్నీలభం
భరవిభ్రాజిత పాదపంకజ! జగద్బాధాకరేంద్రారిభీ
కరదంతావళసింహ! నీకిదె నమస్కారంబు ముక్తిప్రదా. 141

మ. లలితశ్రీకమలోజ్జ్వలత్కువలయాలంకారకామోదదా
మలభాస్వజ్జలజాతనేత్రయుగళా! మత్తారిచిత్తార్తిదు
శ్చలనప్రాపకఘోరశస్త్రమునినిశ్చాంచల్యసంధాన స
త్కలశబ్దాంచితకంబుమంగళకరా! కైకొమ్ము నామ్రొక్కులే. 142

మ. వరవర్ణాశ్రమనిర్ణయార్ణవసమాపారోరుసారక్రియా
కరణప్రోజ్జితేంద్రియాగతహృదేకస్థైర్యలబ్ధాఖిలే
శ్వరభక్తప్రతిపాదిత ప్రథిత సుజ్ఞానాత్తనిత్యామృతే
శ్వరతుల్యర్షిమనోంబుజాతనివేశా! శ్రీశ! మ్రొక్కఁగొనవే! 143

క. పుట్టితిసజ్జనగృహమునఁ, బెట్టితిఁ బాదంబులతిపవిత్రములయియుండఁ
గొట్టితి నఘసంచారముఁ, బట్టితి భర్తృవ్రతంబు వైకుంఠేశా! 144

క. ఇప్పుడు కర్మవశంబునఁ, జెప్పుటకుఁ దరంబుగాని చేటులనుంటిన్
దప్పక నీసన్నిధికిం, గొప్పదయం జేర్పుమింక గోవింద! హరీ! 145

—సుమతి మోక్షప్రాప్తి.—

గీ. అని సమస్తవాయువులంతరాత్మయందుఁ, జేర్చి బ్రహ్మపదంబును జెందెనామె
యహహ! భీష్మునిరీతిగా; నామెమనసు, బలముయోగులకైనను బట్టువడునె?

—పాపరాజుదుఃఖము.—

వ. అంత దివాణమునకుఁ బోయిన పాపరాజింటికి వచ్చి భార్యసంచారము గానక వె
దకుచు నామెయున్న గృహములోనికివచ్చి తనకుఁ దటస్థించిన యవస్థను దెలిసి
కొని మహాదుఃఖసముద్రంబునమునింగి మూర్ఛాక్రాంతుండై భూమిమీఁదఁ బడియె.

గీ. అట్లు పడికొంతసేపటి కల్లనల్ల, దెలివినొంది లేచి మిగుల ఖేదుఁడయ్యు
దుఃఖమాఁపలేక కనులు దుడుచుకొనుచు, నామెపైఁబడి యీలాగు ననుచు వగచె.

క. కాంతా ! చింతాక్రాంత, స్వాంతుని ననుఁ జేసి పరమపదమొందితివే
యింతగుననిరోయఁగను నీ, చెంతంబడి నేనువత్తుఁ జేకొనిపోవే. 139

గీ. సుమతి సుమతి యనిజనులు స్తుతులుసేయఁ, గొండనెక్కినయట్లు కులుకుచుంటి
సుమతి నేఁటితో నాయింట సున్నమయ్యె, నేఁబుడమినిఁకఁ బ్రాణాలనెట్లుదాల్తు.

గీ. కొడుకువలెఁ జూచిననుఁ బెంచుకొంటివధిపు, భంగిఁ జూచిసహాయము పడుచునుంటి
వెంతకోపమేనొందిన నంతశాంత, మొందుచుందువేనింక నెట్లోర్వఁగలనె. 151

వ. ఇట్లు పలువిధంబుల దుఃఖించుచుండఁగా నావార్తను విని యాయూరంగల సకల
స్త్రీపురుషులును వచ్చి యామెను సమీపించి తమకుఁ దోఁచినట్లు విలపించిరి. అం
దుబీదవారిట్లేడ్చిరి. 152

— పౌరజనవిచారము. —

గీ. తల్లి ! కష్టకాలమున నోదార్చి యాద, రించియన్నముపెట్టి పోషించినావు
బ్రతుకుచుంటిమి నీపేరు పాడుకొనుచు, నింకమమ్మాదరించు వారెవరు ? తల్లి

గీ. భర్తతోడఁ గాట్లాడి నేఁ బైకిలేచి, పోవుచుండఁగా సుజ్ఞాన బోధచేసి
కాఁపురమునిల్పితివి తల్లి ! కడచిపోతె!, యనుచునొక కాంతకడు దుఃఖమందెనపుడు.

గీ. ఇంకనీయూరు పసపోయె నిట్టి స్త్రీని, నెక్కడను జూడఁబోమింక నెంతయూరు
వెంతరూప మెంతసుబుద్ధి యెంతవిద్య, యని పతివ్రతలువగచి రధికముగను.

గీ. పాపరాజెంత విస్తార పాపరాజ, యినను నింటికిఁ బేరుదెచ్చినది యామె
గాదె ? భూసరస్వతి నేఁడు గడచిపోయె, ననుచుఁ బండితులువగచి రధికముగను

గీ. ఆలకించినారే ! మునులార ! "బ్రతికి, చచ్చినట్టులుండవలెను జచ్చిబ్రతికి
నట్టులుండవలె" ననుభవ్యతరనీతి, సుమతియందువర్తించిబల్ శోభగాంచె. 157

వ. ఇట్లు తమతమయిష్టప్రకారంబుల వగచి పౌరులు పోయినవెనుక మూఢరాజువచ్చి
పాపరాజుంజూచి యిట్లనియె. 158

క. మంత్రీ ! దుఃఖింపకుమీ, తంత్రములన్నియునుగూడ దైవకృతంబుల్
జంత్రపుబొమ్మలు నరులు స్వ, తంత్రతయొద్దాన లేదు ధరనెవ్వరికిన్. 159

—ఆశ్వాసాంతము.—

వ. అనియోదార్చి యారాజుకోటకుఁ బోయిన వెనుకఁ బాపరాజు ప్రేమాతిశయంబు
నం జేసి భార్యకుఁ బైతృకక్రియలన్నియును యథావిధిగా నెఱవేర్చి దుఃఖముని

డిచి వైరాగ్యము ధరించి యొకవంటలక్క నుంచుకొని ఖడ్గచ్ఛేదిత సకలశాఖంబైన వృక్షమువలె నొక్కరుండై జీవయాత్రగడపుచుండెను. 160

—ఖడ్గబంధము.—

క. ఘోరసురపరవ్రజహర !, సారసభవవాసవేశ సన్నుతరామా !
మారసహసిసమాకృతి ! సారసనేత్రా ! మహాఘసంఘవిరామా. 161

—గద్యము.—

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, మత్స్యసంతానక్షీరపారావారా
త్రిపుత్రవేంకయ్యార్య ద్వితీయపుత్ర, బాపన్నార్యపౌత్ర, చినసర్వయ్యా
ర్యైకాదశాబ్దపోషితపుత్ర, సీతయ్యార్యస్వీకృతపుత్ర, సకలజన
కారుణ్యకటాక్షపాత్ర, సీతారామచంద్ర పరబ్రహ్మార్పిత
సకలకర్మ, సూర్యనారాయణమూర్తిశర్మ ప్రణీ
తంబై, యపూర్వాద్భుత చరిత్రయగు
స క లా నం ద నా మ క
నవీన ప్రబంధమునందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

సూర్యనారాయణమూర్తీయము.

# సకలానందము.



## పంచమాశ్వాసము.

క. శ్రీమద్గయ రావణనా, మామిత్రుని ముక్తికంపి యపకారికి మే
లౌ మేలుచేసి లోక, స్తోమమునకు నీతిరీతిఁ జూపిన రామా. 1

వ. దేవా! దివ్యచిత్తంబున నవధరింపుమట్లు చెప్పఁగా విని యవ్వలికథఁ జెప్పుమని యడిగిన శౌనకాదులకు సూతుండిట్లనియె. 2

— పాపరాజమూఢరాజభాషణము —

గీ. ఆవిధంబుననుండుచు నాతఁడొకట, దినమున దివాణమునకేగి దివ్యవిభవ
రమ్యుఁడై విరాజిలు మూఢరాజునుగని, హీనకంఠస్వరంబుతో నిట్టులనియె. 3

క. చిరకాలమునుండి భవ, చ్చరణ సమీపముననుండి దాసత్వముచేఁ
బరమముదము మీకిడి యే, కరుణాపూర్ణత్వమున సుఖంబునుగంటిన్. 4

గీ. కాలవశముచే నిపుడు నా కాఁపురంబు, సకలవిధముల హీనదశను వహించెఁ
గష్టజన్ముఁడనై యుంటి గడనచేసి, యింకనెవరికిఁ బెట్టుదు? ఈశ! నేను. 5

వ. కావున నింతనుండి యుద్యోగము మానుకొనఁదలఁచుకొంటిని సెలవిచ్చినయెడలఁ బోయెదననఁగా మూఢరాజిట్లనియె. 6

గీ. అఖిలరాజ్యభారంబు నీయందుఁ బెట్టి, యేవిధమగు చింతయులేక యెల్ల సౌఖ్య
ములను బొందుచుంటిని నీవు తొలఁగిపోదు, వన్న నా మనసునకిష్టమగునె? మంత్రి.

క. ఇప్పుడు నినుఁగని దేనినిఁ, జెప్పుటకును మనసు సాహసింపక యుండెం
దప్పక యింక నీయిష్టము, చొప్పునఁ జేయుమెపుడు మముఁ జూడుము దయతోన్.

వ. మఱొకవిన్నపమాలకింపుము. 9

— కృతిసంతానమహిమ —

క. "తనకీర్తియెంత కాలము, వినఁబడు నిజ్జగమునందు వెలయఁగ నందాఁ
కను బుణ్యలోకసౌఖ్యం, బున నెంతయు నుల్లసిల్లుఁ బురుషుండనఘా" 10

కం. అను భారతోక్తిఁ బ్రతినరుఁ, డును బరలోకమున సుఖపడుటకై ధర్మం
బునతిక్రమింపక యశం, బును సంపాదించుకొనుట ముఖ్యంబగదా. 11

సీ. దానికిఁ జెఱువు, నిధి, ప్రబంధంబు, తోఁట
యగ్రహారము, దేవాలయంబు, మంచి
తనయుఁడును నేడు సప్తసంతానములను
దగిన యాధారములని శాస్త్రములఁ గలదు. 12

గీ. వానియందుఁ జెఱువు మొదలైన యేడుఁ
గొంత కాలము వఱకును గొన్ని చోట్ల
లందెఁ గీర్తిని నిల్పుఁ బ్రబంధ మన్నచోటు
లందు బ్రహ్మకల్పము దాఁక నలరుచుండి. 13

గీ. కవికిఁ దన నాయకునకును, గావలసిన,
ద్రవ్యమిడి యచ్చువేయించి ప్రచురపఱిచి
నట్టివానికి, మఱితనయందు వ్రాయఁ
బడ్డయందఱికిని గీర్తి ప్రబలఁజేయు. 14

గీ. అట్లుగావున నిపుడు మా యాశ్రయంబు
మానుకొనుచుంటివి కవివిగాన నొక్క
కృతిని మాకిచ్చి మముఁ గృతార్థతను బొందఁ
జేయుమిదె నీవు మాకిఁకం జేయు మేలు. 15

గీ. అనఁగఁ బాపరాజట్టులే యొనరుతునని, సెలవు పుచ్చుకొని గృహముఁ జేరి యన్ని
చింతలు విడిచి కృతి నిరచింప నెంచి, దాని మార్గమల్లుచునుండె మానసమున. 16

వ. మూఢరాజునొకనికి మంత్రిత్వమిచ్చి యతని శత్రువులు కొందఱితండు రాజ
ద్రోహియని యప్పటప్పటఁ దనతోఁ జెప్పటను విని గడియకొక మంత్రి నె
క్కుడ మార్చుచుండునని స్వయముగా రాజ్యతంత్రములు చూచుకొనుట ప్రా
రంభించి పాపరాజు కాలములోఁ బరమానందయ్యగారి శిష్యుల కథలు విను న
ప్పటియానందముం బొందిన తానా నవీన మంత్రికాలములోఁ ధాఁపుఁ జెవులగు
ర్తి కనఁబడకుండునప్పటి తొట్రుపాటొందుచుండెనంత. 17

— పాపరాజకృతిమాహాత్మ్యము —

క. తనవృత్తికిఁ దగుమార్గం, బున నొకఁడు కృతినిరచించి మూఢాధిపునా
ఘునిఁజేసి పాపరాజొక, దినమునవినిపించె దాని తీరెల్లసభకున్. 18

క. అది పూర్వోదితరీతినిఁ, బాదలు చుఁదనుఁ గనుకవుల కపూర్వాద్భుతముల్
మదిలోఁబుట్టఁగఁజేయుచు, నిదియిట్లనరానిరీతి నెసఁగుచునుండెన్. 19

వ. మఱియుం గతేఁ కభినవనన్నయభట్టారకుం డను పేరుగల్గింపనోయన నంతయు భారతప్రయోగ వ్యతిరేకమై, లఘ్వలఘు రేఫ యతిప్రాసంబును, అనభేద ర, ల, ల, డ, ద, డ యతిప్రాసంబును అనిత్యసమాస కవివరాన మ్మతపదాఖండయతియు, నిందుగ్యతియు, వమయతియు స్వార్థేకార తత్సమాదిసంధియు సిష్టాక్షరసంశ్లేషంబును, విషమాక్షర శతసహస్రంబును, నవీన నామవృత్తశంఖంబునునయి వెలింగిపోవుచుండె మఱియును. 20

— క్రొత్తపాకములు —

సీ. గ్రిచ్చకాయపాకంబు, టెంకాయపువ్వు
పాకము, పెంకుపాకము, పడవమునుఁగు
పాక, ముప్పైనపాకము, బాడిపాక,
ముదుకుతారుపాకంబు జానొప్పమఱియు. 21

గీ. దిస్టిపిడతపాకంబును, దేలుకాటు, పాక, మగ్గిపాకము, మేడిపండుపాక,
మాదిగాఁగలయద్భుత మైనపాక, తతులనేకముల్ గలవు తద్గ్రంథమందు. 22

— పాకశుద్ధి —

సీ. ఇందుఁగలగద్యపద్యము లెవ్వివిన్న, గ్రిచ్చకంపనెత్తిఁదగిల్చి గట్టిగాను
లాగినట్లుండు ఘోరప్రక్రియమువచ్చి, నట్టులుండు సమాసవాక్యమునువిన్న

— పాకసారస్యము —

గీ. ఇంకవేమాటలవియేల? యింతవఱకుఁ, గలయలంకారశాస్త్రాన వెలయుదోష
భాగమందు నిందలిదోష భాగముంచి, వేయిరెట్లుపెద్దదిగాఁగఁ జేయవచ్చు.

క. కనులను నులుపుకొనుచు రా, త్రిని నఱమేల్కొనినవాఁడు తెలియక స్తంభం
బును దలఁచాఁకినకాలం, బునఁ గలసారస్యముండెఁ బూర్తిగదానన్. 25

—ఆంధ్రభాషాప్రారబ్ధము—

చ. చెలువుగ బ్రహ్మసూత్రములు చేసినవ్యాసునకున్ విరోధియై
తొలుతను వేషముం జెఱిపి దుష్టమతంబును దాల్చెఁ బిమ్మటన్
నలువుగ నాంధ్రసూత్రములొనర్చిన నన్నయకున్ విరోధియై
తెలుఁగును బాధచేసె నిది తెల్పియె ? యార్యులమన్నవారికిన్. 26

గీ. కొల్లదఱీ పాపరాజానుగుణముగాను
దెలుఁగుగతి యిట్టిదే యని పలుకకుండు
రట్టులైన సంస్కృతభాష యట్టులిదియు
నుత్తమనియమముగలదై యుండుఁ జెపుము ? 27

క. ప్రకటశిలానిభశబ్ద, ప్రకరానురనారికేళపాకశ్రీయో
ప్రకృతియయి యీదినంబుల, సకలానందంబుగాక చనుకృతికృతియే ? 28

వ. విద్యాగంధశూన్యులయిన మూఢరాజన భాసదులందఱును, బుద్ధిప్రదప్రాయ
మయిన శించు స్వభావముగల యాకావ్యచమత్కారమును వేయినోళ్ళఁ బొగ
డిరి. పిదప మూఢరాజువలన ననేకబహుమానములొంది పాపరాజింటికిఁ బో
యి సుఖంబుగానుండెను. 29

—మూఢరాజమరణము—

గీ. అట్లు కొండేఁడులుగడచె నంతశత్రు, భూపతులు సేనతోవచ్చి మూఢరాజు
సకలబంధువర్గంబుతోఁ జంపి రాజ్య, మాక్రమించిరి తత్కృతినందుకొనుట.

—నరకృతిప్రశంస—

క. అనవిని శౌనకుఁడిట్లని, యెను గృతిఁబొందిన నరవరు లిహపరసుఖముల్
గనియెదరని కవిసత్తము, లనుదురు నీవేలయిట్టులంటివి ? సూతా. 31

చ. అనవిని సూతుఁడిట్లనియె నాధునికుల్ ధనకాంక్షచేత వ్రా
సినబలువ్రాఁతగాని యదిసిద్ధముగాదటు పూర్వగాథలం
గనఁబడదెక్కడన్ వెదకికాంచిననాకు ప్రతాపరుద్రుచేఁ
గనఁబడుసంస్కృతాననాక కావ్యమిటీవలఁ బుట్టెనన్నియో. 32

క. తెలుఁగునవందలకొలఁదిం, గలవు మనుజకృతులుగాని కైకొన్ననరుల్
బలుతీవ్రతరములగు బా, ధలుపడియె గతించినారు ధరణీస్థలిలోన్. 33

క. భారతమును గృతినొందిన, శ్రీరాజనరేంద్రనృపులును దెబ్బ బహుకృతిరా
జా రాజకృష్ణ* రాయలు, కూతిమిసుతుఁడొకఁడు నొందరె ఘోరమరణముల్. 34

—పూర్వకవి వాక్యములు—

ఉ. "బాలరసాలసాలనవపల్లవకోమల కావ్యకన్యకం
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి? నిజదారసుతోదరపోషణార్థమై." 35

ఉ. "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు కొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ
బమ్మెరపోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్. 36

క. "నృపులకుఁ గావ్యం బొసఁగిన, నపవర్గం బొడఁగఁగలరో! యటుగాకన్నం
ద్విపతురగభూషణాంబర, తపనీయాదికము చేతఁ దనుపఁగలరో." 37

క. పనిఁబూని తుచ్ఛభోగం, బునకై కొఱగాని జనులఁ బొగడుట యెల్లం
గనుఁగొననిహపరసారం, బనితలఁచి వినిర్మలాంతరంగుఁడనగుచున్." 38

క. అనిభక్తవరులు చెప్పిరి, గనుక గృతులనిచ్చువాఁడు గైకొనువాఁడుం
గనరిహపరసౌఖ్యంబులు, ధనమేదోషంబులకుఁ బ్రధానంబగుటన్. 39

—భగవత్కృతి విశేషము—

గీ. భగవదంకితంబై చాల భాసిలు కృతిఁ
జేయువాఁడును దానినిఁ జెలఁగి ప్రియమ
ఠించువాఁడును బహుసౌఖ్యవంతులగుదు
రఖిలదోషజాలము దైవమణఁచుఁ గాన. 40

—విష్ణుత్వవిచారణ—

గీ. అవనిపతియె విష్ణుండని యడ్డులేక,
పలికి కవులు నరకృతులు సలుపుచుందు
రహహ! జగములో గోష్పాదమంత భూమి
లేనివాఁడెవఁడు? ఎందాఁక నీనియమము? 41

* రాయలు నేరీతి సుతులును లేక యీలిగిపోయెన్. అనిపాఠాంతరము.

గీ. సృష్టియును స్థితియులయంబుఁ జేయునొక్క
కంజనేత్రుండె విష్ణుండు గాని క్రోధ
కామ మద లోభ మాత్సర్య గర్వులైన
మనుజులెల్లరు విష్ణులే యనఁగఁదగునె. 42

— సరస్వతి కవిత్వగుణము —

గీ. సకలమాతయౌ తను సరస్వతికి నరునిఁ, బతిఁ జేసిన పాపంబు వలన వానిఁ
జందురుం డవని పొగడిన యసత్యదోష, మున నుదత్తకవి శుభమును గొంద లేఁడు.

గీ. కాంతిచే సూర్యునిజయించి కాలుచుంటి
వనిన నతఁడేడ? నీవేడ? యనుటె గాదె?
యాగుణము దెలియఁగలేక యద్దితనదు
పొగడికయని మనుజుఁడుబ్బి పోవుఁగాని. 44

గీ. అక్షరాభ్యాసమును జేయు నపుడు చేయి
దోయితో "సరస్వతి నమస్తుభ్య" మనెడు
నరుఁడు తజ్జగన్మాతకు నాథుఁడయిన
నట్టి ఘోరకలి గడిసె గొట్టవన్నె? 45

చ. ప్రభువులు వంశహీనులయి భ్రష్టత నొందఁగఁ జేసి సత్కవి
ప్రభువులు విత్తహీనులయి పాపుల యాచనసేయఁ బంపిదు
ర్లభధనవీరపూరుషవిరాజితమౌ మన దేశముగ్ర మహా
శుభగతి కప్పగించి జనశోభలణంచిననీకవిత్వమే. 46

గీ. సంస్కృతాచారములు మూలఁజతికిలఁబడఁ, దెనుఁగు మీఁజినతరువాత దేశమిట్లు
భ్రష్టతకు రాఁగలక్ష్మీసరస్వతులకు, వైరమను మాట యల్లిరి ధీరవరులు. 47

— బ్రహ్మవిద్యాదుర్గతి —

గీ. ప్రణవరవగాన విద్యను గ్రామ్య ధర్మ
గతికి బలిసేసి, ఛందఃప్రకాశమగు క
విత్వము మనుష్యమాత్రుల వినుతిపాలు
చేసి, పండితుల్ భక్తినిఁ జెఱిపిరకట! 48

—సత్కృతిసంతాన స్వరూపము—

వ. కావున లోకోపకారకములైన యుత్తమనీతి గ్రంథములను గవులచే భగవదంకితంబులుగాఁ జేయించి తాము పవిత్రులగుటయు, శ్రీరామచంద్రాదులవలెఁ దాము సత్యమైన పవిత్రచరిత్ర గలవారైనప్పుడు మార్గదర్శకములుగా నుండఁ దమచరిత్రములను వ్రాయించుటయు నరులకుఁ గృతిసంతానమనంబడును. భోజరాజాదులిట్లే చేసిరి. ఈకృతివిషయ ఘట్టమును జదివిన కవులు, శాంతులు, రసగ్రహణ సమర్థులు, పరోపకారపారీణులు, శిథిలీభూతసనాతనాపుసనాతన గ్రంథోద్ధరణాసక్తులు, ధనవంతులు, నిర్మలకీర్తికాముతులు నయ్యెదరు. 49

—పౌరకృత మూఢరాజమరణ ప్రశంస—

క. ఈరీతిఁ దటస్థించిన, యారాజావస్థఁ గూర్చి యాపురజనముల్
వేరితులనాడుకొనం, బ్రారంభించిరి మనస్సువచ్చిన యట్లున్. 50

వ. అందు రాజభటు లిట్లాడుకొనిరి. 51

క. ఈరాజును సేవించుట, కారంభించి యయిదునెలలైనం గాలే
హా రా! వేలుగడించితి, మీరీతిప్రభు దొరకఁ డింకేయంటన్. 52

వ. నవాచారాతిబలు లిట్లాడుకొనిరి. 53

క. మనపనులితనిసహాయం, బునసెఱవేఱినవి చాలఁ బూర్తిగ నిఁక మీఁ
దను బరరాజే మితలం, చునో? మనపట్టుదలయెట్లు శోభిలఁగలదో. 54

వ. త్రాగుఁబోతు లిట్లాడుకొనిరి. 55

క. దినమునకొక కాయనిడుచుఁ, దనదేహములాగుఁ జూచి దయతో నెపుడున్
మనలను మన్నించినరా, జునశించె నుగంటిరే? మనసుకృతమిటుండన్. 56

వ. వారకాంత లిట్లాడుకొనిరి. 57

క. ధనమిచ్చుట నగలుంచుట, మనకది యొకలెక్క గాదు మానక యెపుడుం
దనభార్యలు మనసేవల, నొనరుపఁ జేసె మనపుణ్య మెప్పుడే? చెలియా. 58

వ. ఉద్యోగస్థు లిట్లాడుకొనిరి. 59

క. మఘలనునమ్మి సమస్తము, మనపైఁ బెట్టిన ప్రభువును మానితమతియు
క్తినిదొంగలెక్క వ్రాసియుఁ, గనేకొలువు గలదు? మనము కలమును ద్రిప్పన్.

వ. ఆస్థానపండిత కవులిట్లాడుకొనిరి. 61

చ. ఘనుఁడవు విష్ణుమూర్తివని గట్టియబద్ధములాడి మూఢరా
జును గొనియాడి డబ్బుపరిశుద్ధమటంటిమి గాని త్రాగుదుర్
ధనమును బోవుసేయుకతి నాయక! యుత్తమమార్గమిద్దిగా
దని తగునీతిబోధము రవంతయుఁ జేయకపోతి మయ్యయో. 62

వ. పతివ్రత లిట్లనుకొనిరి. 63

గీ. ఇల్లుదాఁటి వీధికి రాఁగ నేమికొంప
మునుఁగునో ? యని భీతినిఁ బొందుచుంటి
మిపుడు పతివ్రతంబులు ఫలియించెఁ బాపి
పేరుచాటె నేఁటితో శనివిఱుగడయ్యె. 64

వ. కర్మబ్రహ్మవాదులైన యార్యులిట్లాడుకొనిరి. 65

సీ. విగ్రహారాధన విడవాడరాయని దేవాలయంబులు దిబ్బఁజేసె
విధవలను దయతోఁ గొంపోఁడరాయని పలువుర భార్యలం బాడుచేసె
బంచమాన్నంబును భక్షింపరాయని యీగ్రామములకునీటి సుకలఁచె
నీపిచ్చికర్మంబు లిఁకమానరాయని ద్విజుల జందెంబులు త్రెంపఁజేసె

గీ. నేమిసెప్పుదు దురవస్థ; యీకలియుగ, రాక్షసునివలెఁ గాలితోఁ రాచివైచి
నాఁడు; పాపాత్ముఁడు గతించె నేఁడు; జన్మ, మెత్తినందుకు సంతోషమిప్పుడబ్బె.

చ. జనులరహస్యపాపముల జాడ లెఱుంగఁ దరంబుగాదుగా
పునసెపరిభ్రమించు నారకము పొందునటంచు విధించె శాస్త్రముల్
జనులకుఁ బాపకృత్యములు సల్పుటకాజ్ఞనొసంగి పాపిఁడా
జనపతి శత్రుపీడగని చావునుబొందుట యొక్కటి-యాబ్రమే ? 67

చ. అమలిన వీరిహోత్రరుచియాటను విస్తృతరాజవంశవృ
క్షములకుఁ బెట్టువాఁడు, శుచిసాగరముగ్లుట హేమకారగ
ర్భమున జనించు నుబ్బనణపంచగు మందగుపిప్రోసామ్ము
ల్లము వహించిన్న మూఢునకు శలంబు బలంబుఁ గులంబుఁ గూలవే ? 68

వ. ఇట్లు నిర్వంశుండయి చచ్చి మూఢరాజు దుర్జనభూషితుండును, సజ్జనదూషితుండునయి నరకకూపంబులోఁ గూలె. 69

సీ. వారకాంతలుపాడు వరగీతముల్ విని భక్తివృద్ధింబొందఁ బరఁగువారు
బహువిధదీపికా ప్రభఁ గాంచి దుష్టచింతాంధకారంబు పోనడఁచువారు
స్తోత్రపాఠకగాన సూక్త్యర్థములు చెప్పి భగవంతునామముల్ పలుకువారు
దేవునిదర్శించి దివ్యభక్తినిఁ గనుల్ మూసి యానందంబుఁ బొందువారు
గీ. నైరిసంకరపురశిష్టులట్టివేళ, ఘనవసంతోత్సవంబులు గనుటకేగి
యట్టివారున్నచోటులఁ గట్టువేవ, తామసంబులువ్యర్థంబు లనుటయొప్పు. 77

సీ. బాటసారులఁబిల్చి పరమసంతోషాన స్నానార్థముసుశీతజలమునిచ్చి
పానకంబునువడపప్పు మామిడిపండ్లు పెరుఁగునన్నంబు సంప్రీతిగనిడి
మంచిగంధముఁబూసి మల్లెపూదండలు మెడవేసియత్తరుల్ మేనరాచి
సన్నవస్త్రంబులు ఛత్రముల్ చెప్పులు విసరుఁగఱ్ఱలుపండ్లువిడెములునిడి
గీ. వారు తాంబూలచర్వణపరతనుండఁ
జేత విసరుఁగఱ్ఱనుబూని సేవఁజేసి
ద్రవ్యముగల పుణ్యాత్ములు ధన్యులగుచు
నుండిరావసంతంబున నుర్వియందు. 78

సీ. నేత్రపర్వ స్వచ్ఛరాత్రినాయకపల్లవితపుష్పితద్రుమ లతలవలన
రసనోరుపర్వేక్షురసరసాలఫలాది సరసపనసఫలాంశములవలన
ఘ్రాణపర్వామలఘనమల్లికాముఖానేకసుమసుమనోరసములవలన
శ్రవణపర్వానేకశారికాకీరకోకిలముఖ్యకిలకిలకలరవములఁ
గీ. దనుసుపర్వమలయమారుతంబువలన,
నింద్రియముల రాజగుమది కింపుపెంచి
మహి వసంతకాలమునఁ గామంబు ద్విగుణ
మసిన యార్యోక్తినది సల్పుకొనుచుండె. 79

క. శ్రీమత్కాలంబైజన, సామాన్యులకు ముదమిడ "వసంతేద్విగుణః
కామ" యనెడునార్యోక్తిని, ధామాన్వితఁజేయుటయును దగనట్టిదియే? 80

—గుళ్ళపై బొమ్మలు—

చ. అనుపమదృష్టిదోష పరిహారములన్నది యెట్లులుండఁగా
జనములభక్తినిశ్చలతఁ జకరాఁగఁబట్టిపరీక్షఁజేయుటల్

పరికో నాలయంబుపయి వ్రాయవిధించిరి బూతుబొమ్మలన్
మానులవి యిప్డుగాతె యయిపోయెను దుష్టమతాభివృద్ధిచేన్. 81

క. పరానులనిశ్చయమిది యే? గానియెడ నొక్కమిచ్చు ఘనతలములఁగా
తేనీతిన్ స్థాపింపం, గానుదురివి లేనిగుళ్ళు ముఖ్యము లెగిదా! 82

క. జడమతి యిది తెలియక తాఁ, జెడిపోవుటయుండ నొకరిఁ జెఱఁచియు నయో
గుడులసలే చెడఁదీయుం, గడఁగును రెండును దెలియని ఖలుఁడయ్యయ్యో. 83

—పాపరాజవిరహము—

గీ. అట్టియెడఁ బాపరాజు శోకహంసతూలి, కాశయనమున శయనించి గాఢవిరహ
వేదనాధీనహృదయుఁడై వివిధగతులఁ, బరితపించెను సుమతిరూపంబుఁ దలఁచి.

గీ. అట్లు పరితపించి పురుషుఁడగుట చేతఁ, గొంతవడికి ధైర్యము దెచ్చుకొని తిరిగి య
థాప్రకారముగా నుండెఁ దత్సమయము, నందు జాము ప్రొద్దెక్కిన యట్టి వేళ.

—దామోదరశ్రేష్ఠ్యాగమనము—

గీ. పడకసామానులును వంటపాత్రలునొక
హయముపైనుంచి యశ్వానినను సరించి
నడుచునొక కూలివాఁడును బడుసుఁదనము
వెలయునొక భామయును దనవెంటనడువ. 86

సీ. గతదినంబున వంట గావించి పెరుమాళ్ళ కారగించిన పులిహోరమూట
తిరుమాళ్ళపుంబుట్ట తిరుమణియుద్ధముల్ పెట్టికట్టిన బొట్టుపెట్టెమూట
హారతియిచ్చు కర్పూరంబు సాంబ్రాణి పెట్టిన పెరుమాళ్ళ పెట్టెమూట
నేన్పుగా నుతికిన నీరాటి విదోవతుల్ పెట్టిగట్టిగఁ గట్టినట్టిమూట

గీ. రెండుబుజముల నటునిటునుండఁ ద్రోళ్ళసి, పూసత్రావడములు కంఠమునఁ దనరశి
ఖ వశిష్టముండితసకలాంగుఁడమిత, నీలతనుఁడొక్కఁ పంగనామాల దారి. 87

చ. అనయముఁ గృష్ణయంచు శివయన్నపదంబును విన్నచోఁ జెవుల్
ఘనముగమూసికొంచునిఁకఁ గర్మము చాలక స్మార్తుఁ డెవ్వఁడేన్
గనఁబడినంత్వరన్ విసుఁగట్టముఖంబున కడ్డువెట్టుకొం
చనుచితవృత్తితోడ నిటులా పురవీథిని వచ్చుచుండెఁ దాన్ 88

వ. పాపరాజట్లు వచ్చు దామోదరాచార్యుంజూచి పిమ్మట. 89

గీ. భక్తియభివృద్ధియగుటకేర్పడినహరిమ, తాత్పర్యము దెలియఁగాలేక స్వార్థపరత
తోమతద్వేషులగు వీరెభూమిజనుల, నైకమత్యముఁ జెడఁగొట్టి నట్టివారు. 105

గీ. ఇపుడు నేనన్న మాటల నెఱిఁగివీఁకు, పరులరంధ్రముల్ వెతకెడు పాపియనక
తప్పుఁ జెప్పినవాఁడనితమదులోప, ములను దిద్దుకొందురుగాక బుద్ధియుతులు.

క. ఈరీతిమంత్రియిటను వారుండఁగ జరిగినట్టి ప్రమదకరసమా
చారము చెప్పెద స్థిరమతి, మీరందఱు వినుఁడుసంయమిప్రభులారా. 107

—కామినీపాపరాజానురాగము.—

సీ. సన్నకోకనుగట్టి స్నానమాడెడువేళఁ దిప్పుకొనుచు బిందె దెచ్చువేళ
నందముగా బట్టలాఱఁగట్టెడువేళ శీఘ్రంబుగా వంట సేయువేళ
నిలువుటద్దము చూచి తలదువ్వుకొనువేళ వడివడిగా రైక దొడుగువేళఁ
బందుతాంబూలము భర్తకిచ్చెడువేళ బాగుగాఁ బాటలు పాడువేళఁ

గీ. బటుతరాశతోఁ దనుఁజూచు పాపరాజు, పైనిఁ గ్రొఁగంటిచూపులు బఱపుచుఁ జిఱు
నవ్వు నవ్వుచు వానిమానసముఁ గలఁచి, వేశ్యనా వైష్ణవాంగన విపులముగను. 108

సీ. మంచమందుఁ బరుండి మంగలివానిచేతను గాళ్ళుపిసికించుకొనెడువేళఁ
బత్రికఁ జేఁబూనిపడకకుర్చీమీఁదఁ గూరుచుండి చదువుకొనెడువేళఁ
దంబురాశ్రుతివేసితాళంబు నరిపెట్టి బాగుగా జావళుల్ పాడువేళ
మేలుగాఁ జల్లని గాలికై మంచివేషము వేసి సొగసుగాఁ జనెడువేళ

గీ. నాశతోఁ దన్నుఁజూచు తదబ్జనేత్రిఁ, జూచి నర్మముల్ బలుకుచుఁ జొక్కిపకప
కమని నవ్వుచు దానిచిత్తమునుగలఁచి, వేసెనా పాపరాజును విపులముగను.

గీ. ఇటుపరస్పరప్రేమచే నెసఁగువార, లిద్దఱును దగిన సమయమెపుడు దొరకు
నను చు మిక్కిలి తొందరనందుచుండి, రీవిధమునమూఁడుదినము లేగినంత. 110

—దామోదరగ్రామసంచారము—

గీ. త్వరగఁ బదిగంటలకుఁ బ్రసాదముభుజించి, భార్యనక్కడ నుంచియా వైష్ణవుండు
బంటుతోఁ గూడ నాచుట్టుపట్లనున్న, పల్లెలకు శిష్యపూజలు పడయఁబోయె.

గీ. అట్లుపోవుటకుముదంబునందుచున్న, కామినీపాపరాజులకర్మమొయనఁ
బాటలను సేర్చుకొనుటకా భామకడకు, వచ్చుచుండిరాపట్టన భామలెల్ల. 112

గీ. అట్టి భామలనేమియు ననఁగ లేక, భ్రమను బొందుచు మతి లేని వానిభంగిఁ
బాపరాజన్న పనులను వదలివేసి, యూరకే శోకాంధరపడుచు నుండెనంత 113

—సంధ్యా కాలవర్ణనము—

క. హరిలోఁ దలఁచుచునాడెడు, హరుని సగము చూసినట్టి యక్షులనంగా
నరుణాగ్నాస్తమితోదిత, హరిశశుగొప్పిరిజలేశ హరిహయదిశలన్. 114

—సూర్యాస్తమయవర్ణనము.—

సీ. సర్వేశ్వరుండైన, శర్వుండు తాండవ, మొనరింపఁ జల్లఁగానుండుటకును
దమ్ముఁడౌ చందుర్రుండు తనప్రభావము మీఱ నెల్లలోకంబుల నేలుటకును
వ్యాపారములు చేసి యలసియుండినలోకములు మంచిసుఖనిద్రఁ బొందుటకును
యానశ్రమములైన యాత్మరీ భాశ్వముల్ మేల్మిపచ్చగడ్డి మేయుటకును
గీ. జియ్యఁబట్టిదుష్కృత్యముల్ చేయకుండఁ, బురుషుల మదమును హరింపఁబుట్టినట్టి
కామినీయంత్రములు మేలుగాఁచుటకును, లోకబాంధవుఁడస్తాద్రిలో యకరిగె.

—చంద్రోదయవర్ణనము—

చ. అనుపమ లోకగాత్రుఁడు దిగంబరుఁ డారజతాద్రిఁ దాండవం
బొనరుప నల్లమిన్నుతల నుండివగంగ చలించిచుక్కలై,
తనరుటనీటి హెచ్చుడిగి తత్సమహాసితభాతిచిహ్న పా
వనవనజాతశేఖరము వంగజగంబులు చూడఁ దూర్పుగాన్ 116

సీ. చందమామను జూపి సంతోషమొదవించి పిల్లలకన్నంబు వెట్టువారుఁ
దండనపదములు తలుచుగాఁ బాడుచుఁ బాలములోఁ గాపుండఁ బోవువారుఁ
బదిమందిగుమిగూడి పరమసంతోషులై శ్రీరామభజనలు సేయువారు
సరియోడువారలుజ్జాలు వేసికొని బల్ వేడుకను పట్టు లాడువారు,
గీ. గామినులు దమంతటవచ్చి కౌఁగిలింప, మేడలెక్కి వీణాదులు మీటువారు
నయిరిజనులు చల్లనిరజపయినివెలుఁగఁ, బ్రాణులత్యంత సంతోషపడ వెయపుడు

—కామినీశృంగారము.—

సీ. అతిశీతమలయమారుతమునుదన చేతి విసరుఁగట్టిమరుత్తువెలయఁజేయ
నరుణమైవిలసిల్లు నధరబింబంబును దాంబూలరాగంబు తనరఁజేయ
మేలిమి బంగారు మించుగాత్రమునకుఁ బసపద్దకపుఁజీరపత్రిభలనొసఁగ
నష్టభాసను దుద్దు లందొప్పవజ్రాల పత్రిభలకువెన్నెల వన్నెవెట్ట

గీ. తాసద్దానిరాధారపతంగరీతిఁ, బరుగిడుచుఁగరములుసాఁచి వరిశిఫలంబు
గోరకారోగ్యమును బ్రాణికోటికిచ్చు, నినుఁడు సన్మార్గసంచారుఁడనఁగవచ్చు.

—దామోదరసంభ్రమము—

కం. అప్పుడుతద్దామోదరుఁ, డొప్పగశిష్యదధనంబు నొందిగృహిణిదా
నెప్పగిదినుండెనో? యని, యప్పల్లెలువిడిచివచ్చె నతిశీఘ్రముగన్. 138

గీ. అట్లువచ్చినివాసము నంతవెదకి, యెచ్చటను భార్యఁగానక యెంతొదిగులు
పొందికొంపమునిఁగెనని తొందరపడి, జాడలేమియుంగానక చదికిలఁబడె.

గీ. అట్లుపడికొంతసేపటి కెట్లొలేచి
కర్మమెట్లున్నదోయట్లు గాకమాన
యనుచుఁ బాపరాజుఁగనిమాయాఁడవాండ్రె
చటకుఁబోయిరో? తెలియునే జాడమీకు? 140

కం. అనియడుగనతఁడు కోపం, బునఁగని నీభార్యయెటకుఁ బోవునామాడన్
ననుఁగాపుంచితివే! పా, ప్మనుమఁగఁబరిశేయనాతఁ డతిలజ్జవడెన్. 141

గీ. అట్లు పడిపోయి పాపరాజన్నమదిని
మేడపైకిఁబోయినవెనక మెల్లగాను
వంటయిలుసొచ్చి యామంత్రి పాత్రయందు
నన్నమునుదిను తనభార్య నట్టెచూచె. 142

క. కనిదుఃఖసముద్రంబున, మునిఁగియట్లైనిలువఁబడి ముమ్మరముగనూ
ర్పునుబుచ్చుచు నయ్యాదితనుఁ, గనినప్పుడుచూచిపలికెఁ గనుఁదీనతతో. 143

—కామినీదామోదరసంవాదము.—

గీ. కాంత! నాకూటిబోదున్న గరిపెపరుని
కూడును దినుటతగునె? సతుల్లజ! నీవు
నెన్నొ రూపాయలనుబోసి నిన్నుఁ గట్టు
కొంటి నాముప్పుగడపక్రిట్టుంటతగవె? 144

సీ. ఎవరినైననుపిల్ల నింటనన్నరికఁదీ, సేసునా? పిఁడని యీసురనుచు
నమ్ముమ్మవారున్నమా న్యాయబమ్మియూరుఁడు, మన్నింకఁదినుట మన్నెయనుచు

నధికారికడనీవు న్యాయంబుగోరినఁ, బదిరెండునెలకీయవలయుననుచు
నిన్నింటికొడఁబడి యెట్లొ పెండ్లాడిన, నదరెట్టితిమోగ్యరా లగునొయనుచు
గీ. నెంతస్వేచ్ఛగా నీవున్న నేమియనక, యింతవండిగ్గయుననుబెట్టు చిల్లునగని
పెట్టుకొనియుండువనుచుని ర్భీతినుంటి, నిట్లయిన నన్నుఁగడతేర్పి నిచ్చెలేదె!
గీ. అనఁగఁ దద్దుష్టకామిని యనియెనిట్టు
లేలపేర్మిలెదవూరకే చాలుఁజాలుఁ
గామినికొకయావనమెముఖ్యంబుగాని
యమితధనధాన్యములును ముఖ్యములుగావు. 146
గీ. లేనిపోనిదురూహలు మానసమునఁ, బూనియట్టులిట్లనుచును బూర్వకాల
వాక్యములుసాహసంబుతోఁ బలికకుమిఁక, నీకుఁబ్రత్యుత్తరంబీయనాకుఁజెల్లె.
శా. రాకాచంద్రముఖుల్ నిరంతరరతి ప్రారంభసంరంభలన్
శ్రీకామాగమవాక్యరత్నములఁబుధుల్ చెప్పన్వినన్ లేదె ! య
స్తోకంబైన జరాభరంబుగలనీతోనుండనెట్లోర్తురా?
నీకున్ నాకును నింతె యింకఁబదరా ! నిర్భాగ్యదామోదరా. 148

—దామోదర పాపరాజ సంవాదము.—

గీ అనఁగ దామోదరుండునిరాశనొంది
పాపరాజునొద్దకువచ్చిపలికెనిట్లు
నాదుభార్యహరించుట న్యాయమగునె ?
యిచ్చివేయుఁడు ! కరుణించి యిదిగొ మ్రొక్కు. 149
గీ. అని నమస్కరింపఁగ నాతఁ డనియెనిట్లు
నీదుభార్యనేనుహరింప లేదు మాగృ
హమునను నన్నచోఁ ద్రోడ్కొని యరుగుమయ్య
యేను వీసమంతైనను నెఱుఁగ దాని. 150
గీ. అనఁగ దామోదరుండిట్టు లనియెమీగృ, హమునను న్నది నాకురా నన్న దనఁగ
నీగృహిణినీకురానన్న నేనుఁజేయ, వలసినదియేమి? యనివలెక్కఁ బాపరాజు.

—దామోదరస్వగృహగమనము.—

కం. అనుటకుఁజింతిలియాతఁడు, మనవస్తువుమంచిదైన మర్యాదగతిం
చునె ? మనకర్మంబిట్టిది, యనిధైర్యముపూనిచేరె నాత్మపురంబున్. 152

—ఆశ్వాసాంతము.—

వ. అట్లాహ్లాదామోదరుండుపోయినతరువాతఁ దత్పుత్త్రమిత్త్రసామంతరాజు లత్యంతసంతోషాక్రాంతస్వాంతులగుచు, హంసతూలికాతల్పంబుల శయనించుచుఁ, గానవిద్యాకౌశలంబులు మెఱయు సర్పాదిబంధకవితలం దేలుచు సుఖముగా నుండిరి. 153

—సర్పబంధము.—

చం. ఘనకపిధామ! మానసనిధీ! క్రతుధీశ! సన్నుతయతీశ్వరా! పా
వనబలవీశయాన! హతపాతక! కీర్త్యమపూరితదివ్య సురా
గనమతిసేవితా! నరవరా! వరచక్రకరాయుధా! పినాకిహృ
ద్వనరుహినా! యనూనవసుధాసురలక్ష్మ విశాలలోచనా. 154

—గద్యము.—

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, సుబ్బయసంతానపౌత్త్ర నారా
త్రిపుత్త్ర వేంకయార్య ద్వితీయపుత్త్ర, బాపనార్యపౌత్త్ర, చినసూరయార్య
ఏకాదశాబ్దపోషితపుత్త్ర, సీతమ్మార్యస్వకన్యాపుత్త్ర, సకలజన
కారుణ్యకటాక్షపాత్త్ర, సీతారామచంద్రపదపద్మాశ్రిత
సకలకర్మ, సూర్యనారాయణమూర్తిశర్మప్రణీ
తంబై, యపూర్వవృత్తచరిత్రయగు
సకలానందనామక
నవీనప్రబంధమునందుఁ
బంచమాశ్వాసము.

శ్రీరస్తు.

సూర్యనారాయణమూర్తీయము.

# సకలానందము.



## షష్ఠాశ్వాసము.

క. శ్రీమద్దైవమవయ్యను, రామేశ్వరసుప్రతిష్ఠ రాజితభక్తి
శ్రీమతినొనరిచిలోక, స్తోమమునకు నీతిరీతిఁ జూపిన రామా. 1

వ. దేవా! దివ్యచిత్తంబున నవధరింపుమట్లు చెప్పఁగా వినియవ్వలికథఁ జెప్పు
మని యడిగిన శౌనకాదులకు సూతుఁ డిట్లనియె. 2

గీ. ఇట్లు మన్మథరాజ్య సౌఖ్యములు గనుచు
దాని భార్యగాఁ గైకొని తనరుచున్న
పాపరాజును వెలివేసి పరమనూత్న
రాజువానిగర్వపరిహారంబు చేసె. 3

గీ. ఇంటనుంచక పెండ్లాము నెల్లచోట్లఁ, ద్రిప్పినట్టివైష్ణవుగ్రహ మెప్పగిదినిఁ
గూలెనో వింటిరే! దీనిఁ గూర్చి యొకటి, విపులధర్మశాసనము చెప్పెద వినుండు.

క. పడఁతుకలందఱు నిట్టులె, చెడిపోవుదురనుట గాదు; చెడ్డయు బాగుం
బడయుటకు వేషభాషలు, నడవడికయు మూలకారణంబులు సుండీ. 5

క. అనిభక్తిం జిత్తంబున, ఘనతరలోకోపకార కార్యాచరణం
బున బ్రతికియున్నయట్లొ, ప్పిన మునివరులఁదలఁచి వినిపింపఁదొడంగెఁ

తద్ధేయము.

# కామినీధర్మశాసనము.

## ప్రథమగుచ్ఛము.

స్త్రీలతిచంచలల్ గనుక చేకొనిభర్తలు వారి సర్వదా
పాలనఁ జేయుటొప్పనను పద్ధతిలోకు లెఱుంగు నిచ్చ స్వ
స్త్రీలను వక్త్రహృత్తనులఁ జేరుచుకొన్న త్రిమూర్తులుం జగ
త్పాలనగండ్రుగా వుత మపారకృపారసవారధారులై. 7

క. ఈరీతిని నిఖిలజగ, త్కారణులకు మ్రొక్కి చెప్పఁ దలఁచినగృహివి
స్తారతరక్షేమకర, స్త్రీరక్షణధర్మశాస్త్రరీతి యెటన్నన్. 8

—గృహస్థవిషయము.—

క. భగవత్సృష్టంబగు నీ, జగమునఁ బురుషార్థములను సంపాదింపం
దగి భాసిల్లెడు నదియు, కగృహస్థాశ్రమమె యుండు ఘనమునులారా. 9

క. అతిథులు నభ్యాగతులును, యతులును మొదలైనవారి సన్నాదులచే
నతితృప్తినిఁ బొందఁజేయు, నతఁడే గృహస్థుఁడనఁ దొప్పు నవనీస్థలిలోన్. 10

క. ఆయతిథులు మన్నగువా, రేయెడ శుద్ధాన్నముదిన నెంతురుగాన
శ్రీయుతవర్ణాశ్రమగతిఁ, బాయక గృహియుండవలెను బరిశుద్ధుండై. 11

క. ధరణీస్థలిని గృహస్థుల, పరిశుద్ధతయెల్లవేళ భార్యలపాలై
పరఁగును గావున భామలు, పరిశుద్ధలు గావలయును బటునియమమునన్. 12

క. ఈవిషయంబును గూరిచి, దైవసమానులననెసఁగి ధాత్రీనిజనసం
భావితులైభాసిల్లెడు, పావనమౌనులు పలికిన పలుకులు వినుఁడీ. 13

—శాతాతపమహర్షి వాక్యము—

ను. పతిదీక్షాదుల నగ్నిహోత్రముఖసంరక్షాశుశ్రూషలం
బతిథివ్రాతము పూజలందుముద మొప్పారంగ భర్త్రాజ్ఞయుం
బతులశ్రద్ధయు భక్తియుం గలుగు శుద్ధాచారసత్కార్యయై
యుతరోపేక్షలు లేని భార్యగలవాఁడే సద్గృహస్థుండిలన్. 14

—సుమంతుమహర్షి వాక్యము—

క. పరిశుద్ధాచారములరఁ, గరుణాభక్తులు పతిపయిఁగలిగి సువృత్తిం
బరఁగుచుఁ బతికులధర్మము, పరిపాలించుసతిపతియె వరగృహిధరణిన్. 15

—శంఖమహర్షి వాక్యము—

చ. అతిథిముఖార్చనంబుల వ్రతాచరణంబుల నగ్నిహోత్రస
త్క్రతులను వేదకర్మములఁ బ్రేమునఁ గల్గినవాని కోరికల్
హితవుగఁ దీర్చువారు సతులేయగుటన్ సతులెప్డు నుత్తమ
వ్రతలుఁగులీనలుంబతిపరాయణచిత్తలుఁ గావలెన్ ధరన్. 16

—యమమహర్షి వాక్యము—

చ. అతిశుచినద్గుణాఢ్యయుఁ గులానుగధర్మయునైన కాంతనున్
బతియగువాని యన్నము దినంగఁ దలంతురు సాధు లెప్పుడున్
బతికతిశత్రువై యశుచివర్తనయౌ సతి యన్నమున్ గనం
దత పరిశుద్ధ వేదములుఁ దాల్చు భయంబును భూతలంబునన్. 17

గీ. కాంతినిచ్చుఁ బతివ్రతాకరము కూడు
పురుషమర్యాద యెల్ల సుందరుల పాలు
గాన వారికి సుగుణముల్ గలుగుమార్గ
ములను జెప్పెద స్థిరచిత్తములను వినుఁడు. 18

—ధర్మసంగ్రహవాక్యములు—

సీ. అత్తమామల సేవ లాచరించుటయందు దేవతారాధనాదికమునందు
నతిథిజనంబుల నర్చించుటందును జ్ఞానవృద్ధుల పరిచర్యలందు
నాత్మీయ పాదసేవాదులయందును గోమహిష్యాదుల నోములందు
నన్నపానాదులం దిన్నపఱచుటందు గృహపరిశోధనకృత్యములను

గీ. నెల్లప్పుడు నియమించును నితరబుద్ధి
పుట్టకుండెడు నట్టుగాఁ బుణ్యమొందఁ
దలఁచుకొన్న గృహస్థులు తమ గృహిణుల
నెంతొ బాగ యాకతతోడ నేలవలయు. 19

—యమమహర్షి వాక్యము—

ఉ. ఏపనిలేని కామిని గతీవ్రసదా పరుఁ జూచి మోహనం
తాపముచేత భర్తను ఘనంబుగఁ దిట్టుచు బుద్ధిలేక యే
పాపముఁ జూడకెట్టిమగవానిని నొందఁగఁ గోరుఁ గానఁ దా
మేపని యుంచనో యుంచవలె నెప్పుడు భార్యలఁ బూరుషోత్తముల్. 20

—శంఖలిఖిత మహర్షి వాక్యము—

సీ. ఎల్లప్పుడును బుట్టినింటనే యుంచరా దితరుతో మాట్లాడ నీయరాదు
దుర్భాగ్యవనితలతోఁ గూడ నీరాదు బహుజనస్థలములకుఁ బంపరాదు
బహుదినంబులు దాను నాసి యుండంగరా దొంటిగాఁ దానుపవుండరాదు
పాటలాటలుగలపట్ల కంపఁగరాదు చెడుమైనకథలు వచింపరాదు

గీ. భార్యల నిటులఁ గాపాడవలయు మగలు
లేనియెడ వారుచెడి తమ మానవంశ
కీర్తిఁ సంపదలు చెఱిపి యార్తినొంది
యిహపరంబులకుఁ గొఱగారింత నిజము. 21

క. తమపరమబంధుమిత్రగృహములం జరిగెడు సంభసమయములగృహిణులం
దమతోడఁ దీసికొనివచ్చిమఱల మగవారలిల్లు సేర్పఁగవలయున్. 22

— వ్యాసమహర్షి వాక్యము —

క. కామినులు చపలచిత్తలు, కామాసక్తలును దుష్టగమనలుఁ గానన్
భామిని స్వేచ్ఛాసంగినఁ, జేమర్యాద నశించును సుదతీతతికిన్. 23

క. ఘనసౌందర్యముగల సుత, జనకభ్రాతలనైనఁ జూచి చలియింతురిలన్
వనితలు సుందరుఁడగుపతిఁ, గనుచున్నప్పుడు వారి చిత్తగతి యెట్లుండున్. 24

క. కావునఁ బురుషులు సతులకుఁ, బావులు తాంబూలములును బూజ్యపునగలున్
శ్రీవస్త్రంబులు నిచ్చుచు, నేవేళ నుగృహమునందె యౌనఁగింపవలెన్ 25

— సుమంతుమహర్షి వాక్యము —

క. ఘనమగునమ్మ్రకవానికి, మనసగునట్లు నిజగృహిణి మసలంగాని
చ్చినమర్త్యుఁడు పురుషాధముఁ, డనిస్పష్టముగా వచించి రఖిలమహర్షుల్. 26

ఆ. "పాలఁతి దావవహ్ని పురుషుఁడాజ్యఘటంబు, కరఁగకుండ వాడు కడసెనేని
బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టక మానఁడు," సత్యమిది వేద సమ్మతంబు. 27

క. కనుకన్యాకంపమును బరకాంతం, తను జేరఁదగదు పురుషుఁడు; తరుణియుఁ బరపు
ద్దను జేరఁదగదు; నియమము, చనె నేనిమఱలఁగొనుట యసాధ్యంబిలలోన్.

చ. వనదళవాతముల్ మెసవువారు పరాశరకౌశికాదులా
ఘనులును సుందరీజనులఁ గన్గొని మోహితచిత్తులైరి హా
చ్చినఘృతపాయసాన్నము భుజించెడు వారలకున్ మనోజయం
బునెగడు నంటయోగగనపుష్పసహోదరధర్మమేగదా. 29

క. కానన్ సద్గృహమేధికిఁ, బూనికఁ దత్త్వోపదేశమునకై పరుఁడా
మానవునొద్దకు భార్యను, బోనిచ్చుట పాపకరము భూతలమందున్. 30

—సుబుద్ధిచరిత్ర.—

చ. మునుపు సుబుద్ధి నామముని పుత్త్రుఁడు జ్ఞానధనాఢ్యుఁడౌ కెఱడం
దనపినతండ్రికూఁతునకుఁ దత్త్వము చెప్పుదు దైవకారణం
బునరతిసల్పి పిమ్మటను మోసమెఱింగి తపించి లింగముం
దునియలు సేసి పట్టుకొని తూరుపుగాఁ జనుచున్ మృతింగనెన్. 31

క. సతులకుఁ దత్త్వార్థము పై, మఱియుండిన జ్ఞానవృద్ధ మానినులకడం
బతులకడ నొందవచ్చును, నితరులకడ నొందఁ బూను టెంతయుఁ దప్పౌ. 32

—భృగుమహర్షి వాక్యము.—

క. పరభార్య తన్నుఁ గూడిన, పరపురుషుని వంశమెల్ల భంగము సేయున్
బరవీర్యము తను బొందిన, పరభామిని వంశమెల్ల భంగము సేయున్. 33

గీ. పరపురుషుని వలనఁ గాంత వడసినట్టి
ప్రేమ కాంత పతియందు నెలయు బ్రహ్మ
తేజమును జంపివైచును ; దీని పేర
చెడిపె మగని జనులు గొప్ప సేయరనుట. 34

క. తమ భార్యలందుఁ బరకీ, ర్యము పడుటయె గొప్పపాపము గానన రుల్
రమణులఁ గాపాడవలెను, కుమయుంశ్చలి పొందకుంటెఁ జన్మట మేలౌ. 35

చ. ధరణిని బంకలాఁడియగు దారను గూడుటకన్న మంచిదౌ
మరణము, సన్న్యసించుటయు, మానితమౌ పరదేశవాసమున్
వరగతి నీచమార్గమును భామలు పొందుటకాదిహేతువుల్
పురుషులె కాన భార్యలను బూజ్యగతిన్ నియమింపఁగావలెన్. 36

—మనుచక్రవర్తి వాక్యము—

గీ. స్త్రీశిరఃకేశమొకటి దేవునొద్దఁ
బడిన నా దేవతామూర్తి త్వరగఁ దగ్గు
మఱియు దానిమగఁడు చచ్చి మ్రుల్లఁ బుట్టి
వెండ్రుకల నెభక్షించి జీవించుచుండు. 37

క. కావున నిహపరసుఖముల, కైవర్తించు మగవార లాత్మస్త్రీలం
గేవల ముములలోనికి, నేనేళ్లం బంపకింట నేయుంచవలెన్. 38

—శంఖలిఖితమహర్షివాక్యము.—

క. పతులను బాసిచరించుట, సతతముఁ జీఁకటిని దురింబు జననంఘములం
గనుకొనుచుఁ జూడఁబోవుట, సతులకు బుద్ధిని జెఱుపఁగఁ జాలు పెనుపనుల్.

క. పరపురుషశ్వాసముతో, పరఁబును ద్రైఁదాల్చి తాని భర్తకుమనుష్య
గ్ర్వ్యరురోగములగుఁగానం, బరపురుషుల నెయ్యడనుండ వలదుత్తమసతీ. 40

చ. ఉరుతర మోహవాక్యముల సూరకె పలుకు నన్నియైనఁ బడం
ద్వరపడి మున్క్ర భాగములు తాఁగరచునుందురు దానభర్తకు
ర్భరదురితాత్ముఁడౌఁ గనుకఁ బావనవంశజయైన స్త్రీయులం
బరపురుషవ్రజంబుగల పట్ఠులకేగఁగఁగూడ దెప్పుడున్. 40

—తత్త్వోపాఖ్యానవాక్యము—

క. పతినివిడిచియుంటసతికి, మతిచాంచల్యమునకాదిమార్గము గానం
బతిసేవాపరురాలగు, సతి యాగతినుంట కంటెఁ జపంబేమేలా. 42

క. శ్రీరాముఁడె నాదైవము, శ్రీరాముఁడె సౌఖ్యమొందు స్నేహితవరుఁడున్
శ్రీరాముడె గతిగావున, శ్రీరాముని విడిచి యుండఁ జిటికెయయినసేన్. 43

క. సతికిన్ శ్రేష్ఠంబగు నగ, పతియొకుక రాము వెంట వనికిన్ జనెదన్
బతినివిడిచి జననింపను, క్షితిసేనెవ్వర్తు; ననుచు సీతవచించెన్. 44

—ధర్మహారీతమహర్షివాక్యము—

చ. వ్రతముల దానకోటులఁ దపంబులచేతను దేవతార్చన
క్రతువుల చేతఁ బూరుషులు గాంచెడు పుణ్యఫలంబు సర్వముం
బతిపరిచర్యలన్ సలిపి భార్యలు పొందుచునుందురు గావునన్
సతులకు భర్తకంటె ఫలసౌఖ్యదదైవము లేదు వేఱుగన్. 45

—కాత్యాయనమహర్షివాక్యము—

క. పతిపదశుశ్రూషను సం, తతమును జేసెడి పతివ్రతలు వైకుంఠా
మితసుఖములు గాంతురు; దే, వతలును జేసెద రెపుడును వారికి వినతుల్.

చ. క్షితినిఁ బతివ్రతాంగనల శ్రీమహిమ వర్ణనయోనర స్వాతుక్
నతులనుజేయుచున్ మదమునన్ వినుతింతురుగాన స్త్రీపతి
వ్రతయగుటొప్పు; భార్యకు సహర్తనపూటకు భర్తనీతిసం
గతుఁడగుటాగికారణము గావున నట్లగుటొప్పుఁ బూరుషుల్. 47

బలిహారి గనుక నీఘనవ్రతము బూను
నామె యుత్తమలోక సౌఖ్యంబులొందు. 54

—శాతాతపమహర్షివాక్యము—

గీ. మృతుఁడయిన సన్న్యసించిన బ్రతికియున్న
సతికిఁ బతియె దైవముగాన శ్రద్ధతోడఁ
బతిని ధ్యానించుచును నుపవాసముఖ్య
పావనవ్రతములు సేయవలయు విధవ. 55

క. ఈరీతినాచరించెడు, నారీమణికీర్తినొంది నారాయణస
త్కారుణ్యకటాక్షము చే, శ్రీరాజన్మోక్షపదవిఁ జెందుసుఖంబున్. 56

—గుచ్ఛాంతము—

క. చలనరహితయతిహృద్గత, లలితాకృతి! సర్వమంగళావాణీమం
గళ దేవతాధినాథ! స, కలలయసృష్ట్యవనకార్యకారకాకారా. 57

—గద్యము—

ఇది

శ్రీమన్మహర్షిసింహప్రణీత కామినీ
ధర్మశాసనమునందు
సర్వంబును బ్రె
థమగుచ్ఛము.

శ్రీ.



—మహర్షి శాసనచర్చ—

గీ. స్త్రీపశునియందు నాసక్తిఁ జెందనేని, నింటివ్యాపారములు నశియించు, దాని
నిహపరవిహితధర్మములెల్లఁ బోవు, ననితపసులిట్లు పలికిరి ఘనగతులను. 58

—గృహస్థాశ్రమ వైకల్పికత్వము—

క. గురుకడవిద్యాభ్యాసము, జరుపుచుఁ జిత్తంబు నిష్ఠఁ జలనరహితమై
పరఁగినఁ బెండ్లాడక యా, గురునికడ బ్రతినొందు దాఁక నిలువఁగవచ్చున్.

గీ. స్నాతక వ్రతుఁడై బ్రహ్మచర్య నిష్ఠ
కుదిరెనని సన్న్యాసము గొనఁగ వచ్చుఁ
గుదురకున్న గార్హస్థ్యము గొనఁగవచ్చు
నిష్టమైన మార్గంబున నేగవచ్చు. 60

గీ. బ్రహ్మచర్యగృహస్థతారణ్యభూమి, వానసన్న్యాసములయందు భామఁ గూడు
నట్టియొకగృహస్థాశ్రమ మదినియమిత, కాలసంగమధర్మంబు గలిగియుండు.

వ. అధికమాయా స్వరూపమై, నిద్రాహారమైథుననీచకర్మబద్ధంబై, జననమరణాద్యనేక దుఃఖహేతుభూతంబైన యీస్థూలశరీరమును దృణప్రాయముగా నెంచి, శాశ్వతసౌఖ్యప్రదమైన ముక్తిని సకలజన గమ్యస్థానముగా నిర్ణయించి, యాముక్తిసాధనమైన మనోబలము, నామనోబలసాధనమైన యుత్తమతపస్సు, నాతపస్సాధనమైన యోగనిష్ఠయు, నాయోగనిష్ఠాసాధనమై యాయుర్బలకాంతి హేతువైన వీర్యస్తంభనంబును, నావీర్యస్తంభనసాధనమైన, కామక్రోధ మదమాత్సర్య గర్వాదిదుర్గుణ కారణమాంసాద్యశుచిపదార్థేతరసాత్త్విక పదార్థభోజన స్నానాచమన హోమసత్యవాక్య వ్రతభూతదయాదికాయిక వాచికమానసికోచిత పరిశుద్ధాచారకాండమును, ముఖ్యధర్మములుగాఁ జేసి, సకలవిధముల వీర్యము వ్యయముగాకుండునట్టి నియమములనే లోకోపకారార్థము మహర్షిపుంగవులు నియమించినారు. దేశకాలస్థితులను బట్టి వీనిలోఁ గొలఁదిమార్పులు చేసినను గమ్యస్థానములు మాత్రము చెడలేదు. "మాంసం మాంసేన వర్ధతే" యని వైద్యశాస్త్రమందుఁ జెప్పి, పితృక్రియలయందు మాంసము పెట్టవలెనని ధర్మశాస్త్రములందును, సకలసమగ్రమైన వసిష్ఠాదమునులొకప్పుడు మాంసముదినిరని పురాణములయందును వ్రాసిన మహా

ర్షులే మోక్షసాధనధర్మ ప్రధానులైన ద్విజాతులకు మాంసభక్షణము కూడదని యాచారమేర్పఱచుట చూడఁగా వారిసంఘసంస్కరణ విశేషము చక్కఁగా బోధపడుచున్నది. ఇట్లు భూలోకజన కర్తవ్యమును బూనిన సంఘమే పూర్వాచార పరాయణపరమని పిలువఁబడుచున్నది. ఇట్టియుత్తమశాసనములయర్థమెఱుఁగక, నిఘంటుకారులు వ్రాసిన గ్రామ్య ధర్మశాస్త్రార్థములైనను విచారింపక, సంగనుమే బ్రహ్మానందప్రదమైన మోక్షమని యెంచి కాలక్రమమున నుపయోగజ్ఞానశూన్యులైన కొందఱు పూర్వాచారపరాయణులం జూచి మహర్షులనిందించుచు, మోక్షమనునట్టిదో యెఱుంగక మొన్నమొన్న కన్నుఁదెఱచిన కొందఱు విదేశీయులబాహ్య సుఖాచారములం బ్రమాణములుగాఁ దీసికొనుచుఁ, దమవిద్యాబలంబును బాడిదెలోఁబోసిన పన్నీరు వలెఁ జేయుచుఁ, దమయూహలు మహర్షుల సత్యస్థానోచిత ధర్మములచేఁ ద కారణములని యెఱుంగక యీకలిప్రజలు విధవ యేల పెండ్లియాడఁగూడదని కామవాదంబులు సేయునంతటి దుస్థితికి వచ్చినారు. 62

— పండితాపార్థసామర్థ్యము —

సీ. పరలోకమతిగడ్డపఱిగంతయును లేక భారతస్వరాజ్యముఁ గోరునొకఁడు
కమలాక్షునామంబు కలలోనను బఠింప కుండులోనేమున్నదనునొకండు
జపతపంబులు సేయు సద్బ్రాహ్మణులఁ జూచి యేమిపిచ్చియిదని యెంచునొకఁడు
మహితధర్మావ్రత మతరీతులను జూచి యిదవట్టిమాటని యెగురునొకఁడు
గీ. డయ్యయో! భగవత్తుల్యులైన మునులు
మసలినట్టి యీభారతమాతగర్భ
మందునెంత ప్రయోజకులైన సుతులు
పుట్టిరకటా! కలి పుట్టె మందమందె. 63
సీ. ఆత్మప్రకృతిపీస మంతయునెఱుఁగకే ప్రకృతిశాస్త్రిననుచుఁ బలుకునొకఁడు
జననమరణముల సంగతియెఱుఁగకే నాగరికుఁడనంచు నడుచునొకఁడు
బ్రహ్మచర్యప్రభావంబు నెఱుంగకే మతకర్తనని ముదంపడునొకండు
స్వర్గనరకములజాడల నెఱుఁగకే బ్రహ్మవేత్తనని గర్వపడునొకఁడు
గీ. డయ్యయో! భగవత్తుల్యులైన మునులు
మసలినట్టి యీభారతమాతగర్భ

మందు నెంత ప్రయోజకులైన సుతులు
పుట్టిరక్కటా! కలి కొంప ముంచుచుండె. 64

—వితండావాదఖండనము—

గీ. ఈసువచ్చిన వెనుక స్త్రీఁగూడకున్న, జబ్బుసేయునందురు కొందఱబ్బురముగ
నైష్ఠికబ్రహ్మచారులైనరులనేకు, లీయిలనుబూర్వమునఁ జరియింపలేదె? 65

గీ. అదియుఁగాక యాహారసంగాదులాది, యిందుఁదల్లిదండ్రులు నేర్ప నబ్బుచుండు
నిట్టులలవాటు చేసినట్టైనదుము, నీశరీరస్వభావమే యి[illegible]సుండు. 66

గీ. వాయువాహారముగఁజేసి వరతపంబు
సేయు పురుషుఁడయిన ఋశ్యశృంగమౌని
వారకాంతలఁ జూచి తపసు లటంచు
మొఱ్ఱకేఁగెనఁట, యిట నేమయ్యె భుక్తిరతులు? 67

గీ. కొందఱన్నవస్త్రంబులు కుదురకున్న,
జపతపంబులునిష్ఠయు సలుపుటెట్లు?
గావునస్వరాజ్యము ప్రజకుఁగావలెనని,
పలుకుచుందు రార్యులు నిట్లు పలుకఁదగునె? 68

గీ. ఇతరదేశసంవాసులనెల్లఁదనవి, భవముచేఁబెంచుచున్నయీభరతమాత
ధర్మబుద్ధులై యున్నచోఁ దనతనయుల, కన్నమును బెట్టి రక్షింపకట్టియున్నె?

ఉ. "ప్రాణికసేయువాని సిరివొందును, దైవముహేతువంచుదు
ర్జ్ఞానవులంచుసృ, దైవమును మానకకొల్చి స్వశక్తితోఁగృషిం
బూసిన యుష్ప్రుడద్దిచెడిపోయిన దోషములే"దటన్న శ్రీ
ముత్తానిమతంబు గుర్తెఱుఁగు మతుల్యాలు సంపదఁబొందకుందురే? 70

గీ. ఎదుటనున్న గంగనుమాని యొటకో పోయి
బురదగుంట నీటిని ద్రావు పోలికఁ స్వమత
శత్రులై పరమతరీతిఁ జను తనయుల
పైని భారతమాత కోపమ్ము పడదె? 71

గీ. పెద్దలైనమునులనీతివిడిచి, మాతృ, పూజమాని, దుస్సహవాసమునఁ దెగించి,
చెప్పినట్లువినకయున్న చెడుకొడుకుల, భరతమాత బాధలపాలు పఱచకున్నె.

క. సారబ్రహ్మానందా, పారాంభోనిధితరంగ భాసురడోలా
వారితసుఖమానసులగు, వారికిబాహ్యాస్వ రాజ్యభారంబేలా? 73

—ప్రజాకర్తవ్యము—

క. శాసనసమస్తనిషేధంబుల, హీనస్థితినొందియున్న యిప్పటిజనముల్
మానక యీశుభవేళను, జ్ఞానప్రదశాస్త్రరీతిఁ జరియింపఁదగున్. 74

క. మునుపీదేశము నేలిన, మనరాజులు శాస్త్రరీతి మానితదయతో
మనుజులనీతిపథంబునఁ, జనఁజేయుచుఁ దాముఁ జనిరి సత్పుణ్యగతిన్. 75

గీ. అట్టి రాజశాసనము నేయనుసరించి, యిప్పుడుండిన ప్రభువులు నేలుచుంటఁ
గామినీధర్మశాసన గతినిజనులు, నీతిని నిలువఁ జేయుకొనెదరుగాక. 76

క. అనఁగా విని శౌనకుఁడి, ట్లనెసూతుఁడ! నీవు చెప్పినట్టి సునీతుల్
ఘనసంతోషముగలిగిం, చినవింక నొకటి దానినీవు చెప్పఁగవలయున్. 77

—స్త్రీకర్మాధికారప్రశంస—

గీ. ఆఁడుది పురుషుని శరీరమందు సగము
భాగమే గదా! పురుషుని వలెనదియును
జందెము ధరించి కర్మముల్ సలుపకుండు
టేల? యట్లాచరించిన నేమి తప్పు? 78

కం. అనఁగా వినిసూతుండి, ట్లనియెను లోకోపకారమగు మీ ప్రశ్నం
బునకుత్తరమును జెప్పెద, ననుపమమతిసావధానులై వినుఁడు మునుల్. 79

కం. లలితాలంకారములగు, తలవెండ్రుకలుంటవలనఁ దరుణీమణికీ
యిలలోఁ గంఠస్నానమె, యలఘుసుఖప్రదమని మునులాడిరి మఱియున్. 80

గీ. సూతికాదిదోషంబులు చొచ్చుగృహము
గాను వాతతత్త్వముగలదానిఁగాను
వైద్యశాస్త్రము చెప్పెఁ గాఁబట్టి భామ
స్నానము జేయఁదగ నెట్టిసమయమునను. 81

గీ. నెలకుఁగానియొకప్పుడనియమముగను, గాని స్త్రీ బహిష్ఠయగుటగలుగునపుడు
దానిమేను చలువఁజేయఁగానఁదాన, మాడుటకిసుమంతయును ననర్హురాలు.

గీ. దినదినంబును జందెము దీసివేయు, టెట్లు? పారిశుద్ధ్యము లేకయెట్లు కర్మ
మాచరించుట? నిష్ఠనెల్లపుడుఁ దాల్చి, చంటిపిల్లల నరయుచు సాఁకుటెట్లు?

గీ. దేహతత్త్వముంబట్టియు గేహశిశుల, రక్షణంబులంబట్టియు రమణులకిల
వేదకర్మముల్ చేయంగ వీలులేక, పోయె సత్యముగా నిదే మునులమతము. 84

గీ. ఇంటిపను లెల్లవారల కుంటవలన
స్నానమును జేసి నిష్ఠతో సలుపఁదగిన
వ్రతములుపవాసములు మాని పతినిఁగొలుచు
టే సతికిధర్మమనిరది యెట్టులనిన? 85

క. ఉపవాసంబులు వ్రతములు, తపములు చేయేల? భర్తృపదపద్మమునిని
ఒరపటతఁ గొల్చిన సాధ్వికి, నపజయమెటనుగలుగదన వ్యాసుఁడు చెప్పెన్

క. పతిబ్రతికియుండఁగాఁదా, నతినిష్ఠనుపవసించునట్టి వనితయా
పతిగాయువంతయునణఁచి తతనర్కముఁ బొందునను, నస్కందుఁడు చెప్పెన్.

గీ. స్నానమాడినశిశునకు జలుబుసేయు
ననుట లేదుగాన విధవ యమితనిష్ఠ
గలిగి యుపవాసముఖ్య సత్కార్యయగుచుఁ
బతినె భక్తితో భావింప వలయుననిరి. 88

గీ. ఇట్లుపురుషులధర్మములింతిధర్మ, ములుసాంకర్యదోషంబుగలుగకుండ
నిహపరసుఖానుసంధానమై యొసఁగునట్లు, వైద్యశాస్త్రముంబట్టియేర్పఱుపఁబడియె

క. అనవిని యాపణ్యసుందరి, యనముననుగను వన్నెలికవ పూలింగవినఁగో
రిన ఘనమునులను సాత్ముఁడు, విసిపింపంబోడఁగొనలవేసుకతోడన్. 90

—కామిని లేచిపోవుట.—

గీ. అట్టులావైష్ణవాంగన యచటఁగొన్ని
దినములుండి యొకవిటుతోఁ జనియె; మాఱు
మనువుగట్టుకొనినది యామగనితోడఁ
బోరనిర్భీతిగా లేచిపోయినట్లు. 91

—పాపరాజ వేశ్యాధీనత్వము.—

గీ. అట్లుజరిగినవృత్తాంత మంతయువిని
వగచి కామప్రధానుఁడౌ పాపరాజు
ముందునంభవించెడు పెద్దముప్పెఱుఁగక
యొకటి-భోగముదానిని నుంచుకొనియె. 92

—వేశ్యావృత్తాంతము.—

కం. వినుఁడెఱిఁగించెద నెంతయుఁ, బనివడి గణికాజనంబు పద్ధతులెల్లన్
వినయంబలరారఁగ నో, ఘనులార! సవిస్తరంబు గానిఁక మీకున్. 93

గీ. మ్రొక్కుఁదీర్పనరులు తమపుత్రికలను, దేవునకునీయఁగా వారు దేవతాల
యముల నాట్యముసేయుచు నంతనుండి, దేవదాసురాండ్రనఁబొల్చి రీవసుధను.

గీ. అప్పుడు జితేంద్రియలగుచు నలరుచుండి
క్రమముగా మగవారి యాక్రమముచేతఁ
గామసంచారిణులగుచు గణికలనెడి
పేరు దాల్చియీరీతి వృత్తిఁగొనిరి. 95

—వేశ్యాదుర్వృత్తి.—

ఆ. "విటుఁడు లేని రేయి వేదనఁ జెందుదు, నిదుర కంటి కెఱుఁగ నేరకుండి
కాసొసంగునట్టి కడజాతివాఁడైనఁ, గలుగఁగోరు వారకాంత మదిని." 96

సీ. కడుఁగురూపినినైనఁ గందర్పనిభుఁడంచు, నభినుతియొనరింతు రలఘులీల
నంత్యజన్మునినైన నమలవంశజుఁడంచుఁ బలుకుదు రెంతయుఁ బ్రౌఢిదనర
నతిమూఢమానసుఁడగుమానవునినైన సరసుఁడటందురు సరభసమున
బ్రహ్మహంతకునైనఁ బరమధార్మికుఁడంచు, గణుతింతురెపుడు నుగ్రమముతోడ
గీ. నెన్నఁగల్గిన నీతివిహీనుఁడైనఁ, దవిలి సద్వర్తనుండంద్రు దమకునొకఁ
వీసమైనను గాసైన వీడమైనఁ, జేతికొసఁగినచో వెలచిరుకఁబోండ్లు. 97

ఉ. చిన్నెలవన్నెలన్ వగలఁ జిత్రవిధంబుల ముద్దుమాటలన్
వెన్నెలనెన్ను నవ్వులను వేమఱుబిత్తఱివాలుఁజూపులన్
సన్నలసైగలన్ మిగుల జాణతనంబున వారకామినుల్
చెన్నగఁ బల్లవప్రతతిచేత ధనంబును దోఁతురెప్పుడున్. 98

సీ. ఒకమాఱుపయ్యెద నోరగాఁదొలఁగించి, సవరించు జిగిగుబ్బచన్నులలర
నొకమాఱు సోగ వెండ్రుకలబలి నునుగొప్పు, నడలజల్లునవిప్పి ముడుచుచుండు
నొకమాఱు మణిమయప్రకటభూషణములు, వదలించి తిరుగఁగఁ గుదురుపఱుచు
నొకమాఱు నవ్యనూత్నకమణీహారముల్, కొనగోటఁ జిక్కులుగ్రుచ్చి తివియు

గీ. తెలిఁగిమతియును శృంగార చేష్టలలరఁ, గేరుచుండును బెక్కువిహారములను
సొబగుమీఱినవగకానిఁజూచినపుడు, మరులుకొల్పును వెలయింతి మహితగతిని.

చం. పొలుపుగ నిన్నుఁ బాసియొక పూఁటమహాయుగమంచు నెంచుచో
పలనుగనీవు నన్నిటుల వంచనసేయఁగఁ బాడియే? యిటుల్
దలఁపఁగనీతియే? యనుచుఁ దక్కుచుఁ జొక్కుచు నిక్కువంబుగా
వలచినయట్లుమాయలను వారవధూటి భ్రమించుఁబల్లవున్. 100

చం. ధనములవేలపోయిపుడు దాసియునైనగడించు నీక్రియన్
ఘనముగమాకునీచెలిమి గల్గుటయే పదివేలటంచుఁ బె
న్వినయపుమాటలాడుచును వేడుకకానిఁగరంగఁజేసి యొ
య్యనవిభవంబుగొంద్రుగణికాంగనలంతయు నేర్పుమీఱఁగన్. 101

కం. వలచినవానికిఁ బడఁతియు, వలచినచందంబుదోఁచ వలవదుగాకెం
దులనైన వెలపొలంతికి, వలపునుగనకంబునకును వలపునుగలదే? 102

—వేశ్యామాతృవర్ణనము.—

సీ. పల్లవవ్రాతంబు పాలిబల్ రాకాసి ప్రకటితోద్యన్మద్య పాననిరత
గురుతరానేకదుర్గుణగణాలంకార, సకలమాయావాదజననసీమ
ఘోరకోపవికారపూరితనిజచిత్త, కఠినవాక్యక్రియాగ్రథితరసన
ధరనసీతులకెల్ల గణుతుమీఱినతావు, దానధర్మదయావిధానహీన

గీ. శాకినీభూతబేతాళ సముదపైత్య, భీకరాకారవిజయగంభీరనినద
సుమశరారామమార్గభాసురసమగ్ర, లగ్నకలకంఠయుతవల్లి లంజతల్లి.

సీ. కాఱుచన్నులు తఱుచుగా నెరసినవెండ్రుక, కొప్పుమీఱఁగదువ్వి కొప్పుముడిచి
యెలఁబ్రాఁతచెప్పుటట్లుఁబోలి వ్రేలాడు, కుచములరవికెచేఁ గుదియఁబట్టి
వాడిగినకఁబుసంబు వడువునమడతలే, ర్పడియెడు నొడలిపైఁ బసపురాచి
యొలుఁగుతోలును మీఱియెంతయుమాసిన, పెద్దపుట్టముచాలఁ బ్రీతిఁగట్టి

గీ. బొరుసునొసటనుజంద్రింబు బొట్టువెట్టి, యడుసుకన్నులఁ గజ్జలంబడరదిద్ది
బోసినోటనుదమలంబు పూనియిటుల, విటులఁబలుమాఱునగఁజేయువృద్ధవేశ్య.

గీ. ఛత్రమైననుదగు మహాపద్మమైన, శంఖమైననొసంగినఁ జాలకుండి
ధనదుమెచ్చఁగోకింతలైనఁ దనకుఁగల్గు, విత్తమంతయు నీకున్న వేశ్యజనని. 105

కం. వసదాగ్రిగినపులుఁగుఁ గ్రియ్యన్, విసువక తగఁ బ్రేలుకొనుచు వేశ్యాంబకడుం
పసరేగి బూతులాడుఁ, బసగల్గని యోగియణఁగఁ బల్లవతతులన్. 106

ఉ. ఆకులుపోఁకలున్ మణులు హారములున్ బహుగంధసారముల్
కోకలు రూకలున్ మదినిఁ గోరినయట్టి సమస్తవస్తువుల్
బ్రాకటమొప్ప మ్రాయలాగిఁ బన్ని భ్రమించుచు నేర్పుమీఱఁగాఁ
జేకొనుఁబో విటావళులచే గణికాంబవిచిత్రవైఖరిన్. 107

సీ. మిండఁడొక్కనాఁటి రేయి రాకుండెనేనిఁ, గానువీసంబు చేతికిఁ గల్గనేని
కించుకేనియు నిదురఁబోనీదు కూఁతు, గడనఁబోఁడియవ్వ పెట్టుఁ గంచుమువ్వ.

—ఆర్యజనపాపరాజులు.—

వ. ఇట్లు భ్రష్టాగ్రగణ్యులైన మహాకవులచేఁ దృణీకరింపఁబడిన వారకాంతలం గడజాతిగాఁ జేసి, యుత్తమబ్రహ్మచర్యనిష్ఠాగరిష్ఠులును, సంఘసంస్కరణకర్తలును, లోకోపకారపరాయణులును నగు మహర్షిశ్రేష్ఠులు పశుసంయోగప్రాయశ్చిత్తమే వేశ్యాసంగునకు నియమించిరి. అట్టినియమమును లక్ష్యపెట్టక రాజ్యమదాంధులైన కొందఱు ప్రభువులజ్ఞానులై వారకాంతలను దమ భార్యలంగాఁ జేసికొనుచు వచ్చిరి. 109

—ఆర్యహీనదశాదికారణము.—

గీ. అట్టిరాజులప్రోత్సాహమంది వేద, శాస్త్రములఁ బురాణముల నెసఁగు నీతి
గానకతిశయోక్త్యలంకారము నురచించి, వారిఁ బొగడఁ దొడఁగిరి ద్రవ్యపరకవులు

గీ. అంతతోఁ దృప్తినొందక యజ్ఞ ఫలఁ జెఱుఁగఁ బరకీయారసాభాసగతులు చేసి
పచ్చిబూతులబుంగ ప్రబంధములను, జేయుచును దామఁ బ్రభులతోఁ జెడిరి వారు.

వ. అట్లు బయలు వెడలిన కవిత్వములను జూచి యసాధ్యధర్మంబులం బోధించు వేదశాస్త్రపురాణములకంటెఁ బ్రత్యక్షసుఖధర్మంబులం బోధించు తత్కావ్యములనే ధర్మశాస్త్రములుగా గ్రహించి. 112

సీ. ఆరసాభాసము జారత్వమువలన దోషంబు లేదనితోఁపఁ జేయఁ
నతిశయోక్తిపురాణమందలి కథలెల్ల నిక్కువేయనునూహ పుట్టఁజేయఁ
బరకీయవర్ణించు భావంబు విధవను బెండ్లాడవచ్చునన్ విధినిఁ దెల్ప
బహుకృతిషష్ఠ్యంత పద్యముల్ ప్రభుకంటె విష్ణుండు లేఁడని వెల్లడింప

గీ. సతతసంభోగమార్గ సంచారులైన్వ, భార్యలవిడిచి సంతతింబడయక పర
లోకమతివీనమంతయులేక, కాంతి, బలచిరాయుర్విహీనులై ప్రజలుచెడిరి.

గీ. అట్లుచెడి హీనులై స్వకీయార్య మతము
మహిమ మఱచి యనేక దుర్మతములంగాని
లౌకికమత్యము లేక కాళ్లుడుకొనుచుఁ
బ్రభువులు నశింపఁ బాడైరి పలువిధముల. 114

గీ. ఇట్లుచెడి హీనులయ్యును నిది కలియుగ
మనుకొని మఱియుఁ జెడుచుండిరకట! యిర
యఁ "కృషితోనాస్తి దుర్భిక్ష" మనెడు పరమ
మౌనివాక్యరత్నము వీరు మఱచిరొక్కొ. 115

గీ. స్త్రీనిఁగూడితపముమౌనిహీనులైన, యీప్రజలు మఱియుఁ జెడఁగనిప్పటికవి
వరులుబూతుకవిత్వముల్ వదలలేదు, హిందుదేశము దౌర్భాగ్యమిట్లులుంచె

—సకలజనకర్తవ్యము—

క. కానఁగ వివరులమల, జ్ఞానప్రదకృతులు సేయ సమ్మతిపడినన్
మానవులారోగ్యగము, మౌనివచోరీతినున్న మఱలసుఖమగున్. 117

—పాపరాజ హీనదశా ప్రారంభము—

క. ఆరీతినివేశ్యాప్రియుఁ, డైరాజిలుపాపరాజు నామదురుజనుల్
క్రూరాత్ముఁడుపాపాత్ముఁడు, ఘోరాత్ముఁడు వీనిఁదాఁక కూడదటంచున్

గీ. అట్టులుండియాపాపరాజాగణికకు, హెచ్చుధనమిచ్చుచునుసింక నీయననుచు
నుండలేకయిచ్చుచునిట్టులున్నదెల్ల, నిచ్చెవ్యసనమేదైనను నిట్టిదెగద! 119

గీ. అట్టులావారకాంతమాన్యములునిల్లుఁ, గూడఁదనపేర వ్రాయించుకొనియతనికిఁ
దనగృహంబులోనేకొన్నిదినములవఱ, కన్నమును బెట్టిపోషించి యాదరించె

గీ. ఆవిధమునఁగులభ్రష్టుఁడైనవాని, నెల్లవారును వెలివేసి హీనునివలెఁ
జూచుచుండిరి, పాపపుసొమ్ముపోయి, నట్టిగతిచూచితిరె? యోమహర్షులార. 121

—పాపధనలక్షణము—

క. ఆటలకునువేఁటలకును, బాటలకును లంజయింటిబాటలకును బూఁ
దోఁటలకును జోటులకును, నీటులకును గర్వపడును నీచధనంబుల్. 122

క. పిట్టలకును బట్టలకును, జుట్టలకును ద్రాగుఁబోతు చుట్టంబులకున్
రొట్టెలకును బెట్టెలకును, గట్టెలకును గర్చుపడును ఖలజనధనముల్. 123

క. ఫేనిలఫలడిండీరము, హీనాసక్తిం దినెడి మహిలతభంగిన్
హీనములగు భోగంబులె, హీనాత్ములు గోరుదురు మహీతలమందున్. 124

సీ. సకలోపకారక సత్కార్యమొక్కటైన నెలమితో నచ్చువేయింపలేదు
జపతపంబులఁ బ్రజ కుపకారమును జేయు విప్రులకన్నంబు పెట్టలేదు
భక్తిమార్గము వృద్ధిపఱచెడి దేవాలయంబు ప్రతిష్ఠఁ జేయుంగ లేదు
బాటసారుల శ్రమ పరిహారమును జేసి తెలయు నూయైనఁ ద్రవ్వింపలేదు

గీ. చివరకొకయాచకుని బట్టి చెంగులోనైన నాక్రిబియ్యపు గింజయైన వేయ
లేదు, వెలయాలికంతయు లేదనకయె, పావధన మెల్ల నడినాఁడు పాపరాజు.

మ. సతతస్త్రీరతిచేత దుర్బలుఁడు, వేశ్యాసంగతిన్ రోగియుం
గతరూపుండు, నధర్ముఁడౌటను బ్రజా గర్హ్యుండు, నిర్భాగ్యతన్
మతిలేకుండిన వాఁడు, నౌనతని దుర్మార్గంబుగా వేశ్య "నీ
గతియింతే" యనిత్రోసె నిష్కరుణతోఁ గౌపీనపుం గుడ్డతోన్. 126

క. మందులతోడబ్బుటచే, మందులతోడబ్బు సుఖము మానినవిటులా
మందులతోడగు గతినేమందు? లతోర్వంగి వేశ్య యంటటు సేసెన్. 127

వ. అంత గోరుచుట్టుపై రోఁకటిపోటు సామెతగాఁ దత్పాపరాజు దౌర్భాగ్యమోయనునట్లు దురంతదుర్దాంత సంతాపసంతత సంతాపిత సకలాశాంతమగు వసంతానంతర కాలమే తెంచి యనంత ప్రభావంబు సూపందొడంగె.

—గ్రీష్మర్తువర్ణనము—

ఆ. పగటు సూర్యప్రతాపంబువలనఁ జూడ, రాత్రినుక్క చేనిల్వఁ దరంబుగాక
యఖిలలోకజాలమునకు నాదిభూత, మయ్యె నాదిభూతం బైన యట్టి మిన్ను.

గీ. ఉడుకుచేఁ దాపమును బొంది యూర్ధ్వమునను
శ్వాసము విడుచు త్రాఁచు విసంబు గలిసి
మలయమారుతము విలయ మారుతమయి
యఖిలజనులకు బాధక మగుచుఁ దోఁచె. 129

సీ. పగటబయటికేగి పనులొనర్పకయుండ గాఢోష్ణమైమండు గాడుపగుచు
సంధ్యాసమయమున సావడుతజిదీపికల నార్పగా సుడిగాలియగుచు
నిశయందు సుఖముగా నిద్రింపవీలుగాకుండ రూపము మాఱియుక్కయగుచుఁ
దెల్లవాఱునపుడు తెలిసిలేవఁగ వీలుగాకుండఁ గడుచల్లగాలి యగుచుఁ
గీ. బుడమియందు సర్వాధార భూతమైన, గాలియే యిట్లు శత్రువై గాఢమైన
శ్రమముపెట్టుచున్నది, యింకఁ బ్రాణితతుల కెట్టుతిన్న యన్నము మేనఁబట్టునకట!
సీ. సూఁడు వెడలిరాఁగ నుష్ణనకొక్కలు గాల్చిపక్షులనట్టె కూల్చివైచి
గడ్డియునీళ్ళును గలుగకుండఁగఁ జేసి పశుజాతములు బాధ పడఁగఁ జేసి
బయటికేతెంచిన వచ్చెడుపురుగుల మలమలమాడ్చి భస్మంబు చేసి
యేమైనఁ బనిసేయ నిల్లు వెడలిరాఁగ నఖిలజనంబుల నడ్డుపఱచి
గీ. సూర్యరూపంబు గైకొనిశోభగాంచు, నగ్నిసంపూర్ణ యౌవనమందిరేగి
ప్రాణికంటమై యిండ్లు వనములు మొదలైనవానిని మృత్యువై యణఁచుచుండె.
గీ. సగముకాలినచిదుగులు సంగ్రహించి, కాకులిండ్లపైఁ బెట్ట నాకట్టెలఁగల
యగ్ని చేనిండ్లుగాల సూర్యకిరణములుల, నగ్ని పుట్టినదనుచుండిరహహా! జనులు.
చ. తనప్రియభోగభామిని శతక్రతుదిక్సతి యావకాయదా
నొనరెడు నిచ్చఁబెట్టుకొనుచున్న తఱిం జని వాలుకయూనఁగా
ఘనముదమందుచుణ్ సగముకారము దాఁక భుజించివచ్చెనో
యనరవియాత్మ తీవ్రరుచి యావనుగల్పినయట్లు పేరిచెణ్. 133
గీ. దాహమానుదీర్పు నెపముచేఁ దరుణముఁగదుఁ
బరమమిత్రునివలెఁ గానఁబడుచు లోన
నమరు శీతమునకు సహాయమయి నీరు
చల్లచల్లగా దిగ గర్భశత్రువయ్యె. 134
ఆ. అడుగుపెట్టఁగానె యఱకాలి మంటను, నెత్తికెక్కఁజేసి మిత్రియగుచు
నెట్టిసస్యఫలము నీయకభూమియు, బాధపెట్టుచుండెఁ బ్రాణితతుల. 135
క. ఉర్వియట్లపెనంబయ్యె, నుదకము చము రయ్యె, మిను వేఁడిమంగలంబయ్యె, గాలి
పొగుపుఁబొగరయ్యెరవిగాడిపొయ్యియయ్యె నయ్యయో! జగమికఁ వేగకాగఁగలదె
వ. ఇట్లు పంచభూతంబులును మహాఘోరాకారంబులగుటంజేసి యమ్ముంపువేసవి భయంకర ప్రళయకాలంబువలెనుండె. 136

ఉ. కాలహరుండు సూర్యుఁడను కంటిని విప్పి లయంబు సేయుచో
మేలిమిదివ్యమూర్తులయి మింటఁ జెలింగెడు దేవమానుల
ట్లాలయ సౌఖ్యముల్ గను ధనాఢ్యులఁ గూడఁ గలంచెఁ గొంత త
న్నీలగళిస్ఫురత్క్షరతఁ దేల్చయి జెట్టులు దోమ నల్లులై. 137

చ. పడమటినుండి వచ్చినయు వచ్చు వగాడ్పన కోర్వకయ్యనూ
రుఁడు పెడమోము వెట్టుకొని రోయుచునుండె ఘమటూర్చుకొంచుఁ ద
త్తములను దోల్కుటకై రవిరథంబు జలేశదిగద్రికిం జనం
దడవగుచుండెఁ గొంత యతిదారుణమై తగునట్టి వేసవిన్. 138

గీ. చెమట తనువున నింకినఁ జేటు వచ్చు
ననిరయింగక చల్లగనుండునని కడు బ్రభువు
పడమఁ గొండలు చౌకట్లు దొడుగుచుండి
గదిరయొక గొప్పతాకిక మనుకొనుచును.

గీ. ఎప్పుడుఁ గాళ్లైనఁ గడుగని హీనులు కడు, కాగలేక నిత్యస్నానమునకైరి యపుడు
దెబ్బ తగిలినప్పుడు గదా దివ్యమును, మతము కడు కుండి దైవయోప్వమందులకును.

సీ. క్షుత్పిపాసలు దీర సుఖమును బొందంగ లలితంబులైన ఫలంబులిచ్చి
యాయాసమెల్లను హరియింపశయినింపఁ, దమరయొద్ది నున్న నిస్థల మొసంగి
యెండవగులకుండ నెంతొదట్టంబైన తమనీడయనెడు ఛత్త్రంబుపట్టి
చక్కఁగా నిద్రింపఁ జల్లఁగానుండంగ నాకు వీవనలచే నమరవిసరి

గీ. వృక్షరాజరాజులు కల్పవృక్షములన, వెలసితామెండలోననే నిలిచి బాట
సారులకతిథిపూజలు సలుపుచుండెఁ, బరమలోభి ప్రజలు సిగ్గుపడ యనపుడు.

— పాపర జాంత్యదశ —

సీ. బహువిధబాధల పాలుగాఁ జేసి బ్రాహ్మణభూములు చెఱచినట్టియఘముఁ
గరుణయింతయు లేక కడుబీదలను దండమున కతిబాధపెట్టినయఘంబుఁ
దన్ను నమ్మినరాజు తాళంబు పట్టి ద్రోహము చేసి చెఱచినయట్టియఘము
వైష్ణవు సేడ్పించి వానికాఁపురమును నట్టేటఁ గలిపినయట్టియఘము

గీ. సతతకులాచార బాహ్యుఁడై సంకరుఁడయి
యవనిమార్గదర్శకుఁడుగానట్టి యఘము

నాకట్రసారె పరిణమించి యుక్రమించి
పటుభయంకర దుర్దశాప్రాప్తి నొసఁగ. 143

సీ. అరఁటిచారుగువలె నాఁజిదట్టంబైన కఱ్ఱిళ్ళగుడ్డను బుట్టఁగోఁచివెట్టి
మూఁడుజానలుగల ముద్దైనయొక కట్టి ముక్కునెడమచంకనొక్కిపట్టి
బాటసారులు పాఱవైచినయొక చుట్ట పీఁకెనుగుడిచెవి పైకిఁజేర్చి
పెంటమీఁదనుబాఱవేసిన యొకప్రాఁతచిల్లికుండ నెడమచేతఁగూర్చి
గీ. పాముజబ్బులచేఁ గాళ్ళు పడఁగ లేఁక,
చెండకోర్వకమ్మాయని యేడ్చుచుఁ, గుడి
చేత భూమినిఁసుకొనుచు, సిగ్గులేక,
బిచ్చమెత్తుకొంచుండెఁ, బాపిష్ఠుఁడగుచు. 144

గీ. అట్లుచావఁగాసిద్ధమైనపుడుఁగూడఁ, దల్లిదండ్రులందలఁచి బాధపడుఁగాని
రామ! రామా! యనఁగ జిహ్వరాకయుండె, వానికడమెన్ని జన్మాలపాపమొక్కో?
గీ. ఇతఁడుచేసిన ద్రోహములెల్లఁదలఁచి, పట్టెఁడన్నమునెవరును బెట్టకుండి
రెవ్వరైనఁబెట్టినదానినెగురఁదన్ని, కొనుచుఁబోవుఁగాకులదెంతగొప్పచేటో?
గీ. ఇట్లుచావులేక దురితమెల్లఁదినుచు, బాధపడుచుండె దుష్టుఁడౌ పాపరాజు
మానులార! యత్యుత్కటమైనపుణ్య, పాపములిట్టులిహమందె ఫలమునిచ్చు

—కథాఫలశ్రుతి—

క. కావుననరులితనికథా, భావము బాగుగనెఱింగి పాపపుఁరీతిం
బోవక పుణ్యముచేసినఁ, గైవల్యపదంబునొంది కాంతురు సుఖముల్. 148

—వివేకానందచరిత్ర—

సీ. కామహరిశ్చంద్రకౌశికుండురుకోప భావవిశ్వామిత్రముని వసిష్ఠుఁ
డతిలోభ కార్తవీర్యార్జున భృగురాముఁ డురుమోహ భృగురామధరణిజేశుఁ
డతిమదవృత్రాసు రాసురనాథుండు, గాఢమత్సరవజ్రి కలశజన్ముఁ
డజ్ఞానజైమిని ప్రజ్ఞాఢ్యబుద్ధుండు చాచంల్యచార్వాక శంకరుండు
గీ. బ్రహ్మరూప సుమత్యంశ భవుఁడు, మోహి
నీసుతుఁడు, వివేకానంద నిస్తులాఖ్యుఁ
డచట బళ్ళారిపురిని విద్యాళిసార
మరసిప్రహ్లాద ధ్రువనార దాభుఁడయ్యె. 149

వ. ఆబాలభాగవతశ్రేష్ఠుండనేక జన్మాంతరానంత సుకృతపరిపాక సంప్రాప్త సహజవైరాగ్యంబునంజేసి మనంబుపూనక బ్రహ్మచర్య నిష్ఠంబరఁగఁగలి ప్రపంచమున దేరిచూచి విచారించి సంఘసంస్కరణాభిలాషుండయి "బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజే" త్తను బృహదారణ్యవాక్యమును "రాతినాసంభాష్యయథార్థంగచ్ఛతి" యను నాపస్తంబసూత్రమును జూచి గృహస్థాశ్రమయు నైకల్పికమనియు "నపుత్రస్య గతిర్నాస్తి" యనునది గృహస్థధర్మమనియు నిశ్చయించి, దానిచేవచ్చిన సృష్టిభంగశంకను కృతత్రేతా ద్వాపరంబులలోఁ బురుషులస్మరణ దర్శనస్పర్శనములవల్ల స్త్రీలకు గర్భమయ్యెడిదనియు, ద్రౌపద్యాదులుకొందఱు మంత్రశక్తిచే హోమకుండములోఁబుట్టిరనియు, విశ్వామిత్రాదులు సంకల్పమువల్లనే సకలవిధసృష్టిచేసిరనియు నిట్టిగలపురాణవాక్యములవల్లను, సకలప్రపంచమును మనస్సనందేసృష్టిస్థితిలయములనుబొందుచున్నదనువేదాంతశాస్త్రసారాంశముచేతను సృష్ట్యాదినిస్వాయంభువమనువువఱకు జరిగినది స్త్రీరహిత సృష్టియని కలప్రసిద్ధిచేతను నివృత్తిచేసికొని శుక్ల శోణిత మల సంభవసృష్టికంటె నుత్తమతపస్సంభూత మనోబలమువల్లఁజేయు సృష్టివిశేషాయుర్బలకాంతులుగల్గియుండుననియెఱింగి, సృష్టికి సంగమము ప్రధానము గాకున్నయెడల దానికి గ్రామ్యధర్మమను పేరే యుండదనియు నిశ్చయించి బ్రహ్మచర్యాశ్రమమునుండియే విధ్యుక్తముగా సన్యసించి, యుత్తమయోగ సాధకముచే నూర్ధ్వరేతస్కుండయి, యథామచారుండగుటవలనం బ్రాయశ్చిత్తరహితుండయి, శంకరాచార్యునివలెఁ గలియుగసన్యాస నిషేధనిషేధుండయి, పరిపూర్ణవీర్య స్తంభనంబుచేఁ గలిగినయుత్తమబ్రహ్మతేజస్సును జూచిమోహించి తమ్ముఁ బెండ్లాడుమనికోరినయనేకమహాభాగ్యస్త్రీలను మాతృభావంబునం జూచుటంజేసి యులిగిందల సన్యాసులను సిగ్గుపఱచుచు మొదట బ్రహ్మానందప్రభువును దర్శించి యచ్చటఁ గొన్నిమాసములుండి సంకరపురిని సంస్కరించి శంకరపురియను నామంబుపెట్టి యాప్రభు ధనసహాయముచేఁ బ్రపంచసంచారము గావించుచు నతిగంభీర వాక్ప్రవాహముచే నార్యమత భూమింబరిశుద్ధంజేయుచు నడ్డువచ్చిన దుర్మతవృక్షంబులను మూలముట్టుగఁ బెల్లగించి చాఁవచట్టుగఁ బడఁద్రోయుచు మహర్షిశాసనప్రకారముగా ధర్మరక్షణంబు సేయుచుండె. ఓకౌశికాది మహర్షిశ్రే

ష్ఠులారా! కలియుగమునందింకఁ గొన్నిశతాబ్దంబులు గడచినకాలంబున నేను జెప్పినరీతిగా సహజపావన జ్ఞానంబునం బ్రకాశించు సుమతీబ్రహ్మానంద వివేకానందులచేతను, బశ్చాత్తప్తయగు మోహినీకాంతచేతను వేదశాస్త్రపురాణయుతము రక్షింపఁబడఁగలదు. ఇది యంతయు మదీయ దివ్యదృష్టిం జేసి స్పష్టముగా నేనుగాంచి యిదివరలోవలెనే జరిగినకథవలె మీకుఁ జెప్పితిని. ఈ వేదమతమిట్లనేకాపదలనొందుచు భక్తవర్యులచే రక్షింపఁబడుచుఁ గలియుగాంతమునకు బీజభూతంబై నిలిచి కృతయుగంబున మఱల యథాప్రకారముగా విజృంభింపఁగలదు. భవిష్యత్కాల శుభకారణములైన యాగాది సత్కర్మములు సేయు[illegible]టకుఁ గలిప్రజ లసమర్థులగుటచే నీదీర్ఘ సత్రయాగము కల్పించిరయే యాకాలంత దీర్చుటకుఁ [illegible]సను. ఇట్టి లోకోపకార కార్యంబున మీరును శ్రీహరిదయకుఁ బాత్రులయిరి. 150

—ఫలశ్రుతి—

క. సకలానందదమగునీ, సకలానంద ప్రబంధసారస్యంబుం
ప్రకటమతి నెఱుఁగునాతఁడు, సకలానందంబులంది సద్గతివడయుక్. 151

సీ. బాలుండువృద్ధునివలె నెఱుంగును వృద్ధబాలునట్లు పవిత్రవర్తనుఁడగు
స్త్రీపురుషువలె నాత్మస్థిరతగాంచును బురుషుఁడు స్త్రీచతుర్గుణ సుమతిగాంచు
బాషండుఁడార్యుఁడై పరఁగునార్యుండు పాషండతుల్యుండన సన్యసించు
నజ్ఞానిసుజ్ఞానియగును సుజ్ఞానియజ్ఞానియై మోక్షరాజ్యంబు నేలు

గీ. లౌకికుఁడు వైదికుని విమలత్వమందు, వైదికుఁడులౌకికు కుశలత్వంబునందు
నతులమగు సకలానందకృతిని వ్రాయఁ, గన్నవన్నను, విన్నను, గన్న, నెన్న.

సీ. పతియుసంతానంబు భ్రష్టులైయున్నను సుమతినెయ్యది పూర్ణసుమతిఁ జేసె
సకలసంసారంబు వికలమైచనినమోహినినేది మోక్షమోహినిని జేసె
నతిబాలుడఁగు వివేకానందవిదుని నెయ్యదివివేకానంద విదునిఁ జేసె
నతిరాజ్యమదుని బ్రహ్మానందమేశుని నేదిబ్రహ్మానందమేశుఁ జేసె

గీ. నాసదానందమేసకలాంచితమయి, శాశ్వతయశమై, శ్రీరామసత్కృతియయి
నిరుపమానమైతగదాని నిందలఁగొను, శ్రీమతులుసకలానంద సిద్ధిగనరె? 153

సీ. మూఢరాజనుభూమిపుండతిపాపరాజై చావదుర్గతిఁ బైచెనేది ?
పాపరాజనుమంత్రి పతియతిమూఢరాజై హీనదశనొంద నలఁచెనేది ?

పాపరాజసుతులు బలునవాచారాతి బలులైచెడఁగ సిగ్గుపడఁజేసెనేది ?
బలునవాచారాతి బలులతిపాపరాజ సుతులైచితింప నలిపెనేది?

గీ. యానదానందమేసకలాంచితమయి, శాశ్వతయశమై శ్రీరామసత్కృతియయి
నిరుపమానమైతగదానినిందలఁగాను, శ్రీమతులు సకలానంద సిద్ధిఁగండ్రె?

క. సకలాచ్ఛముక్తిసాధిత, సకలాశ్రమవర్గధర్మ సకలార్చితమై
సకలానందసుకావ్యము, సకలానందంబులీదె? సకలాదిమమై. 155

క. అనవినిశౌనకముఖ్యులి . ట్లనిరోసూతా! సుకృతమహాంహోరీతుల్
వినిపించితివన్ని యుఁద్భ, ప్తినగనెమది; యింకలేవు వినఁగ గుణనీతుల్. 156

—నిందాపూర్వక నీతిబోధచర్చ—

గీ. ఒకసందేహమిపుడు మాకుదయమయ్యె, నందచేయుచుఁ జెప్పితి నీవునీతి
యిట్టినీచుబోధమువిననేల? యంచు, నెల్లరునునిన్నుఁదిట్టుదురేమొ జనులు. 157

క. అనగావినిసూతుఁడె, ట్లనిరొక మునులార ! మీకహర్నిశలమహా
ఘనగాథలనేకంబులు, వినిపించితినందుఁదిట్టు విధములుగలవే ? 158

వ. నేనువినిపించిన పురాణకాలములోని జనులు సామదాయక ధర్మముచేత విశేషనీతివర్తనులయి యుండెడివారు. కావున నప్పటికెందగినట్లుత్తమ బ్రహ్మజ్ఞానాదినీతులు చెప్పితిని భవిష్యత్తుననశక్తులయి దుష్కృత్యములు సేయుదురు గనుక వారిపనులలోనికీడును వెల్లడించి దేశకాలపాత్రములను సారముగా ధర్మములుచెప్పితిని. మహర్షిసంతతి వారగుటచే మనకు సహోదరులును గుమారులును నయిన యార్యులను నిందించిన నాకేమిలాభము ?

క. సత్యముగాశ్రీమునులయ, పత్యమునందేజనించి భారతమాతన్
నిత్యముగొలిచెడునార్యుఁడు, సత్యముగనకున్నె? నాదుసద్వాక్యములన్. 160

—క్షేమాధిజనకకర్తవ్యము—

శ్లో. సులభాః పురుషాలోకే, సతతంప్రియవాదినః
అప్రియస్యచపథ్యస్య, వక్తాశ్రోతాచ దుర్లభః.

గీ. ఎంతచెడుపనిఁచేసిన నీవెగొప్ప, వాఁడవని ముఖప్రీతిగాఁబలుకువారు
సులభులిదినీకుఁ తగదనిపలుకువారు, దానివినువారు దుర్లభుల్ధరఁనియందు.

ఉ. కాననుశాంతచిత్తుఁ డయి కామముఁ గ్రోధముఁ జంపివేసి త
న్నే నరుఁడైనఁ దిట్టునెడ నియ్యది నాయభివృద్ధిహేతువే
గాని శుభంబుమాన్పునది గాదనుచుందన కున్నలోపము
మానుటకుం బ్రియత్నపడు మానవుఁడే సుఖవంతుఁడౌ భువిన్. 162

ఆ. అల్పజనుఁడు తిట్టు టదొక లెక్కయెగాదు, ఘనుని తిట్టునీతిగఁ దలఁపవలె
దిట్టునట్టివానిఁ దీవ్రకోపంబేఁచుఁ, బడ్డవాఁడు చెడ్డవాఁడుగాఁడు. 163

క. తనబాగుగోరి "గోలీ, లనాడక చదువుకొను" మని లాలించుచుఁ జె
ప్పినతండ్రిమాటనువినని, తనయుఁడుచెడిపోవుగాని ధన్యుం డగునే? 164

— సంయమిప్రాయశ్చిత్తము. —

వ. కావున నా విషయంబున మనము సందేహింప వలసినపని లేదు. అయినను వా
జ్ఞ్నియమనుగలవారగుటచే సంయమి నామము ధరించిన మనకు మనపుత్రులకు
హితోపదేశముసేయుమార్గము గానైనను బరనిందాకృత్య మొకింత సంభవిం
చినది గనుక సకలపాపనాశన కరంబైన గోవిందనామస్మరణము సేయుదమ
ని యతండును శౌనకాదులును గలసి బాహువులు పైకెత్తి కన్నులు మూసికొని
భక్తిపరవశులైయిట్లు స్మరణగావించిరి. 165

— గోవిందాష్టకము.-

క. వందారుసనందనముఖ, బృందారకమౌనినాథహృదయనివాసా
నందా? పావనసేవక, బృందార్చపదారవింద శ్రీగోవిందా. 166

క. అరుణాంబుజనేత్రద్వయ, తరుణాంబుజచరణ శత్రుదారణ భాస్వ
త్కరుణా వరుణాలయ శ్రీ,వరుణాద్యర్చిత ముకుంద వరగోవిందా. 167

క. శారద నీరద నారద, పారదహారదరహీర భాసురకీర్తి
వారణ వారణ వారణ, మారణ కారణసుశక్తిమయ గోవిందా. 168

క. ఉరుపీతాంబర చపలా, హరిచాప దరస్తనితవరామృతవర్షా
విరతావిత నతచాతక, పరమోజ్జ్వలగాత్రకంద వరగోవిందా. 169

క. వరవాగాశ్రితకీరా, విరతఫలద బాహుకల్పవృక్షా! విమలాం
బరగంగామకరంద, స్ఫురదంఘ్రిపయోరుహా! జిత ముర! గోవిందా. 170

క. అలకాళిస్ఫురదానన, జలజా! యసిచాపశంఖచక్రగదాద్యు
జ్జ్వలలాంఛనకర! మృదులా,మలభోగశయన! త్రివిక్రమా గోవిందా. 171

క. అనయాజామిళరక్షక, ఘనరాజ! కుచేలపోషక త్యాగివరా!
అనుపబలిదర్శకపా, వనభక్తత్రాణదీక్ష! వరగోవిందా. 172

క. యమభటభీకరనామా! యమితభవాంభోనిధి ప్లవాయితచరితా!
సుమనోనాయకసామ్రా, జ్యమహాలాభప్రదపద! హరి! గోవిందా

—సూతశౌనకాదిబ్రహ్మలోకవాసము—

వ. ఇట్లు స్మరించి.

క. సంతతసద్బాధకము, శాంతులగు కలిజనములకు దర్శనమీఁగా
నెంతయు నొల్లక మునివరు, లింతకుముందె యటకేగు టెఱిఁగినవారై.

వ. తాము నైమిశారణ్యమునుండి లేచి మేరుపర్వతోపరిభాగ భాసితంబును, వాయుగోళాంతరస్థ సూక్ష్మప్రపంచ ప్రకాశితంబును దివ్యతపస్సంప్రాప్త పూర్ణమనోబలసంపన్న దృష్టిగోచరంబును, సకలదేవాలయగోపురంబును నగు బ్రహ్మలోకంబున నంగజని మంజులతాయోగ కర్ణికాశోభిత, యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణసమాధి నామాష్టదళ విరాజిత, నిశ్శేషకళ్యాణగుణ గణాఖండపరిపూర్ణ సచ్చిదానంద పరబ్రహ్మమూర్తి కమలాక్షుద్విరేఫాంచిత సుఖస్వనికమఖులయి, యా పరమహంసలు పరమహంసలయి యుండిరి. అప్పటినుండియు భూలోకము మహర్షిసంచార శూన్యంబగుటచేఁ గేవల సత్త్వమాత్రగోచరములయిన యార్యమతవిషయములకు దృష్టాంతము చూపించువారు లేక సూతుండీగ్రంథంబునం జెప్పిన భవిష్యత్కాలచర్యలు పుట్టి పెరుంగం దొడంగె.

అష్టదళపద్మబంధము—

స్రగ్విణి. తారకాదీప్తితా! తార్క్ష్యపక్షాశ్రితా!
తారకాధ్వస్థితా! తాతనాకాదృతా!
తారకీర్త్యంచితా! తాడితేందారిహితా!
తారకాఖ్యాన్వితా! తాపసారాధితా.

గద్య.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర, కౌండిన్యసగోత్రపవిత్ర, ముత్యసంతానక్షీరపారావారా
త్రిపుత్ర వేంకయార్య ద్వితీయపుత్ర, బాపనార్యపౌత్ర, చినపర్వతయార్యై
కాదశాబ్దపోషితపుత్ర, సీతయార్యాస్వీకృతపుత్ర, సకలజన
కారుణ్యకటాక్షపాత్ర, సీతారామచంద్ర పరబ్రహ్మార్పిత
సకలకర్మ, సూర్యనారాయణమూర్తిశర్మ ప్రణీ
తంబై, యపూర్వాద్భుత చరిత్రయగు
సకలానందనామక నవీన
ప్రబంధమునందుసర్వంబును
షష్ఠాశ్వాసము.

శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మార్పణమగుఁగావుత.

